


మహాసభల ప్రత్యేక సంచిక

# ఐక్య ఉపాధ్యాయ



నాదెళ్ల సీతారామాచారి నగర్
ఒంగోలు

1997 మార్చి 8, 9, 10 తేదీలు

7వ రాష్ట్ర విద్యా, వైజ్ఞానిక మహాసభలు

సంపుటి : 23
సంచిక 4

1997 ఏప్రిల్
వెల: రు.7/-

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ అధికారపత్రిక
THE LARGEST CIRCULATED EDUCATIONAL MONTHLY.

# Messages

**Deputy Press**
**Secretary to the President**
President's Secretariat
Rashtrapati Bhavan
New Delhi-110 004.



No. 2 -M/97 4th March, 1997

Dear Shri Reddy,



The President of India, Dr. Shankar Dayal Sarma is happy to know that the Andhra Pradesh United Teacher's Federation is organising its Seventh Education and Cultural Conference from 8th to 10th March, 1997 at Ongole, Andhra Pradesh.

The President sends his greetings and best wishes on the occassion.

Yours sincerely,
Akshey Kumar

---

Officer on Special Duty
To the Vice-President of India
New Delhi - 110 011.



20th January, 1997
Dear Shri A. Venkataswamy,



Kindly refer to your letter dated the 17th January, 1997 received by Fax inviting the Hon'ble Vice-President of India to the Educational and Cultural Conference of the United Teachers' Federation of Andhra Pradesh at Ongole, Prakasam Dist., Andhra Pradesh on 8, 9th March this yar.

The Hon'ble Vice-President thanks you for your kind invitation but sincerely regrets his inability to accept as he has already committed to programmes elsewhere during this period. Nevertheless, he conveys his wishes for the success of the conference.

Yours Sincerely
N. Balachandran



**N. Chandrababu Naidu**
Chief Minister,
Andhra Pradesh.

Hyderabad.
Date : 5-3-97.

## సందేశం



ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 7వ రాష్ట్ర మహాసభ, విద్యా, వైజ్ఞానిక మహాసభలు 1997 మార్చి 8, 9, 10 తేదీలలో ఒంగోలులో నిర్వహిస్తున్నారని తెలిసి నాకు చాలా ఆనందం కలిగింది.

రాష్ట్రంలో విద్యారంగం విశిష్ట స్థాయిలో పటిష్ట మయ్యేందుకు, బాల బాలికలలో వైజ్ఞానిక అవగాహన పెరిగేందుకు యీ మహాసభలు, తదితర కార్యక్రమాలు కీలకంగా దోహదపడగలవని ఆశిస్తూ, ఉదాత్త ఆశయంతో చేపట్టిన మీ కృషి విజయవంతం కావాలని హృదయ పూర్వకంగా ఆకాంక్షిస్తున్నాను.

నారా చంద్రబాబు నాయుడు

---

**Prof. S.V.J. LAKSHMAN**
M.Sc., D.Sc., F.N.A.Sc.,
Vice-Chancellor

Nagarjuna University
Nagarjuna Nagar - 522 510.
A.P. India.

February 28, 1997

## MESSAGE

I am extremely happy to note that the A.P. United Teachers Federation is conducting the 7th Educational and Cultural Conference from 8th to 10th March, 1997.

I wish and hope that the results of the Conference would be highly beneficial to the entire academic community. I wish the Conference all success.

S.V.J. LAKSHMAN

**BODEPUDI VENKATESWARA RAO**
M.L.A.,
Floor Leader,
C.P.I. (M) Legislature Group,
A.P. Legislative Assembly.

Date : 07-03-1997

ప్రియమైన ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి గారు,

ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ సప్తమ విద్యా వైజ్ఞానిక మహాసభలు ౧౯౯౭ మార్చి ౮, ౯, ౧౦ తేదీల మధ్య ఒంగోలులో జరుపుతున్నందుకు చాలా సంతోషిస్తున్నాము. మీరు పంపిన ఆహ్వానానికి నాకృతజ్ఞతలు.

పై మహాసభల్లో విద్యా రంగాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలు చర్చకు వస్తాయనే భావిస్తున్నాను. ఆ చర్చల ఆధారంగా, మన రాష్ట్రంలో విద్యారంగ అభివృద్ధికై తగిన కార్యక్రమాలు రూపకల్పన చేస్తారని ఆశిస్తున్నాము. ప్రస్తుత దశలో విద్యను ముఖ్యంగా ఉన్నత విద్యను కొంత మందికే పరిమితం చేసే ప్రయత్నం జరుగుతోంది. అదే గాక, ప్రభుత్వ సంస్థల ద్వారా నాణ్యమైన విద్యను విద్యార్థులకు అందించకుండా ప్రత్యక్ష పరోక్ష చర్యల ద్వారా ప్రభుత్వము చర్యలు తీసుకుంటోంది. ఈ విద్యా సంస్థల్లో ప్రధానంగా పేద కుటుంబాల నుంచి వచ్చిన విద్యార్థులే వున్నారని నాకన్నా మీకే ఎక్కువగా బాగా తెలుసు. అందువల్ల, ప్రభుత్వ విద్యా సంస్థల్లో విద్యా ప్రమాణాలు పెంచటానికి అవసరమైన చర్యలపై ప్రత్యేక చర్చ జరిపి దానికి కావలసిన కార్యాచరణను పై మహాసభల్లో రూపొందిస్తారని ఆశిస్తున్నాను.

సప్తమ విద్యా వైజ్ఞానిక మహాసభలు సఫలం కావాలని, మీరు రూపొందించిన కార్యక్రమాలు భవిష్యత్తుకు దిక్సూచిగా వుండాలని ఆశిస్తూ,

శుభాకాంక్షలతో...

భవదీయుడు,
బోడేపూడి వెంకటేశ్వరరావు,
శాసనసభ్యులు.

**ALL-BENGAL TEACHERS ASSOCIATION**
Satya Priya Bhaban
P-14, Ganesh Chandra Avenue,
CALCUTTA - 700 013.

Dated : 28th February, 1997.

To
Com. A. Venkataswamy,
General Secretary.

Dear Comrade,

Your cordial letter of invitation to your 7th Conference to be held at Ongole from 8th to 10th March, 1997 has reached our office in time. But unfortunately, I fell seriously ill last month and though I am now convalescing. I am not in a position to attend your conference. Our other comrades also are busy.

I, therefore, send our warm and hearty greetings and wish your conference a grand success.

Fraternally yours,
Tushar Panchanan
General Secretary,
All Bengal Teachers' Association.

**RAJASTAN SIKSHAK SANG**
994-95, Skshak Bhavan, Ramnagar,
Sastry Nagar, Jaipuram - 16.

A. Venkataswamy,
General Secretary.

1st March, 97

Dear Comrade,

We thankfully acknowledge the receipt of your letter dated 11-2-1997, inviting delegates to participate in your 7th Conference to be held at Ongole from 8th to 10th of March, 1997. In this regard we are sorry to inform you that due to some unavoidable circumstances, we are unable to send our representatives to the Conference.

We hope this 7th Conference shall take bold decision to fight Unitedly against the Privatisation and Commercialisation of Education in our country as well as the new financial policies of the Government.

Please convey our sincere solidarity to the teachers of Andhra Pradesh and we wish all the best and success for the 7th Conference.

Thanking you,

Comradely yours,
Ram Krishna Agarwal
General Secretary

**M. Madhava Rao,** Ex. M.L.C.
Retd. Lecturer.
KAVALI - 524 201.
Nellore Dist. (A.P.)

Date : 6-3-1997

Dear Rami Reddy Garu,

Namasthe. Thank you very much for your kind invitation dt. 20-2-1997. I shall never forget that the U.T.F. made me an M.L.C. I shall try to attend the conference on the 8th. But, in case I fail to do so, please accept my best wishes for the success of the conferece.

Yours Sincerely,
**M. Madhava Rao**

IKYA UPADHAYA

Grams : UTIYEF Phone : VJA 63763; HYD 7636840

YEARLY
SUBSCRIPTION 50-00

SINGLE COPY 4.50

IKYA UPADHYAYA
Palparthivari Street,
Vijayawada - 520 002.

# ఐక్య ఉపాధ్యాయ

సంపాదక వర్గము

కొండవీటి జోజయ్య
ప్రధాన సంపాదకులు
కొమ్మారెడ్డి కేశవరెడ్డి
అప్పారి వెంకటస్వామి
దాచూరి రామిరెడ్డి
యం. ఎ.కె. దత్

సంపుటి - 23 ఏప్రిల్ - 1997 సంచిక - 4


## మహాసభలను జయప్రదం చేసిన ఉపాధ్యాయులకు జేజేలు

యు టి.యఫ్. సప్తమ మహాసభలు 1997 మార్చి 8, 9, 10 తేదీలలో పదివేల మందికి పైగా ప్రతినిధులతో మరెవ్వరూ జరుపలేని విధంగా మధురానుభూతులతో దేదీప్యమానంగా జరుపుకున్నాము.

ప్రకాశం జిల్లా మహాసభలు మన ఉద్యమ చరిత్రలో మరొక కలికితురాయి. కమనీయ, మనోహర మధుర దృశ్యం. వెలుగు జిలుగులు విహరించిన వేళ, కనులు మిరుమిట్లు గొలిపిన జన ప్రవాహం, ఎల్లలు మరచిన వేళ, ఎల్లరు అరుదెంచిన వేళ, వేనోళ్ళ వినుతించిన ప్రజ. ఇది ఎలా సాధ్యమయింది!

ప్రాంతీయ విద్వేషాలు మరచి, కేడరునారి వైరుధ్యాలు విడిచి, మేనేజిమెంటు కలతలు విస్మరించి అకుంఠిత దీక్షతో, ఏటికి ఎదురీది సాధించిన విజయాల ఫలితమిది. ఛేదించిన అవకాశవాద విధానాల స్పందన యిది.

ఉద్యమ నిర్వహణలో యు టి యఫ్ దొక ప్రత్యేకత, కార్యకర్తలదొక విశిష్టత, త్యాగలతో కూడిన చరిత్ర దాని సామాజిక స్పృహతో కూడిన పయనం దాని అమరజీవి చెన్నుపాటి అడుగు జాడలలో, ఆయన ఆశయాల మార్గంలో పయనించిన ఫలితం ఇది.

ఉక్కు క్రమశిక్షణ కల్గిన యు.టి.యఫ్. కార్యకర్తలు, ఉపాధ్యాయులు, మరువలేని విధంగా మహాసభలకు తరలివచ్చి, తమకు మరెవ్వరు సాటిలేరని, పోటీ కారని తెలియచెప్పారు. చేవగల కార్యకర్తలకు, చైతన్య వంతులయిన ఉపాధ్యాయులకు ఉద్యమాంజలి సమర్పించుకుంటు న్నాం.

మహాసభలలో దేనికదే ప్రత్యేకత కలది. ప్రతిదీ మన ఆశయాలకు ప్రతిబింబంగానే మలచబడింది. ప్రారంభ సభ, బహిరంగసభ, విద్యా మహాసభ, మహిళా సదస్సు, ప్రజాచైతన్య సదస్సు, సాహిత్య సదస్సు, ప్రతినిధుల సభ- అన్నీ, అవన్నీ ఉన్నతాశయాల ప్రయత్నాలే, సామాజిక స్పృహ ప్రతిబింబాలే.

మహా ప్రదర్శనలో పదివేల మందికి పైగా ప్రతినిధులు, కదంతొక్కుతూ- పదం పాడుతూ, నినాదాలతో దిగంతాలను దద్దరింపజేస్తూ ఊరేగుతూ వుంటే కష్టజీవులు, కార్మికులు, మధ్యతరగతి ప్రజలు, వృత్తిదారులూ, ఉద్యోగులు స్వాగతాలు పలుకుతూ, తమ కష్టాలు తొలిగేందుకు తమందరం సన్నద్ధం కావడమే మార్గమని భావించారు, హర్షించారు.

ఆరు మహాసభలు జరిగిన 8 జిల్లాల నుండి సూదుర ప్రాంతాల నుండి మోటారు సైకిళ్ళపై మండుటెండలు సైతం లెక్క చేయక, వూరురా స్వాగతాలు అందుకుంటూ, మహాసభల ప్రచారం చేసుకుంటూ తరలి వచ్చిన కార్యకర్తలు మహాసభలకే ఓ ప్రత్యేకత సంతరింపజేశారు.

రెండు రోజులు జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనలు తిలకించిన జనం పులకించి పోయారు. ఎగ్జిబిషన్‌లు అందరి ప్రశంసలు చూరగొన్నాయి. పుస్తకాలు విరివిగా అమ్ముడుపోయాయి. ప్రచురణ విభాగం బాగా ఆదరణ పొందింది.

ప్రతినిధులు, ప్రజలు ఎవరి నోట విన్నా, మహాసభలలోని విషయాలే చర్చనీయాంశాలు. విద్యా విధానాల మార్పులు, ప్రైవేటీకరణ అనర్థాలు, అవినీతి మహమ్మారి వికటాట్టహాసాలు, కులమతతత్వాల వలన నష్టాలు, సమానత్వం సాధించవలసిన అవసరాలు, సాహిత్య సమాలోచనలు- ఇలా మాట్లాడుకుంటూ చర్చించుకొంటూ కనిపించారు.

## సంపాదకీయం

ప్రకాశం జిల్లాలోని ఉపాధ్యాయులిచ్చిన విరాళాలతో మహాసభలు జయప్రదమైనాయి. మరే జిల్లా డబ్బు దీనితో కలుపకుండా హైద్రాబాదు భవనానికి తరలించబడింది. ఇందులో కూడా మహాసభలు చరిత్ర సృష్టించాయి.

పదివేల మందికి వసతి భోజనాలు ఏర్పాటు చేయడం సామాన్యం కాదు. దాన్ని కూడా అతి సునాయాసంగా చేయడం, ప్రజలను ఆశ్చర్య పరచింది. ఇది మరెవ్వరు చేయలేని మహత్కార్యంగా ప్రజలు చెప్పకున్నారు. ప్రజా సంఘాల కార్యకర్తలు ఈ విషయంలో చూపిన సేవాభావాలు, సౌహార్ధతలు మరువలేము వారికి కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాము.

ఈ మహాసభలు జయప్రదం చేసేదానికి అహోరహం కృషి చేసిన కార్యకర్తలకు, విరాళాలిచ్చి సహకరించిన ఉపాధ్యాయులకు, ఉద్యమ శ్రేయోభిలాషులకు ఉద్యమాంజలి సమర్పించు కొంటున్నాము.

మన సప్తమ మహాసభలు, ఒంగోలు చరిత్రలో చిరకాలం నిలిచి పోతాయి. మరచి పోలేని మధుర ఘట్టంగా చేరిగిపోని చిరస్మృతిగా మదిలో మెదులుతుంది. అది ఒక కమనీయ కావ్యం; రమణీయ దృశ్యం.

# వార్తా ప్రపంచం

## రు. 65వేల కోట్ల లోటుతో కేంద్ర బడ్జెట్ :

రక్షణ రంగానికి భారీ కేటాయింపులతో, కేపిటల్ మార్కెట్‌కు కోరినన్ని వరాలనిస్తూ, రు. 65 వేల కోట్ల ద్రవ్యలోటుతో కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ పి. చిదంబరం 1997-98 సంవత్సరానికి బడ్జెట్‌ను 28.2.97న పార్లమెంటులో ప్రవేశపెట్టారు. నల్లధనాన్ని తెల్లధనంగా మార్చుకొనే అవకాశం కల్పించడం యీ బడ్జెట్ ప్రత్యేకత.

కస్టమ్స్, ఎక్సైజ్ సుంకాలను, కార్పోరేట్ పన్నులను తగ్గించడం, కార్పోరేట్ సర్‌చార్జీని రద్దు చేయడం ద్వారా పారిశ్రామిక, వ్యాపార వర్గాలకు రాయితీల జల్లులు కురిపించారు. వ్యక్తిగత ఆదాయంపై పన్నురేట్లను తగ్గించడం, స్టాండర్డ్ డిడక్షన్‌ను పెంచడంద్వారా ఉద్యోగ వర్గాలకు ఊరట కల్గించారు. అయితే సామాన్య మానవుడు వాడే పోస్టుకార్డు ధరను 25 పైసలకు పెంచడంతోపాటు యితర పోస్టల్ రేట్లను కూడా భారీగానే పెంచారు. ఎరువులు, ఆహార ధాన్యాలు, చక్కెరలపై సబ్సిడీలను కొంత పెంచినా, ఉపాధి అవకాశాల పెంపుదలకు, పేదరిక నిర్మూలనకు నిర్దిష్ట చర్యలు మాత్రం లేవు. ఎంతో కీలకమైన విద్య, ఆరోగ్య రంగాలపై ప్రత్యేకదృష్టిని కేంద్రీకరిస్తూ చర్యలేమి సూచించబడలేదు.

## ఉద్యోగులకు ఆదాయంపన్ను రాయితీలు

1997-98 సంవత్సర ఆదాయంపై పన్ను చెల్లింపులో కేంద్ర బడ్జెట్ ద్వారా ఉద్యోగులకు కొన్ని రాయితీలు ప్రకటించబడినవి. రు. 15 వేలుగా నున్న స్టాండర్డ్ డిడక్షన్‌ను రు. 20 వేలకు పెంచారు. ఏడాదికి రు. 75 వేలు వరకు వేతనం పొందే ఉద్యోగి అందులో 10శాతం మొత్తాన్ని పి.యఫ్. చందాగా చెల్లిస్తుంటే అతనికి ఆదాయం పన్ను చెల్లింపు నుండి మినహాయింపునిస్తారు. ముఖ్యమంత్రి సహాయనిధికి యిచ్చే విరాళాలకు సెక్షన్ 80-జి క్రింద నూరుశాతం పన్ను మినహాయింపు వుంటుంది. గతంలో వున్న యితర మినహాయింపులు, సౌకర్యాలు కొనసాగుతున్నాయి. అయితే మెట్రోపాలిటన్ నగరాల్లో టెలిఫోను, కారు, స్థిరాస్థి వంటివి కలిగి వున్నవారు ఆదాయం ఎంతవున్నా తప్పనిసరిగా ఆదాయం పన్ను రిటర్న్‌లను సమర్పించాలి.

| | వార్షిక ఆదాయం | ప్రస్తుత రేట్లు | క్రొత్త రేట్లు |
|---|---|---|---|
| 1. | రు. 40 వేల వరకు | లేదు | లేదు |
| 2. | రు. 40 వేలపైన 60 వేల వరకు | 15% | 10% |
| 3. | రు. 60 వేలపైన 1 లక్ష 20 వేల వరకు | 30% | 20% |
| 4. | రు. 1 లక్ష 20 వేలపైన 1 లక్ష 50 వేల వరకు | 40% | 20% |
| 5. | రు. 1 లక్ష 50 వేలపైన | 40% | 30% |

## బెజవాడ గోపాలరెడ్డి అస్తమయం

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు, ఆంధ్ర రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి , ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నరు అయిన డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి 9-3-97 ఉదయం చెన్నైలో మృతి చెందారు. ఆయన వయస్సు 90 సంవత్సరాలు. రాజకీయ రంగంలో రాణించిన ఆయన సాహితీ రంగానికి అసమాన సేవలందించారు. ఆయన బహుభాషా కోవిదుడు. ఆయన మృతికి యు.టి.యఫ్. తన ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నది.

## గొట్టిపాటి హనుమంతరావు మృతి

రాష్ట్ర పౌరసరఫరాల శాఖ మంత్రి శ్రీ గొట్టిపాటి హనుమంతరావు 22.3.97న హైదరాబాదు నిజాంవైద్యశాల (నిమ్స్)లో మృతి చెందారు. మార్టూరు వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ఛైర్మన్‌గా, సంతమావులూరు సమితి అధ్యక్షునిగా, ప్రకాశంజిల్లా పరిషత్ ఛైర్మన్‌గా, రాష్ట్రమంత్రిగా ఆయన విశేష సేవలందించారు. యు.టి.యఫ్. సప్తమ మహాసభలకు ముఖ్య అతిథి అయిన ఆయన అనారోగ్య కారణంగానే రాలేకపోయారు. ఆయన మృతికి యు.టి.యఫ్. తన ప్రగాఢ సంతాపాన్ని ప్రకటిస్తున్నది.

## కేంద్రంలో దేవగౌడ ప్రభుత్వం రాజీనామా :

కేంద్ర 13 పార్టీల ఫ్రంటు ప్రభుత్వానికి కాంగ్రెసు పార్టీ మద్దతు ఉపసంహరించింది. దేవగౌడ బి.జె.పి.తో సమాఖ్య నడుపు తున్నారంటూ అకస్మాత్తుగా కేసరి మద్దతు ఉపసంహరించారు. అలాచేయడం తొందరపాటు చర్య అని దేశంలోని మేధావులు ఖండించారు.

బడ్జెట్‌కూడా ఆమోదంపొందకుండా తీసుకున్న ఈ చర్య రాజ్యాంగ సంక్షోభాన్నితెస్తుందని ఖండించారు. కేసరి పదవీవ్యామోహమైనా అయివుండాలి. లేక కోర్టులో వున్న కేసులకు భయపడి అయినా ఈపనిచేసి వుండాలని చాలా పత్రికలు విమర్శించాయి. కేసరి చెప్పినవన్నీ కుంటిసాకులు తప్ప వాస్తవాలు లేవని ఫ్రంటు నేతలు ఖండించారు. "దేవగౌడ ప్రధానిపదవినుండి తప్పుకుంటే మేము బలపర్చుతామని" కాంగ్రే అంటున్నది. అది జరగని పని అని ఫ్రంటు నేతలు తేల్చిచెప్పారు. 11వ తేదీ విశ్వాస తీర్మానంపై చర్చ జరిగిన తర్వాత ఓటింగులో అనుకూలంగా 158, వ్యతిరేకంగా 292 ఓట్లు రావడంతో దేవగౌడ మంత్రి మండలి రాజీనామా చేసింది. బి.జె.పి 13రోజుల పాలనతో దిగిపోయినది. ఇక కాంగ్రెస్ 3వపార్టీగా గద్దె ఎక్కాలని తలపోస్తున్నది. ఇక రాష్ట్రపతి నిర్ణయంపైనే అంతాఆధారపడి ఉన్నది.

## లారీల సమ్మెవిరమణ :

దేశవ్యాప్తంగా 10 రోజులుగా జరుగుచున్న లారీల సమ్మె 9-4-97 రాత్రి ముగిసింది. బడ్జెట్‌లో ప్రతిపాదించిన 5శాతం సర్వీసుటాక్సును విరమించాలని, ఇన్సూరెన్సు ప్రీమియం పెంపును రద్దుచేయాలని లారీయజమానులు మార్చి 31నుండి సమ్మెచేస్తున్నారు. ప్రభుత్వంతో చర్చలు జరిగి ఒక అగ్రిమెంటుకు వచ్చి ఉపరితల రవాణా కార్యదర్శి శ్రీయోగేంద్ర నారాయణ్ లారీయజమానుల తరపున ఆర్.పి.సింగ్ సంతకాలు చేయడంతో మార్చి 31 నుండి ప్రారంభమయిన సమ్మె 10 రోజుల తర్వాత విరమించారు.

## ఆంధ్ర ప్రదేశ్‌లో పాక్షికంగా మద్యనిషేదం సడలింపు :

ఏప్రిల్ 18నుండి మద్యనిషేదం పాక్షికంగా సడలిస్తూ ప్రభుత్వం చట్టం చేసింది. సీల్డు టెండర్లుద్వారా 3,500 షాపులకు అవకాశం ఇవ్వాలని, ఇందువల్ల ప్రభుత్వానికి 1000 కొట్లు ఆదాయం వస్తుందని ఈ షాపులు ఉదయం 11గం॥ నుండి రాత్రి 8॥ వరకు మాత్రమే పని చేస్తాయని ప్రభుత్వం అంటున్నది.



# ఉద్యమ విశ్వరూపానికి ప్రతీక ఒంగోలు సప్తమ మహాసభలు

## గత మహాసభల స్ఫూర్తిగా పతాక జాతాలు

యు.టి.యఫ్. రాష్ట్ర సప్తమ విద్యా వైజ్ఞానిక మహాసభలకు బస్సులపై, రైళ్ళపై, జీపులపై, టూరిస్టు బస్సులపై, చిన్న కార్లపై జనసంద్రం కదలినట్టుగా మహా ప్రభంజనంలా జనం తరలివచ్చారు.



పదివేల మందికిపైగా ఉపాధ్యాయులు తండోపతండాలుగా తరలి రావడంతో మహాసభ ప్రాంగణం ప్రతినిధులతో కళకళలాడిపోయింది. కాలకృత్యాలు సకాలంలో తీర్చుకొని వచ్చే దానికి తమకు కేటాయించిన వసతి కేంద్రాలకు ఉపాధ్యాయులు తరలి వెళ్ళడం కనిపించింది. క్రమశిక్షణ కార్యకర్తలుగా రంచనుగా సమయానికి మహా సభల ప్రాంగణానికి చేరుకున్నారు.

గతంలో మహాసభలు జరిగిన జిల్లాల నుండి పతాకలు బయలు దేరివచ్చాయి. వారు తమ తమ జిల్లాలలో ఉపజాతాలు చేసి తర్వాత జిల్లా జాతాగా బయలు దేరి వచ్చారు. ఒక్కో జాతాలో కొన్ని వందల కిలోమీటర్లు ప్రయాణం చేసి వచ్చారు.



ప్రథమ మహాసభ జరిపిన తూర్పుగోదావరి జిల్లా నుండి 32 మంది బయలుదేరి వచ్చారు. వారు 6వ తేదీ ఉదయాన్నే గోదావరి దాటి కొవ్వూరులో స్వాగతం అందుకొని ఏలూరు చేరుకున్నారు. పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో బయలు దేరిన మూడవ మహాసభల జాతా కూడా ఏలూరు చేరుకొన్నది. అమరజీవి పి.వి. సుబ్బారాజు భవనంలో విశ్రాంతి తీసుకొని, పశ్చిమ గోదావరి జిల్లా నుండి 68 మందితో ఆ జిల్లా జాతా బయలు దేరింది.

ఉభయ గోదావరి జిల్లాల నుండి బయలు దేరిన జాతాలు హనుమాన్ జంక్షన్ వద్ద కృష్ణా జిల్లాలో ప్రవేశించాయి. వారు హనుమాన్ జంక్షను, గన్నవరంలలో స్వాగతాలు అందుకొని విజయవాడ చేరుకున్నారు.

రెండవ మహాసభలు జరిగిన ఖమ్మం జిల్లా జాతా 24 మందితో తిరువూరు మీదుగా కృష్ణా జిల్లాలో ప్రవేశించి, విజయవాడ చేరుకున్నది. ఆ రాత్రి విజయవాడలో చెన్నుపాటి భవనంలో విశ్రాంతి తీసుకొని, మర్నాడు ఉదయమే నాల్గవ మహాసభ జరిగిన కృష్ణా జిల్లా నుండి 10 మందితో కూడిన జాతాను తోడు చేసుకొని, నాల్గుజాతాలు కనకదుర్గ వారధి మీదుగా గుంటూరు జిల్లాలో ప్రవేశించాయి.

స్వాగతాలు అందుకొంటూ గుంటూరులో మైనేని భవనం సందర్శించి, చిలకలూరిపేటలో అతిథ్యం స్వీకరించి, 6వ మహాసభ జరిగిన గుంటూరు జిల్లా నుండి 12 మందితో కూడిన జాతా తోడు కాగా అన్ని జాతాలు ప్రకాశం జిల్లా వైపు పయనించాయి. వారంతా ప్రకాశం జిల్లా మార్టురులో స్వాగతం అందుకొని రాత్రి త్రోవగుంటలో విశ్రాంతి తీసుకొన్నారు.



అమరవీరులకు శ్రద్ధాంజలి

నెల్లూరు జిల్లా జాతా 25 మందితో బయలు దేరి పూరురా ప్రచారం చేసుకొంటూ రాత్రికి సింగరాయకొండ చేరుకొని, అక్కడ విశ్రాంతి తీసుకున్నది.

## ఉత్సాహంగా ప్రారంభమయిన యు.టి.యఫ్. మహాసభలు

ఉదయానికే పదివేల మంది ప్రతినిధులు సమావేశ ప్రాంగణానికి చేరుకున్నారు. ఒంగోలు పట్టణం అరుణారుణమైంది. అన్ని కూడళ్ళలోను తోరణాలు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, టంగుటూరి ప్రకాశం పంతులు, ఎర్రాప్రెగ్గడ, చెన్నుపాటి లక్ష్మయ్య గారి పేర్లతో ద్వారాలు వీధి కూడళ్ళలో నిర్మించబడ్డాయి.

మహాసభ ప్రాంగణంలో నిర్మించబడ్డ ప్రధాన ద్వారం. యు.టి.యఫ్. వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ నాదెళ్ళ సీతారామాచారి పేరున నిర్మించబడింది.

జాతీయ పతాకాన్ని ఒంగోలు మున్సిపల్ చైర్మన్ శ్రీ ఎం. శ్రీనివాసరావు ఆవిష్కరించారు. ఉద్యమ పతాకాన్ని రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి ఆవిష్కరించారు.

తూర్పు గోదావరి జిల్లా నుండి వచ్చిన యు.టి.యఫ్. పతాకాన్ని శ్రీ పి. పుల్లయ్య గారి నుండి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. వెంకటస్వామి, ఖమ్మం జిల్లా నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ జియావుద్దిన్ నుండి రాష్ట్రసహ అధ్యక్షులు శ్రీ కె. జోజయ్య, పశ్చిమ గోదావరి జిల్లా నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ ఎ. ఇజ్రాయల్ రాజు నుండి రాష్ట్ర కార్యదర్శి శ్రీ యస్. ఆర్. పొలిశెట్టి స్వీకరించారు.

కృష్ణా జిల్లా నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ యస్. మల్లికార్జున రావు నుండి రాష్ట్ర కార్యదర్శి శ్రీ కె. భద్రయ్య, నెల్లూరు జిల్లా నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ రమణ నుండి రాష్ట్ర కార్యదర్శి శ్రీ వి. విజయకుమార్, గుంటూరు జిల్లా నుండి వచ్చిన పతాకాన్ని శ్రీ వై.యల్. నారాయణ నుండి పత్రిక సంపాదకులు శ్రీ కె. కేశవరెడ్డి, ఒంగోలు మహాసభల పతాకాన్ని శ్రీ కె. వెంకట్రావు నుండి రాష్ట్ర కార్యదర్శి శ్రీ పి. కృష్ణమూర్తి స్వీకరించారు.

అనంతరం అందరూ అమరవీరులు స్థూపానికి శ్రద్ధాంజలి ఘటించారు. యు.టి.యఫ్. లో అశువులు బాసిన వారందరు ఆ సందర్భంలో కార్యకర్తల హృదయాలలో మెదిలారు.

## ప్రారంభ సభలో పరవళ్ళు తొక్కిన ఉత్సాహం

ప్రారంభ సభకు శ్రీ డి. రామిరెడ్డి అధ్యక్షత వహించారు. యు.టి.



ప్రారంభ సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న శ్రీ డి. రామిరెడ్డి

యఫ్. విశిష్టత, దాని ప్రగతి గురించి వివరించారు. శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు- ఆహ్వాన సంఘ అధ్యక్షులు స్వాగతోపన్యాసం చేస్తూ ఒంగోలు విశిష్టత వివరించారు.పాఠశాల విద్యామంత్రి శ్రీ కె.ఇ. ప్రభాకర్ మహాసభను ప్రారంభించారు. రానున్న కాలంలో ఉపాధ్యాయులపై పాఠ్యేతర పనుల భారం పడకుండా చూడగలమని, జనాభా లెక్కలు కంప్యూటీకరణ చేయనున్ననందున దానంతటదే జరుగుతుందని, సమస్యలు పరిష్కారానికి తగు కృషి చేయగలమని తెలిపారు.

ప్రకాశం జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ పాలకుర్తి డేవిడ్‌రాజు మాట్లాడుతూ జిల్లాలోని పాఠశాలలోని ఖాళీ పోస్టులనింపాలి, పాఠశాలల్లో కనీస వసతి ఏర్పాట్లు చూస్తున్నమని తెలిపారు.

మున్సిపల్ చైర్మన్ శ్రీనివాసరావు మాట్లాడుతూ భారత దేశ భవిష్యత్‌కు ఎరుపే కీలక పాత్ర వహిస్తుందని చెప్పారు.

ఆక్టా నాయకులు శ్రీ యం.జె. మాణిక్యారావు సోషలిజానికి తగిలిన ఎదురు దెబ్బలే కేపిటలిజానికి వూపిరిపోశాయని, తర్వాత విద్య ప్రయివేటీకరణ వూపందుకున్నదని, ఆ నేపథ్యంలోనే రాజ్యాంగాన్ని సవరించి విద్యారంగాన్ని పంచాయితీ కమిటీలకు అప్పగించే ప్రయత్నాలు చేస్తున్నారని, విద్యా బిల్లు ఆ నేపద్యంలోనే వచ్చిందని, దానిని అందరు ఉపాధ్యాయులు ఏకమై త్రిప్పికొట్టాలని విజ్ఞప్తి చేశారు.

తర్వాత జిల్లా కలెక్టరు శ్రీ దాసరి శ్రీనివాసులు, సి.ఇ.ఓ. శ్రీ బాలగోపాల్, డి.ఇ.ఓ. శ్రీ తోట చెంగయ్య తదితరులు సందేశాలు యిచ్చారు.

## అక్షర శిల్పుల అపురూప ప్రదర్శన

ఒంగోలు పట్టణాన్ని ఉర్రూతలూగించిన మహా ప్రదర్శన మధ్యాహ్నం నాల్గు గంటలకు ప్రారంభమయింది. నేల యీనినట్లు, నింగి పొంగినట్లు ఉపాధ్యాయులు తరలివచ్చారు.



ప్రారంభోపన్యాసం చేస్తున్న విద్యామంత్రి శ్రీ కె.ఇ. ప్రభాకర్

ముందు 7వ మహాసభ చిహ్నంగా 7 జండాలు, ఆతర్వాత ఎర్రంచు గల్గిన తెల్లచీరలు ధరించిన మహిళలు ఒక వరుసలో, తెల్ల యూనిఫాం ధరించిన పురుషులు మరొక వరుసలో సాగగా, ఆ తర్వాత రాష్ట్ర నాయకత్వం మహాప్రదర్శన బేనరుతో ముందు నడువగా, సాగిపోగా, ఆ వెనుక స్త్రీలు, ప్రథమ మహాసభ జరిపిన తూర్పు గోదావరి వారు ఆ తర్వాత నడువగా మహాసభల క్రమసంఖ్యలోఅవి నిర్వహించిన జిల్లాలు నడువగా, మిగిలిన జిల్లాలు వెనుక నడిచాయి. జిల్లా బేనర్లు, ప్లే కార్డులు, డప్పుల వాయిద్యాలతో పాటలు నినాదాల హోరుతో వూరేగింపు మారుమ్రోగిపోయింది.



సందేశమిస్తున్న జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ పి. డేవిడ్ రాజు

పి.వి.ఆర్. స్కూలు వద్ద ప్రారంభమైన ప్రదర్శన కోర్టు సెంటరు, తాతా కళ్యాణ మండపం, మున్సిపల్ కార్యాలయం, చర్చి సెంటరు, ట్రంకు రోడ్డు, కర్నూలు రోడ్డు, ఆర్.టి.సి. బస్సుస్టాండు మీదుగా మహాసభల ప్రాంగణానికి చేరింది. ఈ ప్రదర్శనలో మహిళా ప్రతినిధులు ఎంతో ఉత్సాహంతో పాల్గొని నినాదాలు యివ్వడం ప్రత్యేకత సంతరించుకుంది.

ప్రయివేటీకరణ వ్యతిరేకించాలి అన్న నినాదం కార్మికులను ఎంతో ఆకట్టుకున్నది. అధిక ధరలు అరికట్టాలి అనే నినాదం చేసినపుడు మహిళలు వేసవిలో మలయమారుతం వీచినట్లు సేదతీరారు. ఉద్యోగుల ఉపాధ్యాయుల ఐక్యత వర్ధిల్లాలన్నప్పుడు దారిపొడవున స్వాగతాలు చెప్తున్న ప్రజా సంఘాలు ఆనందంతో తిరిగి నినదించాయి. హిందీ, ఉర్దూ స్లోగన్లకు జనంలో ఎంతో స్పందన కనిపించింది.

ఒంగోలు పట్టణంలో ఇంత పెద్ద వూరేగింపు తమ జన్మలో చూడలేదని, మహోత్సాంగా జనం మైమరచి వీక్షించారు. ఎంతకూ తరగని వూరేగింపు చూసి జనం వింతగా చెప్పుకున్నారు.

## ఆర్థిక విధానాల అనర్థాలపై ఉపాధ్యాయుల ఉద్యమించాలి

ఊరేగింపు అనంతరం శ్రీ ఎ. వెంకటస్వామి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. ఆయన అధ్యక్షోపన్యాసంలో ఉపాధ్యాయుల కర్తవ్యాలు, ప్రభుత్వ వైఖరి తెల్పుతూ, శ్రమ జీవులతో కూడిన పయనం తమ విధానమని నొక్కి చెప్పారు.



జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ తోట చెంగయ్య

ప్రజాశక్తి సంపాదకులు శ్రీ మోటూరు హనుమంతరావు మాట్లాడుతూ భావి భారత పౌరులను తీర్చి దిద్దే ఉపాధ్యాయులకు సమాజంలో భాగస్వామ్యం వుందని , దేశం అనేక లోపభూయిష్ట విధానలతో అవినీతిలో కూరుకుపోయివుందని, విద్య, వైద్యం పేద ప్రజలకు అందనంత దూరంలో వున్నాయని, పెట్టుబడిదారుల విధానాలకే ప్రభుత్వం మద్దతుయిస్తుందని విమర్శించారు. బహుళ జాతి కంపెనీలకు దేశాన్ని ధారాదత్తం చేస్తూ, పేద ప్రజలను కష్టజీవులను మర్చిపోతున్నారని విమర్శించారు.

సి.పి.ఐ. రాష్ట్ర సమితి కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు మాట్లాడుతూ బ్రతక లేక బడిపంతులు అనే దానిని మార్చవలసి వుందని, దేశాన్ని బ్రతికించడానికి బడిపంతులు అవసరం ఎంతయినా వుందని, విద్యార్థులలో చిన్ననాటి నుండి జాతీయభావాలను పాదుకొల్పుతూ ప్రజాతంత్ర ఉద్యమాలవైపు మొగ్గుచూపె విధంగా తీర్చి దిద్దవలసిన అవసరం ఎంతయినా వుందని గుర్తుచేశారు.

తెలుగు దేశం జిల్లా కార్యదర్శి శ్రీ చుంచు శేషయ్య స్వతంత్రం వచ్చి 8 ప్రణాళికలు అమలు జరిగినా, 45 శాతం నిరక్షరకుక్షులుగానే వున్నారని, కాలం చెల్లిన పాత విధానాలే అనుసరిస్తున్నారని, మారుతున్న శాస్త్ర సాంకేతిక విధానాలు విద్యా రంగంలో చోటు చేసుకోవాలని తెలియజేశారు. వక్తలను శ్రీ కె. కృష్ణయ్య వేదిక పైకి ఆహ్వానించగా శ్రీ యస్. విజయకుమార్ వందన సమర్పణ కృషి చేశారు.

మహాసభ ప్రారంభంలోనే అధ్యక్ష వర్గంగా శ్రీ డి. రామిరెడ్డి (కన్వీనరు) శ్రీ యన్. రామకోటేశ్వరరావు, శ్రీ యస్. ఆర్. పొలిశెట్టి, శ్రీమతి సి. కమలకుమారి, శ్రీ ఎ. చెన్నకేశవరెడ్డి; స్టీరింగ్ కమిటిగా శ్రీ ఎ. వెంకటాస్వామి, శ్రీయుతులు కె. జోజయ్య, కె. భద్రయ్య, యస్. ఆనందనాయుడు, ఎస్. విజయకుమార్, పి. కృష్ణమూర్తి, జి. చిట్టిబాబు, కె. కృష్ణయ్య, ఎన్. రమణయ్య శాస్త్రి, పి. రాజమౌళి, డి. లక్ష్మిరెడ్డి, కె కేశవరెడ్డి-



బహిరంగ సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న శ్రీ ఎ. వెంకటస్వామి

అర్హతల కమిటీగా శ్రీ సి.హెచ్. సుభాచంద్రబోసు (కన్వీనర్), శ్రీయుతులు జి. చిట్టిబాబు, ఐ. రామానుజాచార్యులు, ఎస్. వేణుశ్రీ, యు. జనార్ధన్, సి.హెచ్. రాజన్‌బాబు, ఎన్. నారాయణ, సి.హెచ్. చిట్టెమ్మ ఎన్నికయ్యారు.

## సమరశీల పోరాటలతో సమస్య పరిష్కారంకై కృషి

2వ రోజు ఉదయం జరిగిన ప్రతినిధుల సభలో శ్రీ ఎ. వెంకటస్వామి (ప్రధాన కార్యదర్శి) అచ్చు నివేదిక ప్రవేశ పెడూతూ 7,000లతో



బహిరంగ సభలో శ్రీ మోటూరి హనుమంతరావు

1974లో ప్రారంభమయిన ఉద్యమం 70,000లకు ఎదిగిందని, అనేక సమస్యలపై రాజీలేని పోరాటం చేసిందని, అనేక విజయాలు సాధించిందని చెప్పారు. (రిపోర్టు తరువాత పేజీలలో యివ్వబడింది)

ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకుడు శ్రీ కె. కేశవరెడ్డి పత్రికా నివేదికను ప్రవేశపెడుతూ 2000లతో ప్రారంభమయిన సంచిక 20 వేలకు చేరిందని, విద్యా విషయక మాసపత్రికల్లో అగ్రస్థానంలో వుందని చెప్పారు. (నివేదిక ప్రత్యేకంగా తరువాత పేజీలలో యివ్వబడింది)

## విద్యను వ్యాపార వస్తువుగా చేయడాన్ని నిరోధించాలి

విద్యా మహాసభ ఉ॥ 11-00 గంటలకు యు.టి.యఫ్. సహాధ్యక్షులు శ్రీ కె. జోజయ్య గారి అధ్యక్షతన ప్రారంభమయింది. మానవ వనరుల అభివృద్ధి విషయంలో వర్ధమాన దేశాలలో భారత దేశం 50 స్థానంలో వున్నదని, విద్యా రంగాన్ని ప్రైవేటు పరం చేయాలనే ప్రభుత్వ యత్నాలను చైతన్యయుతంగా నిరోధించాలని, విద్యను ప్రాథమిక హక్కుగా రాజ్యాంగబద్ధం చేయడానికి, 'అందరికి విద్య' ఆచరణ సాధ్యం చేసేదానికి అందరూ పూనుకోవాలని ఆయన కోరారు.

సాంకేతిక విద్యాశాఖామాత్యులు డా॥ పరసా వెంకటరత్నయ్య గారు విద్యా మహాసభను ప్రారంభిస్తూ - ఉపాధ్యాయ వృత్తి వున్నతమైనదని. పాఠశాల భౌతిక పరిస్థితులు మెరుగయ్యే దానికి, ఉపాధ్యాయ సమస్యలు పరిష్కారమైయ్యే దానికి తన వంతు సహకారాన్ని అందిస్తానని తెలియజేశారు.

తదుపరి యు.టి.యఫ్. అకడమిక్ సెల్ డైరెక్టరు, రిటైర్డ్ డి.యి.ఓ. శ్రీ టి.జి. సంజీవరావు గారు విద్యా విషయక చర్చా పత్రమును ప్రవేశపెడ్తూ - విద్యా వ్యవస్థపై శాస్త్రీయంగా వ్యాఖ్యానించి, ప్రత్యామ్నాయ ప్రణాళిక చూపించేవైపు కృషి చేయవలసి వుందని పేర్కొన్నారు. (చర్చా పత్రం తరువాత పేజీలలో ప్రచురించబడినది)



బహిరంగ సభలో శ్రీ దాసరి నాగభూషణ రావు

పాఠశాల విద్యా కమీషనర్ మరియు డైరెక్టరు డా॥ పి. సుబ్రహ్మణ్యం గారు ఉపన్యసిస్తూ - విద్యార్థులకు విద్యగరపడంలో వారు పుట్టి పెరిగిన సాంస్కృతిక పూర్వరంగాన్ని పరిగణనలోనికి తీసుకోవాలని, వారి విద్యాభివృద్ధికి ఆటంకరంగా వున్న "In School factors" ను "Out of school factors" ను పరిగణలోనికి తీసుకోవాల్సి వుంటుందని, ఉన్న పరిస్థితులలో ప్రభుత్వ పాఠశాలల వ్యవస్థకు బలం చేకూర్చేందుకు అంకితభావంతో పనిచేయాలని ఉద్బోధించారు. (ఉపన్యాస పూర్తి పాఠం తరువాత పేజీలలో ప్రచురించబడినది)

తదుపరి పాఠశాల విద్య మరియు ఉన్నత విద్యల సంచాలకులుగా పనిచేసి రిటైరైన శ్రీ టి. వెంకారెడ్డి గారు ఉపన్యసిస్తూ - ఉపాధ్యాయులు తమ భౌతిక అవసరాలు మెరుగు పరుచుకోవడానికి కృషి చేస్తూనే, విద్యా విషయక అంశాలు ముఖ్యంగా సిలబస్ తయారీలో, కరిక్యులమ్ తయారులో చొరవ చూపాలని, సలహాలివ్వాలని కోరారు. శాస్త్రీయమైనదిగా 25 సం॥లనాడు ప్రవేశపెట్టిన "నాన్-డిటెన్షన్" విధాన స్థానంలో తిరిగి "డిటెన్షన్ విధానం" ప్రవేశపెట్టాలనే ప్రభుత్వ ఆలోచన సరియైనది గాదని తెలియజేశారు.

అనంతరం రాజ్యసభ సభ్యులు డా॥ యలమంచిలి రాధాకృష్ణమూర్తి గారు ఉపన్యసిస్తూ విద్యలో విలువలు లోపిస్తున్నాయని, వ్యాపార సంస్కృతి ప్రతిరూపాలైన పంచ నక్షత్ర పాఠశాలలు రంగంలోకి వచ్చి ప్రత్యేక ఉన్నత వర్గాన్ని తయారు చేస్తున్నాయని, అందమైన అండమాన్ సెల్యులర్ జైళ్ళులాంటి రెసిడెన్షియల్ విద్యా సంస్థలు సంకుచిత దృక్పథాన్ని పెంపొందిస్తున్నాయని, అందుకు భిన్నంగా శాస్త్రీయ దృక్పథాన్ని పెపొందించేదిగాను, ఉపాధిని కల్పించేదిగాను విద్య వుండాలని పేర్కొన్నారు. (వారి ఉపన్యాస పూర్తి పాఠం తరువాత పేజీలలో ప్రచురించబడినది)



బహిరంగ సభలో జిల్లా తెలుగుదేశం కార్యదర్శి శ్రీ చుంచు శేషయ్య

ఉపాధ్యాయులకు ప్రభుత్వ కార్యలయాలకు కరదీపికగా ఉపయోగపడే విధంగా యు.టి.యఫ్. చే ప్రచురింపబడుతున్న జి.ఓ. సంపుటాల ఒరవడిలో వెలువడిన అధ్యాపక దర్శిని -14ను యీ సదస్సులోనే పాఠశాల విద్యా కమీషనరు మరియు డైరెక్టరు డా॥ పి. సుబ్రహ్మణ్యం గారు ఆవిష్కరించారు.

## ఉద్యమ గుణపాఠలతో ముందుకు సాగిపోదాం

శ్రీ యన్. రామకోటేశ్వరరావు అధ్యక్షతన 10వ తేదీ ప్రతినిధుల సభ ప్రారంభమయింది. ప్రజాశక్తి సంపాదకులు శ్రీ మోటూరి హనుమంతరావు గారు ప్రతినిధుల సభను ప్రారంభించారు. (వారి ఉపన్యాసం విడిగా యిస్తున్నాం)



విద్యా మహాసభలో సాంకేతిక విద్యాశాఖమంత్రి శ్రీ పి.వి. రత్నయ్య

వివిధ జిల్లాల నుండి చర్చలలో పాల్గొన్న జిల్లా బాధ్యులు ఉద్యమ స్ఫూర్తితో, భవిష్యత్ ఉద్యమ పురోభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని, అమూల్యమైన సూచనలు చేశారు.

శ్రీయుతులు బి. మోహనరావు (శ్రీకాకుళం) యం. మురళీధరరావు (విజయనగరం), కె. బ్రహ్మాజీ రావు (తూర్పు గోదావరి), రామ

ఒంగోలు పట్టణంలో ఇంటర్ మాత్రమే కలిగి "నేటి మా విద్యార్థి రేపటి ఇంజనీరింగ్ విద్యార్థి"
కావాలనే ఆశయంతో స్థాపించిన ఏకైక విద్యాసంస్థ

# శ్రీ గోవిందాంబిక పరమేశ్వరి రెసిడెన్షియల్ కాలేజి

రామాలయం ప్రక్కన, మంగమూర్ రోడ్, ఒంగోలు. ప్రకాశం జిల్లా

స్థాపించిన మొదటి సంవత్సరములోనే EAMCET-96 లో క్లాసులో సగం మందికి ఇంజనీరింగ్ Free Seats సాధించిన ఏకైక విద్యాసంస్థ

**శ్రీ గోవిందాంబికా**

*The Only Institute in* **ONGOLE** *offering Eminent* **EAMCET** *Coaching at the Level of* **I.I.T.**

**శ్రీ గోవిందాంబికా**

10వ తరగతిలో 500 మార్కులు, C.B.S.E.లో 420 మార్కులు దాటిని విద్యార్థికి ఫ్రీ కోచింగ్ ఇవ్వబడును

జూనియర్ ఇంటర్ మొదటి బ్యాచ్ అడ్మిషన్లు ప్రారంభం:
**24-4-97**

రెండవ బ్యాచ్ అడ్మిషన్లు ప్రారంభం:
**మే చివరి వారం**

10వ తరగతి చదివిన విద్యార్థి మొదటి సంవత్సరము ఇంటర్ మీడియట్ చేరునపుడు ముందుగా ఫీజు రూ. 26,000లు చెల్లించవలయును.

**2 సంవత్సరముల తరువాత EAMCET-99 లో**

ర్యాంకు 1000లోపు వచ్చినచో :
అదనముగా ఫీజు రూ24,000 చెల్లించవలెను

ర్యాంకు 1000 పైన 2000 లోపు వచ్చినచో :
అదనముగా ఫీజు రూ. 16,000 చెల్లించవలయును.

ర్యాంకు 2000 పైన 3000లోపు వచ్చినచో :
అదనముగా ఫీజు రూ. 8,000 చెల్లించవలయును.

ర్యాంకు 3000 పైన వచ్చినచో :
అదనముగా ఫీజు చెల్లించనవసరము లేదు.



*Your Dream of Engineering Seat will be Reality at* **శ్రీ గోవిందాంబికా**

ప్రిన్సిపల్: జైనుల్లాద్దీన్ ఖాన్ (జైను మాస్టారు)

**Director : M.R. RAO,** M.Tech (I.I.T. - BOMBAY)
Expert in Projecting High Level Techniques,
Short Cuts, Dynamic Hints and Clues,
Experienced Expert Lecturer of BOMBAY
Agarwal Coaching Centre

*Contact*



(08592) 23893

సుబ్బారెడ్డి (విశాఖపట్టణం), సి.హెచ్. సుభాస్‌చంద్రబోసు (పశ్చిమ గోదావరి), పి. వెంకటేశ్వరరావు (కృష్ణ), వి.విశ్వనాధం (గుంటూరు) పి.బాబు రెడ్డి (నెల్లూరు), యం. జయరామనాయుడు (చిత్తూరు), యం. ఎ. బేగ్ (కర్నూలు), యన్. శంకరనారాయణ (అనంతపురం), యన్. నారాయణ (ఖమ్మం), వి.యస్. రామనుజాచార్యులు (వరంగల్), యస్. వేణుశ్రీ (కరీంనగర్), మధుకర్(అదిలాబాద్) పాండునాయక్ (మహబూబ్‌నగర్) యస్. దత్తాత్రిరావు (నిజాంబాద్), యం. మాణిక్ రెడ్డి (రంగారెడ్డి), నరేంద్ర రెడ్డి (హైద్రాబాద్), కె. ఆదినారాయణ (ప్రకాశం), శ్రీమతి చిట్టెమ్మ, శ్రీమతి అనసూయ చర్చలలో పాల్గొన్నారు.

చర్చలకు శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ కె. కేశవరెడ్డి జవాబు యిచ్చిన తర్వాత నివేదికలు ఏకగ్రీవముగా ఆమోదించబడినవి.

తీర్మానములు ఏకగ్రీవంగా ఆమోదించబడ్డాయి.

తదుపరి శ్రీ యస్. ఆర్. పోలిశెట్టి ఆధ్వర్యంలో రాష్ట్ర కమిటీ ఎన్నికలు నిర్వహించబడ్డాయి.



నూతనంగా ఎన్నికైన రాష్ట్ర సెక్రటేరియట్

| | |
|---|---|
| అధ్యక్షులు : | శ్రీ డి. రామిరెడ్డి |
| ప్రధాన కార్యదర్శి : | శ్రీ ఎ. వెంకటస్వామి |
| సహ అధ్యక్షులు : | శ్రీ యన్. రమణయ్య శాస్త్రి |
| కార్యదర్శులు : | శ్రీ యన్. రామకోటేశ్వరరావు |
| | శ్రీ కె. భద్రయ్య |
| | శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం |
| | శ్రీ యం. నరహరి |
| | శ్రీ యస్. ఆనంద నాయుడు |
| | శ్రీ జి. చిట్టిబాబు |
| | శ్రీ కె. కృష్ణయ్య |
| | శ్రీ ఎ. చెన్న కేశవ రెడ్డి |
| | శ్రీ డి. లక్ష్మీ రెడ్డి |
| | శ్రీ సి. హెచ్. సుభాష్‌చంద్రబోస్ |
| | శ్రీ బి. మోహనరావు |
| | శ్రీమతి సి. కమలకుమారి |

కార్యవర్గ సభ్యులుగా సర్వశ్రీ పి. కృష్ణమూర్తి (శ్రీకాకుళం) యు. మురళీధరరావు (విజయనగరం) య. రామసుబ్బారెడ్డి (విశాఖ), కె. బ్రహ్మాజీరావు (తూర్పు గోదావరి), పి. సోమరాజు (పశ్చిమ గోదావరి), పి. వెంకటేశ్వరరావు (కృష్ణ), వి. విశ్వనాథం (గుంటూరు), కె. ఆదినారాయణ (ప్రకాశం), పి. బాబురెడ్డి (నెల్లూరు), యం. జయరామనాయుడు (చిత్తూరు), సి. కృష్ణంరాజు (కడప), యం. ఎ. బేగ్ (కర్నూలు), యన్. శంకరనారాయణ (అనంతపురం) యన్. నారాయణ (ఖమ్మం), టి.యన్. రామనుజానాయుడు (వరంగల్), యస్. వేణుశ్రీ (కరీంనగర్), యన్. సుదర్శన్ రెడ్డి, (నల్గొండ), ఆర్. పాండునాయక్ (యం.నగర్), యస్. దత్తాత్రిరావు (నిజామాబాద్), రియాద్ అహ్మద్ ఖాన్ (మెదక్), పి. మాణిక్ రెడ్డి (రంగారెడ్డి)యం. నరేంద్ర రెడ్డి (హైద్రాబాద్) మహిళా ప్రతినిధులుగాశ్రీయుతులు యస్.యస్. నరసమాంబ, ఇ. సత్యవతి, సి. వి. సుగుణ, ప్రత్యేకాహ్వానితులుగా సి.హెచ్. చిట్టెమ్మ, యం. సంయుక్తలు ఎన్నికయ్యారు.



నూతనంగా ఎన్నికైన ఐక్యఉపాధ్యాయ సంపాదకవర్గం

## సంపాదకవర్గం

శ్రీ కె. జోజయ్య (ప్రధాన సంపాకులు)

శ్రీ కె. కేశవరెడ్డి    శ్రీ ఎ. వెంకటస్వామి

శ్రీ డి. రామిరెడ్డి    శ్రీ యం. ఎ. కె. దత్



నూతనంగా ఎన్నికైన ఆడిట్ కమిటీ

## ఆడిట్ కమిటీ

శ్రీ యం. ఎ.కె. దత్ (కన్వీనరు)

శ్రీ టి. కొండాచారి

శ్రీ కె. నారాయణరావు

పై కమిటీలు అన్నీ ఏకగ్రీవంగా ఎనుకొనబడ్డాయి.

తదుపరి శ్రీ కె. కేశవరెడ్డి గారి అధ్యక్షతన ముగింపు సభ జరిగింది. మహాసభలు జయప్రదంగా జరిగాయని, అన్ని ఏర్పాట్లు బాగున్నాయని వివిధ ప్రజా సంఘాల నాయకులు అభినందించారు.

# మహాసభల సన్నద్ధత UTF కార్యకర్తల సంసిద్ధత

మొదట ఈ సభలు జనవరి మొదటి వారంలో జరుపాలని అనుకున్నా, 96 అక్టోబరు, నవంబరు నెలలో వచ్చిన వరదల, తుఫానుల కారణాన అనివార్యంగా మార్చి నెలకు వాయిదా పడ్డాయి. ఈ మహాసభలు జయప్రదం చేస్తూనే అదే కాలంలో హైదరాబాదు నూతన భవన నిర్మాణం కూడా చేయ్యాలని నిర్ణయించడం జరిగింది.



మహాసభల జరిగిన పివి.ఆర్.మున్సిపల్ హైస్కూల్ (బాలురు)

దానికనుగుణంగా మహాసభకయ్యే మొత్తం ఖర్చు 10 లక్షలు ప్రకాశం జిల్లా శాఖ భరించడానికి ముందుకు వచ్చింది. ఇతర జిల్లాలలో వసూలు చేసే 9 లక్షలు భవనానికి కేటాయించబడింది.

ప్రకాశం జిల్లా ఆర్థికంగా వెనుకబడిన జిల్లా. దానికి తోడు 1996 అక్టోబరు వరదల వల్ల బాగా దెబ్బతిన్నది. అందుచే మహాసభ భారాన్ని ప్రజానీకంతో సంబంధం లేకుండా యు.టి.యఫ్. సభ్యుల నుండే వసూలు చేయ్యాలని నిర్ణయించడం జరిగింది. బెంగాలు, కేరళ రాష్ట్రాలలో ఈ సంప్రదాయం ఎంతో కాలంగా సాగుతోంది. మొత్తం 10


సందేశమిస్తున్న శ్రీ టి. వెంకారెడ్డి, ఐ.ఎ.ఎస్. (రిటైర్డ్)

లక్షలు వసూలు కావాలంటే యు.టి.యఫ్. సభ్యులు 5 వేల మంది కనీసం 216లకు తగ్గకుండా విరాళం యివ్వాలని జిల్లా శాఖ పిలుపు యిచ్చింది. ఈ మహాసభను జయప్రదం చేయడం ప్రకాశం జిల్లా కార్యకర్తలు ఒక సవాలుగా తీసికొన్నారు. పథకం ప్రకారం దళాలుగా ప్రతి పాఠశాలను దర్శించి విరాళాలు వేయించారు. ప్రతి దళంలో రాష్ట్ర జిల్లా నాయకులొకరు ఉండేలాగా పథకం రూపొందించబడింది.

డిశంబరు 31నాటికే 90% పర్యటన ముగియడం జనవరి 15 నాటికి 60% విరాళాలు సేకరించడం జరిగింది. 216 నుండి 3000 వేల రూపాయల వరకు వారి వారి శక్తిని బట్టి విరాళాలిచ్చారు. మేనేజిమేంటు తేడాలు గాని, క్యాడరు తేడాలు గాని లేకుండా కలిసిన ప్రతి ఒక్కరూ సహకరించారు. యు.టి.యఫ్. సభ్యులు, సానుభూతి పరులుకాని ఎవ్వరి వద్ద విరాళాలు సేకరించరాదని కూడా నిర్ణయించడం జరిగింది. వ్యవధి లేనందున ప్రజల వద్ద కనీసం ఆహ్వాన సంఘ సభ్యులవద్ద కూడా విరాళాలు అడగలేకపోయారు. కేవలం కొద్ది మంది దాతలు గేట్లు, మోమెంటోలు విరాళాలిచ్చారు. అనుకొన్నట్లే 10 లక్షల విరాళం ఉపాధ్యాయులిచ్చారు.

అన్ని మహసభల సాంప్రదాయముననుసరించి జిల్లాలోని ప్రముఖులతో ఆహ్వాన సంఘం ఏర్పడింది. ప్రముఖ అభ్యుదయకవి డా॥ నాగభైరవ కోటేశ్వరరావు గారు అధ్యక్షులుగా, జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ పాలవర్తి డేవిడ్ రాజు గారు, ఒంగోలు నియోజక వర్గ పార్లమెంటు సభ్యులు శ్రీమతి మాగుంట పార్వతమ్మ గారు



అక్టా నాయకులు శ్రీ యం.జె. మాణిక్య రావు

గౌరవాధ్యక్షులుగా, శ్రీ డి. రామిరెడ్డి కార్యనిర్వాహక అధ్యక్షులుగా, శ్రీ ఎ. వెంకటస్వామి ప్రధాన కార్యదర్శిగా శ్రీ డి. లక్ష్మీరెడ్డి కార్యదర్శిగా జిల్లాలోని మొత్తం శాసనసభ్యులు ఉపాధ్యక్షులుగా యు.టి.యఫ్. రాష్ట్ర సెక్రటేరియట్ సభ్యులు కార్యదర్శులుగా, జిల్లాలోని స్థానిక సంస్థల అధిపతులు, వివిధ రంగాల ప్రముఖులు, విద్యావేత్తలు, పరిశ్రమాధిపతులు, ప్రజా సంఘాల నాయకులు, విద్యాలయాల కరస్పాండెంట్లు, ప్రధానోపాధ్యాయులు, ప్రిన్సిపాళ్ళు, ప్రకాశం జిల్లా సెక్రటేరియట్ సభ్యులు, అన్ని జిల్లాల అధ్యక్ష, ప్రధాన కార్యదర్శుల ఆహ్వాన సంఘం ఏర్పడింది.

మహాసభలకు ఉపరాష్ట్రపతి, కేంద్ర మానవ వనరులశాఖా మంత్రి రాష్ట్ర ముఖ్యమంత్రి గార్లను ముఖ్య అతిథులుగా ఆహ్వానించాం. కాని మార్చి నెలలో బడ్జెటు సమావేశాల కారణంగా వారు రావడం సాధ్యం కాలేదు. అయినా అన్ని సదస్సులు నిర్వహించాలని, ప్రతి సదస్సులో కనీసం ఒకరైనా మంచి వక్త ఉండాలని నిర్ణయించడం జరిగింది. దానికనుగుణంగా పతాకావిష్కరణ, ఎగ్జిబిషను, ప్రారంభ సభ, బహిరంగసభ, విద్యా మహాసభ, మహిళా సదస్సు, జనచైతన్య సదస్సు,

సాహిత్య సభ, ప్రతినిధుల సభ జరిపాము. ప్రదర్శన మొత్తం కార్యక్రమానికి తలమాణికం కావాలనుకున్నాం. వైజ్ఞానిక ప్రదర్శనలకు ప్రత్యేక ప్రాముఖ్య యివ్వలేదు.

మహాసభ ఏర్పాట్ల సందర్భంగా అనేక క్రొత్త ప్రయోగాలు కూడా చేశాం. మహాసభ ఏర్పాట్లలో సోదర ప్రజా సంఘాల మీద ఎక్కువ భారం వేయకుండా అధిక భారం యు.టి.యఫ్.. శాఖలే నిర్వహించడం, గేట్లు, స్టేజి నిర్మాణం ప్రత్యేక శ్రద్ధతో రూపొందించడం, భోజన ఏర్పాట్లలో బఫే పద్ధతి అనుసరించడం, మహాసభ ప్రారంభమయిన తర్వాత విరామం లేకుండా కార్యక్రమాలు రూపొందించడం, మోడేం సహకారంతో ప్రజాశక్తి వారు ఏరోజు కారోజు విశేషాలతో ప్రత్యేక సంచికలు ప్రచురించడం, ఊరంతా ప్రచారం అయ్యేలా ప్రతినిధులకు షోల్డరు బ్యాగ్ లీయడం, ఆరోగ్య విషయానికి ప్రత్యేక ప్రాధాన్యత తీయడం, బ్యాగ్ లీయడం, పాటల పుస్తకాలు, క్యాసెట్లు విడుదల చేయడం, ఊరేగింపులో యూనిఫారం ధరించిన వలంటీర్లు అగ్రభాగాన నడవడం, దారి పొడుగునా సోదర ప్రజా సంఘాలు వారి బ్యానర్లతో నిలబడి నినాదాలీయడం ఈ మహాసభ సందర్భంగా రూపొందించిన వ్యూహం.



మహిళ సదస్సులో మైథిలీ శివరామన్

అలాగే ప్రకాశం జిల్లాలో ఉపాధ్యాయుల విద్యార్థులను చైతన్యాపరచడానికి ఉపాధ్యాయులకు 1997 ఫిబ్రవరి నెలలో ఆటల పోటీలు, పాటల పోటీలు, పిరియడు ప్లాను రచనా పోటీలు నిర్వహించడం జరిగింది. 8,9,10 తరగతుల విద్యార్థులకు "మద్యపాన నిషేధం జయప్రదం కావాలంటే" అనే అంశముపై మండల, జిల్లా స్థాయిలలో వ్యాస రచనా పోటీలు నిర్వహించడం జరిగింది.

## మహాసభ ఏర్పాట్లు - విశేషాలు

ఒంగోలు లోని పాఠశాలలలో విశాల ఆవరణయున్న పి.వి.ఆర్. బాలుర ఉన్నత పాఠశాల ఆవరణలో మహాసభ, భోజన ఏర్పాట్లు ప్రక్క ప్రక్కనే ఏర్పాటు చేయబడ్డాయి. మహాసభ ప్రాంగణానికి సంఘ వ్యవస్థాపక అధ్యక్షుడు శ్రీ నాదెళ్ళ సీతారామచారి గారి పేరు పెట్టడం జరిగింది.

ప్రధాన ద్వారం వారిపేరుతో నిర్మించబడింది. నాలుగు కూడళ్ళలోను శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, టంగుటూరి ప్రకాశం పంతులూ, ఎర్రాప్రెగడ, చెన్నుపాటి లక్ష్మయ్య గారి పేర ద్వారాలు నిర్మించబడ్డాయి. ద్వారంలను యు.టి.యఫ్. సభ్యులైన ఆర్టిస్టులే అద్భుతంగా తయారు చేశారు. 7వ తేది రాత్రికి పట్టణమంతా యు.టి.యఫ్. తోరణాలతో, జెండాలతో, ద్వారాలతో శోభాయమానంగా అలంకరించబడింది. 8వ తేది ఉదయానికి అన్ని జిల్లాల నుండి ప్రతినిధులు 10వ వేల మంది వచ్చారు. ప్రతినిధులు కాకుండా మహాసభ కార్యక్రమాలలో పాల్గొన్న ఉపాధ్యాయులు దాదాపు 3 వేల మంది పైగా ఉన్నారు. ప్రతినిధులకు 6 కళ్యాణ మండపాలు, 5 ఉన్నత పాఠశాలలో వసతి ఏర్పాట్లు చేయబడ్డాయి. ఎగ్జిబిషన్లు విడిగా పి.ఎ.ఆర్. బాలికోన్నత పాఠశాలలో ఏర్పాటు చేయబడ్డాయి.

**జ్ఞాపికలు** : 3 రోజుల కార్యక్రమాలలో యిచ్చే మెమెంటోలను శాలువాలను, వ్యాసరచన ఆటల పోటీలకిచ్చే బహుమతులు మొత్తాన్ని చీమకుర్తికి చెందిన గ్రానైటు కంపెనీల పెద్దలు బహుకరించారు.



ప్రజా చైతన్య సదస్సులో డా॥ విజయకుమార్

"1) శ్రీ బూచేపల్లి సుబ్బారెడ్డి, శ్రీ సూర్యా గ్రానైట్సు, చీమకుర్తి, (రూ. 15 వేలు), 2) శ్రీ పమిడి వెంకటరావు డైరెక్టరు ఎ.పి.టి.జి.కో-ఆపరేటివ్ సొసైటీ (రూ. 10 వేలు) 3) శ్రీ సిద్దా వెంకటేశ్వరరావు సిద్దా రాఘవరావు మేనేజింగ్ ట్రస్టీలు సిద్ధా వెంకటేశ్వరరావు మరియు శ్రీ వెంకటసుబ్బమ్మ ట్రస్టు (రూ. 6 వేలు), 4) శ్రీ సిద్దా నాగేశ్వరరావు,



సాహిత్య సదస్సులో శ్రీ పరుచూరి గోపాలకృష్ణ

శ్రీ చలువాది బదరీనారాయణ, ఒంగోలు గెలాక్సు గ్రానైట్సు (4 వేలు), యిదిగాక శ్రీ బదరీ నారాయణ గారు వారి తండ్రి గారి జ్ఞాపకార్థం మహాసభలో రూ. 10,116లు విరాళం ప్రకటించారు.

**బహూకరణలు** : ప్రధాన ద్వారం ఒంగోలు సి.సి.కే సంస్థ వారు రూ. 6వేల రూపాయలతో నిర్మించి బహూకరించారు. ప్రతినిధులందరికి అనూ బుక్ కార్పొరేషన్ (శ్రీ యస్.యం. కొండయ్య) వారు నోటు పుస్తకాలు బహూకరించారు.

# ఆసక్తిని రేకెత్తించిన విద్యా వైజ్ఞానిక ప్రదర్శనలు


















**వంటలు :** ఖమ్మం జిల్లా వాస్తవ్యులు శ్రీ ఆచారి నాయకత్వాన వేలాది మందికి రుచిగా, శుచిగా ఏ యిబ్బంది కలుగకుండ వంట చేశారు. వారికి ఖమ్మం జిల్లా యు.టి.యఫ్. బాధ్యులు శ్రీ శ్రీనివాసులు సలహాదారుగా పనిచేశారు.

ప్రకాశం జిల్లాలో బాధ్యతలను శ్రీయుతులు జి. శేషయ్య, యం. పానకాలరావు, వి.వి. కృష్ణారెడ్డి, జి. నరసింహం, బత్తిన వెంకటసుబ్బయ్య, పాపినేని వెంకటేశ్వర్లు, కె. బలరామిరెడ్డి, కె. చంద్రశేఖరరావు, కె. సుబ్బారావు, యం. వెంకటేశ్వర్లు, కె. నరసింహం, యస్. శీతారామయ్య, జె. మల్లిఖార్జున్ రావు, రాధాకృష్ణమూర్తి, కె. సత్యనారాయణ, కె. కుమార్ బృందం నిర్వహించారు. వీరికి అనేక మంది తోడ్పడ్డారు.



సాహితీ సదస్సులో సన్మానితు శ్రీ కేతు విశ్వానాధరెడ్డి

**వడ్డన శాల :** యు.టి.యఫ్. పక్షాన శ్రీయుతులు షేక్ మస్తాన్, సుబ్బారావు, వి. వెంకటసుబ్బయ్య, పి. నాగేశ్వరరావు, రవీంద్రబాబు, వెంకట్రామిరెడ్డి, వేణుగోపాలరావు, కమలాకరరావు నాయకత్వాన షుమారు 150 మంది కార్యకర్తలు అత్యంత దీక్షతో నిర్వహించారు. వీరికి తోడు శ్రీ చిరంజీవి గారి నాయకత్వాన వివిధ ప్రజా సంఘాల వారు దాదాపు 100 మంది విశేష కృషి చేశారు.

**బ్యానర్లు వ్రాయడం :** కూలి యిచ్చి ఒక్క బ్యానరుగాని, ద్వారం గాని



యు.టి.యఫ్. ఎంబ్లమ్ చిత్రించిన వారిని అభినందిస్తున్న దృశ్యం

తయారు చేయలేదు. మొత్తం మన సభ్యులే వ్రాశారు. నెల్లూరు జిల్లా సూళ్ళూరు పేట నుండి శ్రీ నాగరాజు, పశ్చిమ గోదావరి జిల్లా ద్వారకా తిరుమల నుండి శ్రీ శ్రీనివాసాచారి, సింగరాయకొండ వాస్తవులు శ్రీ శ్రీనివాసులు, గూడూరు నుండి కార్యకర్త శ్రీ కృష్ణకుమార్ రాత్రింబగళ్ళు వ్రాశారు. మెయిను గేటు మన కార్యకర్త శ్రీ బ్రహ్మయ్య డిజైను చేశారు. వేటపాలం గేటు శ్రీ గౌస్ భాషా, శ్రీ వెంకటరావు, శ్రీ రామమూర్తి తయారు చేశారు.

**స్టేజి :** శ్రీ కె. జోజయ్య గారి పర్యవేక్షణలో శ్రీ గౌస్ భాషా అందంగా రూపొందించారు. శ్రీ టి. మల్లారెడ్డి బృందం తయారు చేసిన ధర్మాకోల్ యు.టి.యఫ్. ఎబ్లం మరింత శోభ తెచ్చింది.

**డేలిగేటు బ్యాగులు :** మొత్తం పనిలో కనిపించని శ్రమ డేలిగేట్లకు సంచులు, సాహిత్య అందించడం. 10 వేలమందికి 10 గం॥లలో తయారు చేయడానికి శ్రీ రవీంద్రనాధరెడ్డి, అవి ఎ. సుబ్బారెడ్డి, బసివి రెడ్డి, యస్. ఆంజిరెడ్డి, పి. వెంకటేశ్వర రెడ్డి నాయకత్వాన దాదాపు 100 మంది కార్యకర్తలు కృషి చేశారు. వీటిని జిల్లాలకు అందించడం రాష్ట్ర కార్యదర్శి శ్రీ జి. చిట్టిబాబు నాయకత్వాన పథకం ప్రకారం చక్కగా జరిగింది.

**బ్యాగుల అమ్మకం :** మహసభ సందర్భంగా దాదాపు 6 రకాల క్రొత్త బ్యాగులు, పర్సులు విడుదల చేయడం జరిగింది. లాభాలు లేకుండా అతి చౌకగా అమ్మడం వల్ల తెచ్చిన యొత్తం, బ్యాగులు క్షణాలలో అయిపోయాయి. ఈ కార్యక్రమానికి శ్రీ యం.కె. దత్తు నాయకత్వం వహించగా విజయవాడ ఆఫీసు సిబ్బంది సహకరించారు.

**ప్రజాశక్తి సంచికలు :** యు.టి.యఫ్. కార్యాలయ ఫోనుకు కంప్యూటరు మోడెం బిగించి, ఒంగోలు నుండి కంప్యూటరు ద్వారా విజయవాడ ప్రజాశక్తికి ఫోటోలతో సహా వార్తలు ఎప్పటికప్పుడు పంపించి, ప్రతి



ప్రజాశక్తి బు క్ స్టాల్

రోజు మ॥ 1 గంట వరకు జరిగిన కార్యక్రమాలను ప్రజాశక్తి ప్రత్యేక సంచికగా ముద్రించి, సాయంత్రం 6 గంటలకు అందించడం ఈ మహాసభ ప్రత్యేకత. వారు ముద్రించిన 2 వేల పత్రికలు క్షణాలలో అమ్ముడుపోయాయి.

**సమాచార కేంద్రం :** సమాచార కేంద్రం 2 రోజులు రాత్రింబవళ్ళు పని చేసింది. శ్రీ నరసింహారెడ్డి,శ్రీ కె. ఆదినారాయణ, శ్రీ రోశయ్య గారలు ఈ బాధ్యతలు నిర్వహించారు.

**ఆహ్వాన సంఘ కార్యాలయం :** ఈ కార్యాలయ ప్రధాన బాధ్యతలు నెల్లూరు నుండి వచ్చిన శ్రీ టి. కొండాచారి, శ్రీ గంపా వెంకటేశ్వర్లు నిర్వహించారు. యు.టి.యఫ్. కార్యలయ సిబ్బందితోపాటు సంక్షేమ నిధి కోశాధికారి శ్రీ యస్. రామారావు రాత్రింబవళ్ళు పనిచేశారు. మహాసభ 3 రోజులు శ్రీ టి. నారాయణరావు సహకరించారు.

**ప్రజా సంఘాలు :** సి.ఐ.టి.యు. నాయకులు శ్రీ వై. సిద్దయ్య గారి నాయకత్వన షుమారు 200 మంది వలంటీర్లు మహాసభ విజయానికి 3 రోజులు అహోరాత్రులు పనిచేశారు. చాల క్లిష్టమైన బాధ్యతలు

నిర్వహించారు. ఆ సందర్భంగా పనిచేసిన శ్రీ నాగభూషణం అనే వ్యవసాయ కూలి సంఘనాయకులు ( 30 సం॥)కామెర్ల వ్యాధి ముదిరి మహాసభ తర్వాత వారం రోజులకు మరణించారు. వారి సేవలకు యు.టి.యఫ్. ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుతోంది.

**ముగింపు :** ఈ మహాసభ జయప్రదం చేయడానికి ప్రకాశం జిల్లా కార్యకర్తలు దాదాపు 6 నెలలు కష్టించి పనిచేశారు. మొత్తం జిల్లా సెక్రటేరియట్ శ్రీ డి. లక్ష్మిరెడ్డి, కె. వెంకటరావు, కె. ఆదినారాయణ, జి. శేషయ్య నాయకత్వాన సమర్థవంతంగా కృషిచేశారు. యింత పెద్ద ఎత్తున జరిగిన సభలలో ఒకటి- అరా లోపాలుండకపోవు. కొందరికి యిబ్బంది కలిగి ఉండకపోదు. పెద్దగా పేరుగాంచిన వక్తలు రాలేదనే కొరత కొందరు వ్యక్తం చేసినా ప్రతి కార్యక్రమం ప్రతి సదస్సు జయప్రదమైంది. ఈ కార్యక్రమాలలో ఒక్క పోలీసు జోక్యం లేదు అత్యంత క్రమశిక్షణతో కార్యక్రమాలు జరిగాయి. మహాసభతర్వాత వక్తలు, అతిధులు, ప్రతినిధులు తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. మరింత మైక్రో ప్లానింగుతో పని చేస్తే శ్రమ తక్కువతో మరింత జయప్రదం చేయవచ్చుననేదే మొత్తం మీద అనుభవం. ప్రకాశం జిల్లా శాఖ మొత్తం మహాసభ భారాన్ని భరించగా, యితర జిల్లాలు వారి బాధ్యత మేరకు రాష్ట్ర కార్యాలయ నిర్మాణానికి నిర్ణయించిన కోటాలో దాదాపు 8 లక్షల రూపాయలు అందించి ఉద్యమాభివృద్ధికి తోడ్పడ్డారు.. పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, గుంటూరు, కృష్ణ,, హైదరాబాదు జిల్లాలు కోటాలను మంచివిరాళాలు సేకరించాయి. ప్రతినిధులలో ఎక్కువ శాతం క్రొత్త తరం రావడం ఉద్యమానికి పెట్టుబడి . అన్ని జిల్లాల నుండి అంచనాను మించి వచ్చారు. ఈ మహసభ ఉత్తేజంలో ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకెళ్ళగలమని అందరూ అభిప్రాయపడ్డారు.

# అందరినీ అలరించిన విద్యా, వైజ్ఞానిక ప్రదర్శనలు

యు.టి.యఫ్. 7వ రాష్ట్ర విద్యా వైజ్ఞానిక మహాసభల సందర్భంగా పి.వి.ఆర్. మునిసిపల్ బాలికల హైస్కూలులో ఏర్పాటు చేసిన విద్యా వైజ్ఞానిక ప్రదర్శనను ప్రకాశం జిల్లా కలెక్టరు శ్రీ దాసరి శ్రీనివాసులు గారు ప్రారంభించారు.

ఈ ఎగ్జిబిషన్ జనాన్ని విశేషంగా ఆకర్షించింది. ఈ ప్రదర్శనలో చిత్రకళ, సైన్సు, ఆరోగ్యం, క్రాఫ్ట్ విభాగాలు ఉన్నాయి. ఉపాధ్యాయులలోని సృజనాత్మకత కళాప్రతిభ, శాస్త్రీయ ఆలోచన, పాఠ్యాంశాలను బోధించటానికి స్వల్ప వ్యయంతో బోధనోపకరణాలు తయారు చేసే నేర్పరితనం వెలికితీయటం, ప్రదర్శించటం ఈ ప్రదర్శనల ఉద్దేశ్యం. రాష్ట్రంలోని వివిధ జిల్లాల ఉపాధ్యాయులు ప్రదర్శనలో పాల్గొని జయప్రదం చేశారు. ప్రదర్శనలో ప్రతి అంశమూ సందర్శకుల్ని ఆకట్టుకొన్నాయి. ఈ ప్రదర్శన రెండు రోజుల పాటు నిర్వహించబడింది. యు.టి.యఫ్. అకడమిక్ సెల్ డైరెక్టర్



మహాసభలో సందేశమిస్తున్న ఎం.ఎల్.ఎ. శ్రీ హరిబాబు

శ్రీ టి.జి. సంజీవరావు, యు.టి.యఫ్. రాష్ట్ర కార్యదర్శి, శ్రీ కె. కృష్ణయ్య ఆధ్వర్యంలో సర్వశ్రీ యం.ఎ. ప్రకాష్‌రెడ్డి, యస్.వి.ఆర్. ఆంజనేయులు, యల్. వెంకటేశ్వరరెడ్డి, పి. రవి కుమార్, డి.యస్. రఘురామిరెడ్డి తదితరులు యీ ఎగ్జిబిషన్ నిర్వహించారు.

**చిత్ర కళా ప్రదర్శన విభాగం :** ఈ విభాగంలో ప్రకాశం జిల్లా పూసపాడు డ్రాయింగ్ టీచర్ శ్రీ లంకా ప్రసాద్ గీసిన 100 చిత్రాలు, గంగవరం డ్రాయింగ్ టీచర్ శ్రీ యం. చిన్నయ్య గారి చిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. వీటిలో జాతీయ నాయకుల చిత్ర పటాలు కళాత్మకంగా ఉండగా సామాజిక సమస్యలపై గీసిన చిత్రాలు ప్రతి ఒక్కరిలోనూ ఆలోచనలు రేకెత్తించాయి. సృజనాత్మకంగా, ఆలోచనలు రేకెత్తించిన ఈ చిత్రాలు అందరినీ ఆకట్టుకొన్నాయి.

ఖమ్మం జిల్లా ఉపాధ్యాయులు శ్రీ బి. కృష్ణమూర్తి, శ్రీ వి. విజయకుమార్ గీసిన 100 పైగా కార్టూన్లూ, నెల్లూరు జిల్లా ఉపాధ్యాయుని శ్రీమతి కె.సి. లలిత గీసిన కార్టూన్లు ప్రత్యేకతను సంతరించుకొన్నాయి.

**సైన్సు విభాగం :** ఈ విభాగంలో ఖమ్మం జిల్లా ఎకడమిక్ సెల్ తరపున పెద్ద సంఖ్యలో సైన్సు, గణితము బోధించేందుకు low cost = no cost బోధనోపకరణాలు ప్రదర్శించారు. పశ్చిమ గోదావరి జిల్లా ఉపాధ్యాయులు శ్రీ డి. రాంబాబు, శ్రీ యన్. సూర్యానారాయణ మూర్తి, శ్రీ ఆర్.డి. పూర్ణచంద్రరావు, శ్రీమతి అస్మా కూడా బోధనా సామాగ్రి ప్రదర్శించారు. గణితము, సైన్సు చిన్న పిల్లలకు ఆటలద్వారా నేర్పేందుకుగల అవకాశాలు వివరించారు. తూర్పు గోదావరి జిల్లా ఉపాధ్యాయులు శ్రీ వి. తీర్థారామ్ కిట్ ఆఫ్ ఫిజికల్ సైన్స్, ప్రకాశం జిల్లా ఎ.యం.జి.ఆర్.హెచ్. న్యూలు ఉపాధ్యాయులు శ్రీ టి. రాజేంద్రప్రసాద్-వాతావరణ కాలుష్యము మోడల్, శ్రీ జి.యల్.యన్. మూర్తి-నీటి ధర్మాలను గుర్తించేందుకు ఎలక్ట్రానిక్



ప్రజానాట్యమండలి కళాకారులు

పరికరము, శ్రీ వై. సుబ్బారావు జీవుల వర్గీకరణము, శ్రీమతి పి. రత్నకుమారి వ్యవసాయ రక్షకభటుడు, శ్రీ యోహాన్ వికలాంగుల భోజన పరికరము, శ్రీ ఎ. రాజాకాంత్-ప్రపంచ గడియారం ప్రదర్శించారు.

**'ఆరోగ్య విభాగము :** ఈ విభాగంలో నెల్లూరు జిల్లా జనవిజ్ఞాన వేదిక వారు, ఆరోగ్యంపై ఛార్టులు, గుంటూరు జిల్లా ఎ.యం.జి.ఆర్.



సి.ఐ.టి.యు. అధ్యక్షులు శ్రీ యన్. ప్రభుదాస్

హైస్కూలు ఉపాధ్యాయులు శ్రీ జి. స్టాలిన్ -గుట్కా వలన నష్టాలు-చార్టులు, శ్రీమతి వి. విక్టోరియా -ఎయిడ్స్ వైరస్‌ల మోడల్స్ చార్టులు ప్రదర్శించారు. ఈ చార్టులు ఎంతో విజ్ఞానవంతంగా ఉన్నాయి.

**క్రాఫ్ట్ విభాగం :** ప్రకాశం జిల్లా ఉపాధ్యాయులు శ్రీమతి పి. సువర్ణలత ప్రదర్శించిన కుట్లు, అల్లికలు, స్టాంపులు, నాణెములు, శ్రీ యన్. తిరుపతయ్య ప్రదర్శించిన కట్ వర్క్, డిజైన్ చిత్రాలు, గుంటూరు జిల్లా ఎ.యం.జి.ఆర్.హెచ్. స్కూలు ఉపాధ్యాయుని శ్రీమతి కె. కుసుమ కుమారి ప్రదర్శించిన కలంకారీ వస్తువులు, నెల్లూరు ఉపాధ్యాయుడు శ్రీ యం. బలరామయ్య ప్రదర్శించిన "ఆదర్శ గ్రామము" మోడల్ అందరినీ ఆకట్టుకొన్నాయి.

# అందరినీ ఉత్తేజపరచిన సాంస్కృతిక కార్యక్రమాలు

మహాసభల రెండు రోజులూ మార్చి 8,9 తేదీలలో ప్రదర్శించబడిన సాంస్కృతిక కార్యక్రమాలు మన సంస్కృతి సంప్రదాయాలనూ ప్రతిబింబిచటమే గాక యు.టి.యఫ్.గా మనం కోరుకొంటున్న గమ్యాన్ని ప్రదర్శించబడటం ఒక ప్రత్యేకత. సదస్సుల సందర్భంలో ఆయా అంశాలకు సంబంధించిన పాటలు పాడుతూ కళాకారులు వేలాది మంది ప్రతినిధుల అభిమాన్నాన్ని అందుకున్నారు.

భోజనశాలలో ప్రతినిధులు

8-3-97న సాంస్కృతిక కార్యక్రమాలు భారత రాజధాని ఢిల్లీతో సహా అనేక పట్టణాలలో ప్రదర్శనలిచ్చి ప్రముఖుల ప్రశంసలనందుకున్న ఒంగోలు హెచ్.సి.యం. జూనియర్ కాలేజి సీనియర్ ఇంటర్ విద్యార్థిని కుమారి స్మిత సాంప్రదాయ భరత నాట్య ప్రదర్శనతో ప్రారంభమయ్యాయి. 6 సం॥ వయస్సు గల చిరంజీవి సౌమ్య శ్రీసింగ్ ప్రకాశం జిల్లా తర్లుపాడు మండల ఉపాధ్యాయుని శ్రీమతి యం.ఎస్. కుమారి ఆధ్వర్యంలో ప్రదర్శించిన "మేడ్ ఇన్ ఇండియా" నృత్యం, క్రొత్తపట్నం మండల శాఖ ఆధ్వర్యంలో 3,4,5 తరగతుల విద్యార్థులు

భోజన ఏర్పాట్లు చూసిన కార్యకర్తలు

శ్రీ మాల కొండారెడ్డి దర్శకత్వంలో ప్రదర్శించిన "పరమానందయ్య శిష్యుల కథ" హాస్య నాటిక, మద్దిపాడు మండలం జడ్.పి.హెచ్.యస్. లింగంగుంట్ల ఉపాధ్యాయులు శ్రీ యం.వి. అప్పారావు ఈనాటి భారత దేశ పరిస్థితులను, విధానాలను ప్రజలకు తెలియపరుస్తూ ప్రదర్శించిన "భారత దేశం చూడరబాబూ" ఏకపాత్రాభినయం, సమాజంలో నేడు ఉపాధ్యాయుడు ఎదుర్కొంటున్న సమస్యలను, బోధనేతర కార్యక్రమాల్లో ఉపాధ్యాయులను నియమించుట వలన విద్యా బోధనకు అంతరాయం కలగటమేకాక విద్యా ప్రమాణాలు ఎలా కుంటుపడుతున్నాయో తెల్పుతూ శ్రీ బాణాల కృపమాచారి నేతృత్వంలో ఖమ్మం జిల్లా ఉపాధ్యాయులు ప్రదర్శించిన "పంతులు గారు-పట్టాకత్తి" నాటిక అందరి మన్ననలు పొందాయి.

"ఆరోగ్యవంతమైన శరీరంలోనే ఆరోగ్యవంతమైన మనసు ఉంటుంది" కనుక శరీరాన్ని, మనస్సుని ఆరోగ్యంగా ఉంచుకొనేందుకు అవసరమైన "యోగాసనాల"ను ఖమ్మం జిల్లా అశ్వారావుపేట మండల ఉపాధ్యాయులు శ్రీ టి. జీవన్‌కుమార్ ప్రదర్శించారు.

దేశం అభివృద్ధి చెందుతున్నా పేదవాడు మరింత పేదవానిగా మిగులుతున్న ఈ వ్యవస్థలో అవినీతి, లంచగొండి విధానాలకు పేదవాడు ఏ విధంగా బలిపశువు అవుతున్నాడో చూపుతూ ఈ వ్యవస్థ బాగుపడాలంటే ఏమి చెయ్యాలో సందేశాత్మకంగా తెలియచేశారు యు.టి.యఫ్. ఒంగోలు శాఖ వారు తమ "సర్పయాగం"లో. ఈ నాటికకు రచయిత శ్రీ వి.యస్. కామేశ్వరరావు దర్శకత్వం వహించారు. పశ్చిమ గోదావరి జిల్లా యు.పి. స్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ రామకృష్ణారావు "సుభాష్ చంద్రబోస్" ఏకపాత్రాభినయం చేశారు.

కష్టజీవులు తమ శ్రమతో సృష్టించిన సంపదను వారికి దక్కకుండా చేస్తున్న వారిని చట్టం, న్యాయం ఏమీ చేయలేని స్థితి పోవాలంటే అధికారం కొందరి చేతిలోకాక సమాజం చేతిలో ఉండాలనీ, అపుడే

వైజ్ఞానిక ప్రదర్శనలు నిర్వహించిన శ్రీ కె. వెంకటేశ్వర్లు

కష్ట జీవులకు న్యాయం జరుగుతుందని, యజ్ఞఫలాన్ని యజ్ఞం చేసిన కష్ట జీవులు అందుకోగల్గుతారని సందేశం యిస్తూ కొత్తపట్నం మండలం యు.టి.యఫ్. శాఖ శ్రీ బి. కృష్ణయ్య నేతృత్వంలో "యజ్ఞ ఫలం" నాటికను ప్రదర్శించారు.

వివిధ సంగీత దర్శకుల నేతృత్వంలో ప్రముఖ గాయకుడు ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం "Twinkle Twinkle Little Star పాటను ఎలా పాడతారో నాగులుప్పలపాడు ఉపాధ్యాయుడు శ్రీ కటకం వెంకటేశ్వర్లు పాడి ప్రేక్షకుల్ని ఆనందపరిచారు.

9-3-97న మహాసభల ఆహ్వాన సంఘ అధ్యక్షులు, ప్రముఖ రచయిత డా॥ నాగభైరవ కోటేశ్వరరావుగారి "కవన విజయం"తో సాంస్కృతిక కార్యక్రమాలు ప్రారంభం అయ్యాయి. వివిధ సాహిత్యాలు - సమాజం పై వాటి ప్రభావం అంశం ఆధారంగా సినిమా సాహిత్యం పిల్లల మీద, నవలా సాహిత్యం సమాజం మీద చూపే ప్రభావాన్ని 12 మంది పాత్రధారులతో ప్రదర్శించబడిన కవితా వైభవం "కవన విజయం' ' ఒక నూతన ప్రక్రియ. ఈ కవన విజయం అందరి మన్ననలను పొందింది.

నేటి సామాజాన్ని పట్టి పీడిస్తున్న మూఢ విశ్వాసాలు - "చేతబడి'', "గ్రహచారం" వంటివి. ప్రజల బలహీనతలను సొమ్ముచేసుకొంటూ గాలి నుండి "నిప్పులేని మంట"సృష్టించే బాబాలు, నీళ్ళ స్వాములు కోకొల్లలు. ఈ చిట్కాలను శాస్త్రీయంగా విశ్లేషిస్తూ ప్రజలను ఈ మూఢ విశ్వాసాల నుండి ఎలా దూరం చేయాలో తమ "మ్యాజిక్ ప్రదర్శన" ద్వారా తెలియ జేశారు నెల్లూరు ప్రభుత్వ బి.ఇ.డి. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ పి. భీమన్న

తమ సర్వస్వాన్ని త్యాగం చేసి దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించిన మహనీయులను ఈనాడు జాతి మరచిపోతోంది. వారి గొప్పదనాన్ని కీర్తించి వారి త్యాగాలను, సేవలను గుర్తుకు తెచ్చుకోవలసిన అవసరాన్ని పరుచూరు మండల యు.టి.యఫ్. వారు తమ "జాతిస్మరామి" నాటికలో చాటి చెప్పారు.

పౌరాణిక నాటకం ఆంధ్రుల సొత్తు. హరిశ్చంద్ర నాటకం మనం గర్వంగా చెప్పుకొనే నాటం, 'కాటిసీను' ఆ నాటకంలో గొప్పదైతే పురుషులు మాత్రమే రంజింప చేసే ఈ పాత్రను అంత చక్కగానూ పోషించి అందరి ఆదరణ పొందారు తూర్పు గోదావరి జిల్లా పెదపాలెం ఉపాధ్యాయుని శ్రీమతి గ్రేస్ తమ "హరిశ్చంద్ర" ఏకపాత్రాభినయంతో.

అప్పటికే రాత్రి 2 గం॥ అవటంతో ఖమ్మం జిల్లా భద్రాచలం యు.టి.యఫ్. శాఖ వారు తమ "రాజీనామా" నాటిక ప్రదర్శింప లేకపోయారు.

"కళా కళ కోసమే కాదు..... ప్రజల కోసం..... సమాజం కోసం" అన్న ఆలోచనకు దర్పణం పడుతూ సాగిన మహాసభల సాంస్కృతిక కార్యక్రమాలు వేలాది ఉపాధ్యాయులలో ఆలోచనలకు కలిగించాయి. మన్ననలు పొందాయి.

సాంస్కృతిక విభాగం తరపున ఖమ్మం జిల్లా ప్రదాన కార్యదర్శి శ్రీ యన్. నారాయణ ఆధ్వర్యంలో శ్రీ కటకం వెంకటేశ్వర్లు కన్వీనర్‌గా మహాసభలకు ప్రత్యేకంగా రూపొందింపబడిన పాటల క్యాసెట్ అందరి ఆదరాన్ని పొందింది వందల కాసెట్లు అమ్ముడయినాయి.

ఈ మహాసభల సాంస్కృతిక కార్యక్రమాలను రాష్ట్ర కార్యదర్శి వర్గ సభ్యులు శ్రీ యన్. రామకోటేశ్వరరావు గారి నేతృత్వంలో శ్రీ కటం వెంకటేశ్వర్లు నిర్వహించారు. ఆంధ్ర ప్రజానాట్య మండలి కళాకారులు సర్వశ్రీ దేవేందర్, జగన్, దశరధ, దుబ్బా కోటేశ్వరరావు, శ్యాం జాన్, శ్రీమతి విజయలక్ష్మి గార్లు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, ఖమ్మం జిల్లాలకు చెందిన ఉపాధ్యాయులు మహాసభలలో మధ్య మధ్య పాడిన అభ్యుదయ గీతాలు మహానభలకు వచ్చిన వేలాది ఉపాధ్యాయుల మన్ననలు పొందాయి.

# ఉపాధ్యాయ క్రీడోత్సవాలు

యు.టి.యఫ్. 7వ రాష్ట్ర మహాసభ మార్చి 8,9,10 తేదీలలో ఒంగోలులో జరుగనున్న సందర్భములో ఫిబ్రవరి 8,9 తేదీలలో ఒంగోలు డి.ఆర్.ఆర్. మునిసిపల్ ఉన్నత పాఠశాలలో జిల్లాస్థాయిలో ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు క్రీడలలో, ఆటలలో పోటీలు నిర్వహించబడ్డాయి.

ఫిబ్రవరి 8వ తేదీ ఉదయం 10.30 గం॥లకు జరిగిన ప్రారంభసభకు జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ వెంకటరావు అధ్యక్షత వహించారు. రాష్ట్ర కార్యదర్శి శ్రీ డి. లక్ష్మీరెడ్డి జాతీయపతాకమును, రిటైర్డ్ పి.యి.టి. శ్రీ కె. అంకులు క్రీడాపతకమును ఆవిష్కరించిరి. జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. ఆదినారాయణ, ఫిజికల్ డైరెక్టర్ శ్రీ బి.కోటేశ్వరరావు, పి.ఇ.టి. శ్రీ యన్. వెంకటేశ్వర్లు గారలు సందేశములనిచ్చిరి. క్రీడోత్సవముల కమిటీ కన్వీనర్ శ్రీ పి.జాన్‌బాబు పోటీలను గురించి వివరించిరి. ఒంగోలు పట్టణశాఖ అధ్యక్షులు శ్రీ బి. సుబ్బారావు వందన సమర్పణతో సభ ముగిసింది.



పతాకాల ప్రాంగణాన్ని తీర్చిదిద్దిన శ్రీ యన్. యలమంద

అనంతరము ఉపాధ్యాయినులకు 100 మీ. పరుగు పందెము, 200 మీ. స్పీడ్ నడక, షాట్‌పుట్, లెమన్ స్పూన్ నడక, మ్యూజికల్ చైర్స్ అంశములలో 40 సం॥ల వయస్సులోబడిన వారికి, పైబడినవారికి వేరువేరుగా పోటీలు నిర్వహించబడినవి.

జిల్లాలోని తాలూకా కేంద్రముల టీములు తయారుచేసి మహిళలకు టెన్నికాయిట్ మరియు త్రోబాల్ పోటీలు నిర్వహించబడినవి.

పురుషులకు 40 సం॥లలోపు వయస్సువారికి 100 మీ. పరుగుపందెం, 400 మీ. స్పీడ్ నడక, షాట్‌పుట్, లాంగ్‌జంప్ అంశములలోను, 40 సం॥ పైబడినవారికి50 మీ. పరుగు పందెం, 200 మీ. స్పీడ్‌నడక, షాట్‌పుట్, లాంగ్‌జంప్ అంశములలోను పోటీలు నిర్వహించబడినాయి.

తాలూకా కేంద్రముల టీములు తయారుచేసి వాలీబాల్, బ్యాడ్‌మింటన్ ఆటలలో పోటీలు నిర్వహించబడినాయి.

8వ తేదీ మధ్యాహ్నం జిల్లా పరిషత్ విద్యాశాఖాధికారి శ్రీ కె. జయచంద్రకుమార్‌గారు క్రీడాప్రాంగణమునకు విచ్చేసి క్రీడాకారులను ఉత్సాహపరిచిరి. ఈ రెండు రోజుల పోటీలలో జిల్లా నలుమూలాల నుండి సుమారు 400 మంది ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు పాల్గొని యు.టి.యఫ్. ప్రతిష్ఠను ఇనుమడించజేసిరి.

పాటల పోటీలు : జిల్లాస్థాయిలో ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులకు వేర్వేరుగా పాటల పోటీలను ఫిబ్రవరి 9వ తేదీ ఉదయం 11.30 గం॥ నుండి డి.ఆర్.ఆర్. మునిసిపల్ ఉన్నత పాఠశాలలో నిర్వహించుట జరిగింది. అధిక సంఖ్యలో ఉపాధ్యాయులు ఈ కార్యక్రమంలో పాల్గొని జయప్రదం చేసిరి.

పాటల పోటీలకు న్యాయనిర్ణేతలుగా జనవిజ్ఞానవేదిక నాయకులు శ్రీ ఎ.వి.పుల్లారావుగారు, ప్రజానాట్యమండల కళాకారులు శ్రీ దశరథ, శ్రీ ఉబ్బా కోటేశ్వరరావుగారలు వ్యవహరించిరి. సాంస్కృతిక విభాగ కన్వీనర్ శ్రీ కటకం వెంకటేశ్వర్లు కార్యక్రమం నిర్వహించిరి.



వాలీబాల్ విన్నర్స్, పొదిలి టీమ్

## బహుమతి ప్రదానము

ఫిబ్రవరి 8,9 తేదీలలో నిర్వహించిన వివిధ పోటీలలో విజేతలకు బహుమతులు అందజేయుటకు ముగింపుసభ 9వ తేదీ సాయంత్రం 5.30 గం॥లకు ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో నిర్వహించబడింది.



మహాసభలో వైద్య సేవలు అందిస్తున్న డాక్టర్లు

ఈ సభకు జిల్లాశాఖ అధ్యక్షులు శ్రీ కె. వెంకటరావు అధ్యక్షత వహించిరి. ముఖ్యఅతిథిగా ప్రకాశంజిల్లా కలెక్టరు మరియు మేజిస్ట్రేటు శ్రీ దాసరి శ్రీనివాసులుగారు విచ్చేసిరి. ప్రధాన కార్యనిర్వహణాధికారి శ్రీ యస్.వి. బాలగోపాల్‌గారు, రాష్ట్ర అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డిగారు, ఒంగోలు మునిసిపల్ ఛైర్మన్ శ్రీ మంత్రి శ్రీనివాసరావుగారు, రాష్ట్ర కార్యదర్శి శ్రీ డి. లక్ష్మీరెడ్డిగారు వేదికనలంకరించిరి.

పాటల పోటీలలో ప్రథమ బహుమతి పొందినవారికి కలెక్టరుగారు బహుమతులను అందజేసిరి.

క్రీడలలో విజేతలకు శ్రీ యస్.వి. బాలగోపాల్‌గారు, శ్రీ మంత్రి శ్రీనివాసరావుగారు, శ్రీ డి. రామిరెడ్డిగారు బహుమతులను అందజేసిరి.

పాటల పోటీలలో ప్రథమ బహుమతులు పొందిన శ్రీమతి డి. ప్రశాంతి శ్రీ యం. బ్రహ్మయ్యలు వారి గానమాధుర్యములో సభికులను అలరించిరి.

## వ్యాసరచన పోటీలు

జిల్లాలోని అన్నిమండల, పట్టణశాఖల పరిధిలోని ఉన్నత పాఠశాలల్లో 8,9,10 తరగతుల విద్యార్థినీ విద్యార్థులకు ఫిబ్రవరి 23వ తేదీ ఆదివారం "మద్యపాన నిషేధము విజయవంతం కావాలంటే" అను అంశముపై వ్యాసరచన పోటీలు నిర్వహించబడినాయి. ఈ పోటీలలో పాల్గొనిన విద్యార్థినీ విద్యార్థులకు మండలస్థాయిలో ప్రథమ ద్వితీయ, తృతీయ బహుమతులు అందజేయబడినవి. ప్రతి మండల, పట్టణశాఖల నుండి మొదటి మూడు బహుమతులు పొందిన వారి పేపర్లు సేకరించి, వానిని మరల దిద్దించి జిల్లాస్థాయిలో ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు ఇవ్వబడును. ఈ బహుతులు ఏప్రియల్ నెల 24,25 తేదీలలో జరుగు సంఘసమావేశములో అందజేయబడును.

పై పోటీలలో బహుమతులు ప్రశంసాపత్రములు చీమకుర్తిలోని గ్రానైట్ కంపెనీ అధినేతలు శ్రీ యుతులు సిద్ధా రాఘవరావుగారు, సిద్ధా నాగేశ్వరరావుగారు, చలువాది బదరీనారాయణగారలు అందజేసిరి.

## పీరియడ్ పథకము రచనా పోటీ

జిల్లాలోని ఉపాధ్యాయులకు ప్రాథమిక, ప్రాథమికోన్నత, ఉన్నత పాఠశాల స్థాయిలలో పిరియడ్ ప్లాను రచనలో పోటీలు నిర్వహించబడినవి. విజేతలకు 24.4.97న జరుగు ఆహ్వానసంఘ సమావేశములో బహుమతులు యివ్వబడతాయి.

### ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక పత్రికలలో మేటి
లేదు మరొకటి దీనికి సాటి
అత్యధిక మరొకటి దీనికి పత్రిక
యు.టి.యఫ్. అభిమాన పుత్రిక

### ప్రకటన రేట్లు (నెలకు)

| | | |
|---|---|---|
| 4వ కవరు పేజి (మల్టీ కలర్) | - రూ. | 5,000/- |
| 2వ కవరు పేజి | - రూ. | 3,000/- |
| 3వ కవరు పేజి | - రూ. | 3,000/- |
| లోన పూర్తి పేజి | - రూ. | 2,000/- |
| లోన సగం పేజి | - రూ. | 1,000/- |
| లోన పావు పేజి | - రూ. | 500/- |



# స్వాగతోపన్యాసం

డా॥ నాగభైరవ కోటేశ్వరావు,
అధ్యక్షులు, ఆహ్వాన సంఘం.

మహాశయులారా,

**స్వాగతం ! సుస్వాగతం !!**

ఆంధ్ర దేశం నాలుగు చెరుగుల నుండి - అధ్యాపక వృత్తి నుండి అక్షర దాసం నుండి - ఇవాళ యు.టియఫ్ రాష్ట్ర మహాసభలకు అరుదెంచిన - ఆశయ సంపన్నులైన అధ్యాపకులకూ, ఉత్తేజిత మనస్కులైన ఉపాధ్యాయులకూ, సభలకు అరుదెంచిన ఆహ్వానితులకు, అభిమానులకు - అందరికీ ఆహ్వాన సంఘం తరపున అధ్యక్షుడుగా నా స్వాగతాంజలి.

గతాన్ని స్మరిస్తూ వర్తమానాన్ని గమనిస్తూ భవిష్యత్తుకు బాటలు వేయాలని ఆలోచనలు చేసే చలువ పందిళ్ళు యిలాంటి సమావేశాలు, మనల్ని మనం అంచనా వేసుకునే అనుభవాల ఆలయాల వాకిళ్ళు యీ సదస్సులు. అందరం ఒకటై, ఆత్మలు ఒకటై, ఆశయాలు ఒకటై, అంతరంగాలు ఆరబోసుకొనే శ్యామల మైదానాల లోగిళ్ళు ఈ సమాఖ్య సమావేశాలు. అదృష్టవశాత్తు ఈ సభలు ప్రకాశం జిల్లాలో జరుగుతున్నాయి. అధ్యాపక వృత్తిలో గడితేలిన మీ పాద ముద్రలచే పునీతమౌతున్న మా ఒంగోలు చరిత్ర ధన్యమౌతోంది.

గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాల భాగాలతో పాతికేళ్ళనాడు ఏర్పడిన ఈ జిల్లా ఆర్థికంగా వెనుకబడినదైనా, సాహార్థికంగా సంపన్నమయింది. ఇది ఎర్రన పుట్టిన కవితాక్షేత్రం; త్యాగరాజు పుట్టిన గాన కళా కేంద్రం, కాటమరాజు ఖడ్గ చాలనం చేసిన పోతుగడ్డ, అవచి తిప్పయ్య శెట్టి ఐశ్వర్య విలాసం లాస్యం చేసిన సిరుల మాగాణం. ఇక్కడ రామదండు గోపాలుడు ఉద్యమాలకు ఊపిరిలూదాడు. ఇక్కడ ఆంధ్ర కేసరి జన్మించి దొర తుపాలకులకు రొమ్ము లొడ్డి ఎదిర్చాడు. ఇక్కడ పుట్టిన బండారు రామారావు హరిశ్చంద్రపాత్రకు సుగంధాలు దిద్దాడు. మా ఒంగోలు గిత్తలు దారుఢ్యానికి, సౌందర్యానికి ఆనవాళ్ళు, మా మార్కాపుర్ పలకలు ప్రపంచం దిద్దుకునే ఓనమాలకు చేవ్రాళ్ళు. చీరాల చేనేతకూ, చీమకుర్తి గ్రానైట్‌కీ ప్రసిద్ధి. ఇన్ని గొప్పలున్నా మా సాంస్కృతిక సమైక్య జీవితం ఈనాడు బలహీనమైంది. తీర ప్రాంతంలో ఉండి తరచుగా తుఫాను తాకిడిని ఎదుర్కొనే ఈ ప్రాంతం అపజయాలనించే విజయాలు నేర్చుకొంటుంది. ఆత్మ ధైర్యానికి ప్రసిద్ధి కెక్కింది.

సకల విద్యలకు స్థానాలై, కృష్ణకుచేలురకు ఉత్కృష్ట విద్యలందించే సాందీపనులు మీరు. గురు దక్షిణగా బొటనవ్రేలు అడగబోని ద్రోణాచార్యులు మీరు. బోధనలో హేతువును జోడించే అరిస్టాటిల్‌కి అనుచరులు మీరు. మహోత్తర క్రమశిక్షణకి మారు పేర్లయిన మాథ్యూ ఆర్నాలుకు సోదరులు మీరు. మీ అందరికి స్వాగతం.

మీది మహత్తర వృత్తి, మహోత్తమ బాధ్యత మీది. మీ పాదాల చప్పడుకు క్లాసురూము కవాటాలు తెరచుకొంటోంది. భవిష్యత్తు మీ ముందు బాల్యమై బాచాపట్లు వేసుకొని కూచుంటుంది. మీరిచ్చే మెరుపుల కోసం నల్లబల్ల ఆత్రంగా ఎదురు చూస్తుంది. మీరు నోరు విప్పతారు - గదంతా గంధం వ్యాప్తిస్తుంది; మీ మాటలు ప్రబోధాలవుతాయి. చెర్నాకోలలవుతాయి. మీరు ప్రవక్తలవుతారు; శాసనకర్తలవుతారు. పతనమైపోతున్న విలువల్ని పరిరక్షించాల్సిన బాధ్యత మనకొక కన్ను; మాయమై పోతున్న మానవ సంబంధాలను ఉద్ధరించే ప్రయత్నం మరో కన్ను.

మీకూ మీ వృత్తికీ మోకరించినమస్కారిస్తాను. మళ్ళీ జన్మంటూ ఉంటే ఉపాధ్యాయుడుగా పుడతాను.

ఏవైనా అసౌకర్యాలు ఏర్పడితే సహృదయంతో సర్దుకు పోగలరని ఆశిస్తున్నాను. ఈ౩ రోజులలో జరిగే కార్యక్రమాల్లో, చర్చల్లో పాల్గొని విద్యాభివృద్ధికి, మీ ఉపాధ్యాయ ఉద్యమాభివృద్ధికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను.



# అధ్యక్షోపన్యాసము

**శ్రీ డి. రామిరెడ్డి**
అధ్యక్షులు, యు.టి.యఫ్.

వేదిక నలంకరించిన పెద్దలారా !

మహాసభ ప్రతనిధులారా ! సౌహార్ద ప్రతినిధులారా !

సోదర సంఘ నాయకులారా ! పుర ప్రముఖులారా !

విద్యావేత్తలారా !

ఎన్నో వ్యయా ప్రయాసల కోర్చి సుదూర ప్రాంతాల నుండి ఈ మహాసభకు విచ్చేసిన మీకందరకు స్వాగతం! సుస్వాగతం !! మన మంత్రివర్యులు, యితర పెద్దలు ఎన్నో వత్తిడి కార్యక్రమాలు ఉన్నప్పటికీ మన మీద ప్రేమతో విచ్చేసినందుకు వారికి ఉద్యమ పక్షాన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ 1974 ఆగష్టు10 న ఆవిర్భవించింది. అప్పటి నుంచి ప్రతి 3, 4 సంవత్సరాలకొకసారి మహాసభలు జరుపుకుంటున్నాం. 1974లో రాజమండ్రి, 1977 లో ఖమ్మం, 1981లో భీమవరం,1986లో విజయవాడ, 1989లో నెల్లూరు, 1993లో గుంటూరు పట్టణాలలో మహాసభలు జరిగాయి. ప్రతి మహాసభకు హాజరయ్యే ప్రతినిధులు, సౌహార్ద ప్రతినిధుల సంఖ్య క్రమంగా పెరుగుతూ వస్తున్నది. ఈ మహాసభలు ఒక ప్రధానమైన లక్ష్యంతో జరుపబడుతున్నాయి. సంస్థాగత నిర్మాణ విషయాలు, భవిష్యత్ ప్రణాళికలతో బాటు, ఉపాధ్యాయులను, ప్రజలను అనేక విధాల చైతన్య పరచాలనీ, నేటి సామాజిక, ఆర్థిక పరిస్థితులను, ప్రభుత్వ విధానాలను తెలియపరస్తూ, విద్యారంగ అభివృద్ధికి నిర్దిష్ట మార్గాలు చూపిస్తూ, దానితో మొత్తం ప్రజానీకాన్ని, ఉపాధ్యాయులను ఈ అభివృద్ధి కృషిలో భాగస్వాములను చేయాలనేదే ప్రధాన లక్ష్యం. దానితోపాటు ఉపాధ్యాయుల కోర్కెల సాధనకు జరిగే పోరాటానికి ఉపాధ్యాయులను సన్నద్ధంచేయడం మరొక లక్ష్యం. అందువల్లనే ఈ మహాసభలను జయప్రదం చేయడానికి కేవలం ఉపాధ్యాయులే కాకుండా విద్యాభిమానులు, వదాన్యులైన దాతలు, శ్రమశక్తి సహకారంతో అనేక మంది కార్యకర్తలు తోడ్పడుతున్నారు.

మహాసభ కార్యక్రమాలలో ప్రారంభ సభ, ఊరేగింపుతోబాటు పలు రాజకీయ పార్టీల అభిప్రాయాలను తెలుపుటకు బహిరంగ సభ, మహిళలను చైతన్య పరచుటకు మహిళా సదస్సు, విద్యా విషయాలు చర్చించుటకు విద్యా సదస్సు, సామాజిక సదస్సు, సాహిత్య సదస్సు, కళారంగంలో ఉపాధ్యాయుల ప్రతిభా సామర్థ్యాలు ప్రతిబింబించేలా వైజ్ఞానిక ప్రదర్శనలు ఏర్పరచబడ్డాయి. ఇటీవలనే ప్రకాశం జిల్లాలోని ఉపాధ్యాయులకు ఆటల పోటీలు, విద్యార్థులకు "మద్య నిషేధం" అంశంపై వ్యాసరచన పోటీలు జరుపబడ్డాయి.

అలాగే పనికిరాని వస్తువులతో పదార్థాలతో సైన్సు బోధించే ఉపకరణాల ప్రదర్శన, రాజకీయ, సామాజిక పరిస్థితులకు అద్దం పట్టే కార్టూన్లు, చార్టుల ప్రదర్శన, కళాత్మకమైన చిత్రాలు ప్రదర్శించే చిత్రకళా ప్రదర్శన, పి.వి.ఆర్. మునిసిపల్ బాలికల ఉన్నత పాఠశాల ఆవరణలో ఏర్పాటు చేయబడ్డాయ్. ప్రతి సదస్సుకు ఆయా రంగాలలో ప్రసిద్ధులైన వారిని ఆహ్వానించాం. ఇదే కాంలో అసెంబ్లీ, పార్లమెంట్ సమావేశాలు జరుగుతున్నందున మేమాశించిన ప్రముఖులు కొందరు రాలేకపోతున్నారు. అయినా వారి సందేశాలు మహాసభలో చదువబడుతాయి.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు వ్యవస్థ కూలిపోయిన నేపథ్యంలో ఏకధృవ ప్రపంచం ఏర్పడింది. అన్ని రంగాలలో ప్రభుత్వ రంగ పాత్రను తగ్గించి ప్రైవేటు రంగానికి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలని, స్వేచ్ఛా మార్కెటుకు

అనుగుణంగా ఆర్థిక వ్యవస్థ రూపొందాలని, దేశాల సరిహద్దులు చెరిపివేసి ప్రపంచమంతా ఒకే మార్కెట్ అనే గ్లోబలైజేషన్ సిద్ధాంతం ఊపందుకున్నది. దీనివల్ల అభివృద్ధి చెందిన దేశాలు అభివృద్ధి చెందుతున్న దేశాల వనరుల్ని కబళించి, నిర్వీర్యం చేయడం జరుగుతోంది. అప్పుల పేరుతో, పెట్టుబడుల పేరుతో ప్రతి దేశంలో ప్రవేశించి వారి కనుకూలమైన షరతులతో వర్ధమాన దేశాల విధానాలను నియంత్రించి, వడ్డీలు కూడా తీర్చలేని పరిస్థితులు కల్పించి, పరోక్షంగా వలస పాలన సాగించాలన్నదే ఐ.యం.ఎఫ్., ప్రపంచ బ్యాంకుల ప్రధాన లక్ష్యం.

స్వాతంత్ర్యం వచ్చి 50 సంవత్సరాలైనా నేటికీ అందరికి చదువు ఎండమావిగానే ఉంది. అందరికీ ఉద్యోగాలు అనే అంశం అజెండా నుంచే తుడిచి వేయబడింది. విద్య, మానవ వనరుల అభివృద్ధి అన్ని రంగాల అభివృద్ధికి కీలకమనే విషయం విస్మరించి, దానిని సేవా రంగంగా పరిగణించడం వల్ల దేశానికి తీరని నష్టం జరిగింది. ఈ విషయం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గుర్తించాలి. గత 50 ఏండ్లలో వచ్చిన వ్యవసాయ విప్లవం, శ్వేత విప్లవం, జనాభా నియంత్రణ, పర్యావరణ పరిరక్షణ, శాస్త్ర పరిశోధనలు విద్యారంగ అభివృద్ధి వల్లనే సాధించ బడ్డాయనే విషయాన్ని గుర్తించాలి. మన దేశం మరింత అభివృద్ధి సాధించాలంటే విద్యారంగానికి ఎక్కువ నిధులు కేటాయించాలి.

గ్రామాభివృద్ధిలో పాఠశాల కేంద్ర బిందువు కావాలి. గ్రామంలో వున్న వనరులన్నింటిని ఉపయోగించి అభివృద్ధి చేసే విద్య మన పాఠశాలల్లో బోధింపబడాలి. గ్రామాలలో, పట్టణాలలో ఉన్న వ్యవసాయిక, పారిశ్రామిక కార్యక్రమాలకు పాఠశాలలు జత చేయబడాలి. ఉపాధ్యాయులు అంకిత భావంతో, ఆత్మ విశ్వాసంతో, గౌరవ భావంతో పనిచేసే విధంగా పాలక వర్గాలు, ప్రజలు వ్యవహరించాలి. ఆత్మ విశ్వాసం కోల్పోయిన ఉపాధ్యాయుడు భావిపౌరులను తయారు చేయ్యలేడు.

నేడు అన్ని రంగాలలో ప్రైవేటీకరణ నినాదం వినిపిస్తున్నది. ప్రైవేటీకరణ పేరుతో జరిపే విద్యా వ్యాపారాన్ని యు.టి.యఫ్. వ్యతిరేకిస్తుంది. ప్రభుత్వం విద్యారంగం నుండి తప్పకొని విద్యను ప్రైవేటు రంగ దయాదాక్షిణ్యాలకు వదలిపెట్టడాన్ని వ్యతిరేకిస్తుంది. ఏ నియంత్రణ లేని విచ్చలవిడి ప్రైవేటు సామ్రాజ్యాన్ని ఎదుర్కొని పోరాడుతుంది.

ప్రజలకు సేవచేసే భావనతో ప్రభుత్వానికి తోడడితే ప్రైవేటు రంగాన్ని హర్షించవచ్చు. కాని పోటీ, ప్రతిష్ట పెంపుదల కోసం, అన్ని రకాల నైతిక విలువలకు కాలరాచి లాభాలే పరమావధిగా జరిగే విద్యా వ్యాపారాన్ని కొనసాగనీయరాదు.

అధ్యయనం, అధ్యాపం, సామాజిక స్పృహ మా లక్ష్యం. హక్కులు, బాధ్యతలు రెండు నేత్రాలుగా ఉపాధ్యాయులు భావించలన్నదే మా ధ్యేయం. అందుకే ఉపాధ్యాయుల ఆర్థిక, సాంఘిక, నైతికాభివృద్ధికి కృషి చేస్తూనే సామాజిక స్పృహతో మేము అనేక కార్యక్రమాలలో పాల్గొంటున్నాం. అక్షరాస్యతా ఉద్యమంలో అగ్రభాగాన ఉన్నాం. మద్యపాన నిషేదం జయప్రదం చేయడానికి మావంతు ప్రచార కృషి సాగిస్తున్నాం. పరీక్షలలో అవినీతిని అంతమొందించడానికి కృషి చేస్తున్నాం. పరిసరాల పరిరక్షణ, సైన్సు, విజ్ఞానాన్ని ప్రజలకందించే లక్ష్యంతో పనిచేస్తున్న జనవిజ్ఞాన వేదికలో చురుకైన పాత్ర వహిస్తున్నాం. భవిష్యత్తులో మరిన్ని సామాజిక కార్యక్రమాలు చేపట్టాలనుకొంటున్నాం.

మహాశయులారా, యు.టి.యఫ్. ఉక్కు క్రమ శిక్షణకు పెట్టింది పేరు. వేలాది మందికి వసతులు కల్పించడంలో ఏవైనా లోపాలు జరగవచ్చు. మహా సభలను జయప్రదం చేయడం, పెద్దల సందేశాలను అలకించడం,, జీర్ణించుకొని భవిష్యత్ ఉద్యమానికి ఉపయోగించుకోవడం మా లక్ష్యం. అందుచే మీ ప్రధాన దృష్టిని మహాసభ అన్ని విధాల జయప్రదం కావడం మీద సారించాలని, అన్ని సదస్సులు జయప్రదమగుటకు తోడ్పడాలని కోరుతున్నాను.

పత్రికా విలేకరుల, రేడియో, దూరదర్శన్ ఇతర టి.వి. సంస్థల ప్రతినిధులు ఈ మహాసభల విజయానికి ప్రత్యేక సహకారాన్ని అందిస్తారని ఆశిస్తున్నాను.

అందరము మానవ వనరుల అభివృద్ధి కృషిలో భాగస్వాములవుదాం. దేశ పురోభివృద్ధికి తోడ్పడదాం.

# మద్రాసులో జరిగిన అఖిల భారత ఉపాధ్యాయుల సమావేశం

అఖిల భారతస్థాయిలో సమస్యలు పరిష్కరించే సరైన వేదిక లేదు. మనం ఒక సంఘంలో వున్నా అది ఆ పని చేయుటలేదు. అందుచేత సమన్వయ సంఘాన్ని ఒకదాన్ని ఏర్పాటు చేసుకోవాలనుకున్నాము.

1997 మార్చి 15,17 తేదీలలో చెన్నైలో అఖిల భారతస్థాయిలో 14 సంఘాలతో ఒక సమావేశం జరిగింది. ఈ సంఘాలు 7,00,000 మంది ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

అవి 1. ఆల్ బెంగాల్ టీచర్స్ అసోసియేషన్, (2) ఆల్ బెంగాలు ప్రైమరి టీచర్స్ అసోసియేషన్, (3) త్రిపుర గవర్నమెంటు టీచర్స్ అసోసియేషన్, (4) త్రిపుర ప్రయివేటు టీచర్స్ అసోసియేషన్, (5) పంజాబ్ గవర్నమెంటు టీచర్స్ యూనియన్, (6) కేరళ స్కూలు టీచర్స్ అసోసియేషన్, (7) ముంబాయి సెకండరీ స్కూలు టీచర్స్ అసోసియేషన్, (8) హర్యానా రాజకీయ అధ్యాపక సంఘ్, (9) రాజస్థాన్ శిక్షక్ సంఘ్, (10) ఎ.పి.యునైటెడ్ టీచర్స్ ఫెడరేషన్, (11) తమిళనాడు పోస్టుగ్రాడ్యుయేట్ టీచర్స్ అసోసియేషన్, (12) తమిళనాడు ఇరైనిలాయ్ ఆశిరియద్ సంఘ్, (13) తమిళనాడు ప్రైమరి స్కూలు టీచర్స్ ఫెడరేషన్, (14) బీహార్ స్కూలు టీచర్స్ అసోసియేషన్.

## సమావేశ వివరాలు

"ఫ్రంట్ లైన్" సంపాదకులు శ్రీ యన్. రామ్ స్వాగతోపన్యాసం ఇస్తూ భారతదేశంలోని ప్రాథమిక స్థాయిలోని పిల్లలు తప్పులు వ్రాస్తున్నారని, గణితంలో చిన్న చిన్న సంకలనం, వ్యవకలనం తదితర అంశాలు ప్రాథమిక స్థాయి గడిచినా తప్పులు లేకుండా చేయి లేకపోతున్నారని అసలు తల్లిదండ్రులు విద్యపై శ్రద్ధ చూపడం లేదని అన్నారు.

స్త్రీ విద్యను చూస్తే భారత దేశంలో బాధాకరమైన విషయం కనబడుతున్నది. కేరళలో 86% యువతులకు విద్య వచ్చు అదే చైనాలో 67% మహిళలే అక్షరాస్యులు. ఈ విధంగా కేరళ ముందంజలో వుంది. కాని ఇతర రాష్ట్రాలలో చాలా వెనుకబడి వున్నది.

స్త్రీ, పురుష అక్షరాస్యతా విషయంలో పెద్ద వ్యత్యాసం కలదు. దీనిని రూపు మాపాలి.

గ్రామీణ ప్రాంతంలోని వ్యవసాయ కార్మికులు తమ సంతానానికి విద్యనందించుటకు ముందుకు వస్తున్నారు.

కావున ఈ సదస్సు పై సమస్యల పరిష్కారానికి మార్గాలు చూపిస్తూ సామాజిక లక్ష్యాలు సాధిస్తుందని "అకాంక్షించారు"

పార్లమెంటు శ్రీ అశోక్ మిత్ర పారంభోపన్యాసం ఇస్తూ "మన దేశంలో మతోన్మాద పెచ్చురిల్లి పోతున్నదని, ఆర్థిక స్వావలంబన సాధించే మార్గం కాకుండా నయా వలస వాదం వైపుకి వెళ్తున్నదని" అన్నారు.

భారత దేశ జనాభా 93 కోట్లలో 5 కోట్ల మంది ధనికులు వున్నరన్నారు. చోళుల కాలం నుండి బ్రిటీషు కాలం వరకు మరియు స్వాతంత్రం వచ్చి 50 సం॥లు గడిచినా పేదల పరిస్థితి మారలేదని, క్షీణించిందని అన్నారు.

విదేశీ పెట్టుబడిదారివర్గం అన్ని వేళల ఈ దేశంలోని ధనికులతో సంబంధం కలిగి వుందని కావున వారికి అనుకూల విధానాలనే మన ప్రభుత్వం అనుసరిస్తుంది. విదేశీ పెట్టుబడిని గురించి వార్తా పత్రికలు, రేడియోలు, కేరింతలు కొడుతూ ప్రచారం చేస్తున్నాయి. కాని వాటి వలన ఫలితం పొందే వారి సంఖ్య 20 మిలియన్లు మాత్రమే.

ప్రభుత్వం నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాల ద్వారా ఇచ్చిన రాయితీలు విదేశీయులకు, దేశంలోని ధనికులకు మాత్రం ప్రయోజనం. ప్రజలు నిరక్షరాస్యులు కావున వారికి ఈ విషయాలు తెలిపి మేల్కొల్పాలి, పోరాట మార్గాన్ని చూపాలి.

కేరళ రాష్ట్రం వ్యవసాయకంగా, పారిశ్రామికంగా వెనుకబడిన ప్రదేశం. అయినా అక్షరాస్యతా శాతం మెరుగుగా వున్నది, కారణం అక్కడ ప్రజలు చైతన్యవంతులు.

రాజ్యాంగం చెప్పిన ప్రకారం పాఠశాల విద్య ప్రభుత్వమే. చేపట్టాలి కాని ఆ పని నుండి తప్పుకోవాలనుకుంటుంది. లేదా ఈనాటి వరకు దాని లక్ష్యాలు సాధనలో చిత్తశుద్ధిని చూపలేక పోయింది. చైనాలో ప్రతి మారుమూల ప్రాంతంలో నివసిస్తున్న యువతీ యువకులు అక్షరాస్యులు. ఆదేశం కొద్ది కాలంలోనే పూర్తి అక్షరాస్యత సాధించింది. ప్రతి పిల్ల వాడ్ని పాఠశాలలో చేర్చుకొంటున్నది.

1980 సం॥లో నికరాగువా బాగా వెనుకబడిన దేశం శాండినిస్టులు పరిపాలన చేపట్టాక కొద్ది కాలంలోనే 88% అక్షరాస్యత సాధించింది.

నాణ్యత. అనేది విద్యారంగంలో కొరవడనున్నది. అది పెంచుకోవలసిన అవసరం ఎంతైనా వున్నది. వైద్యం, పౌష్టికాహారం కల్పించడం జరిగితే దేశం ఆర్థికాభివృద్ధి సాధించవచ్చును.

దేశ బడ్జెటులో 10 లక్షల కోట్లకి 64,000 కోట్ల రక్షణకు ఖర్చు చేస్తూ విద్యకి 20,000 కోట్లు ఖర్చు చేయడం బాధాకరం. స్వాతంత్ర్యం వచ్చాక మొదటి బడ్జెటులో 10% తక్కువ విద్యకు కేటాయించినందున ఆనాటి విద్య శాఖ మంత్రి రాజీనామా చేసే పరిస్థితి కలిగింది. ఈనాడు 3%లోపు కేటాయింపులు జరుగుతున్నా ఎవరూ పట్టించుకోవడం లేదు. కావున ఈ పరిస్థితి అధిగమించటానికి మీరు నడం కట్టాలి. ఈ రంగానికి 60,000 కోట్లు కేటాయిస్తే, పాఠశాల భవనాలు నిర్మించవచ్చు. ఉపాధ్యాయుల సంఖ్య పెంచుకోవచ్చును.

ప్రజానాయకులు ఈ రంగంలో పని చేసేలా చూడాలి. గ్రామీణ స్థాయిలో కమీటీలలో ఆ విధంగా ప్రజల మద్దతు పొందవచ్చును.

ఈనాడు అభివృద్ధి చెందుతున సైన్సు, టెక్నాలజీ ప్రజా అవసరాలకు ఉపయోగపడేలా చూడాలి'అనికో కోరారు.

ప్రొఫెసర్ కె.కె. తేకేడత్ మాట్లాడుతూ మంచి సమయంలో ఈ సదస్సు ఏర్పాటు చేయనైనది. 5వ వేతన సంఘం ఇచ్చిన రిపోర్టు మన ముందువున్నది. అది రాబోయే కాలంలో రాష్టాలు వేసే వేతన కమిటీలకు మార్గదర్శిగా వుండే అవకాశం వున్నది.

ఆర్టిల్స్ 45, 39 ఈనాడు సంక్షోబంలోవున్నాయి. కారణం ఉచిత నిర్బంధిత విద్య మరియు ఆరోగ్యం, శక్తి, భారత బాలబాలికలు పొందటానికి. ఎలాంటి ఆటంకం వుండరాదు అని రాజ్యాంగంలో ఉన్నది. కాని ఈ నాటికి ఆ పరిస్థితిలేదు.

80% 1వ తరగతిలో నమోదులు జరుగుతూ 5వతరగతినుండి 25% మంది మాత్రమే సెకండరీ విద్యకి వెళ్తున్నారు.

29 లక్షలమంది ఉపాధ్యాయులు 1990 సం॥లో ప్రైమరీస్థాయిలో పనిచేస్తున్నారు. కాని ఈనాడు 44లక్షల మంది అవసరం వుంది. కాని రిక్రూటుమెంట్లు జరగడంలేదు. 60 లక్షల మంది చదువుకున్న నిరుద్యోగులు ఒక ప్రక్కన వున్నారు. వారికి చక్కటి అవకాశం విద్యారంగం. కాని ఆపని జరగడం లేదు. అక్ష్యరాస్యులకు కూడా ఉద్యోగం లభించడంలేదనే అపవాదు కొనసాగుతున్నది.

1930లో బొగ్గునిల్వలు ఎక్కువై బొగ్గు ఉత్పత్తి ఆగిపోయిన కారణాలు, కొరత ఏర్పడిన పరిస్థితి,ఒక బాలిక చలితో భాదపడి తల్లినిఅడిగిన పరిస్థితి-ఉద్యోగం పోయి కొనుగోలుశక్తి లేకపోవడం గురించి ఆలోచించాలి.

గుడ్డలు కంపెనీలలో నిల్వలు వుంటాయి. 100 కి.మీ దూరంలో ఆదివాసీలు కట్టుకోవడానికిగుడ్డ వుండదు. కారణం- కొనుగోలు శక్తి లేకపోవడం. దీనికి కారణం గ్రామీణ ప్రాతంలో పేదలు ఎక్కువగా వున్నా, భూమిపై హక్కులేక పోవడం, 4 నెలలు పనిలేకపోవడం చూస్తున్నాం. కావున భూపంపకం జరగాలి. డిగ్రీలు కూడా అవసరానికి మించి ఉత్పత్తి అవుతూ ఉద్యోగం లభించడంలేదు.

కొఠారి కమీషన్ చెప్పినట్లు ఉన్నత విద్య వృత్తివిద్యగా కొనసాగాలి. ఇటీవల ఐ.టి.ఐ., పాలిటెక్నిక్‌లలో చేరుటకు తల్లిదండ్రులు,విద్యార్థు ఉత్సుకత చూపుతూపోటీ పరీక్షలలో పాల్గొంటున్నారు. కాని పాఠశాల స్థాయిలో ఏర్పాటు చేసేవృత్తివిద్యాపై శ్రద్ధచూపక పోవడం, మార్కెటులో ఆకర్షణీయంగా వుండకపోవడం, నిర్వీర్యపోతుంది. ద్రవ్యోల్బణం అనేది సామాన్యమైపోతే కార్మికులపై దీనికి ప్రభావం చూపుతుంది. కాలేజీ విద్యార్థినులు ఫ్యాషన్ షోలవైపు మొగ్గుచూపుతుండటం మన సంస్కృతికే పెద్దదెబ్బ తగులుతున్నది.

ప్రభుత్వం ప్రజావైద్యం, ప్రజాపంపిణీవిధానం, ప్రజారవాణాసౌకర్యం, ప్రజావిద్య అనే అంశాలపై శ్రద్ధచూపడం లేదు.

వేర్పాటు ఉద్యమాలు ఆయాప్రాంతాల అభివృద్ధికి దోహద బడతాయని ప్రచారం వుంది. కాని సోషలిష్టు దేశంగా కొనసాగిన యుగోస్లోవియా, సెర్బియా విడి పోయాక ఒకటి అభివృద్ధి చెందుతున్నది. రెండవది పేదదేశంగా కొనసాగుతున్నది. ఈవాదాలు ఆంధ్ర, ప.బెంగాల్, బీహార్, యు.పి.,మహారాష్ట్రలో కొనసాగుతున్నాయి. ఇది దేశ సమైఖ్యత - సమగ్రతకేముప్పు

ఉపాధ్యాయులు, కార్మికులు (పరిశ్రమలు, వ్యవసాయం) కలిసి స్వాతంత్ర్యం, సార్వభౌమత్వం కాపాడుటకు మరియు ప్రజా విధానాల కొరకు భవిష్యత్తులో పోరాడాలి.

1947సం॥ చారిత్రాత్మక సంఘటనగా మనం దేశ స్వాతంత్ర్యాన్ని సాధించటాన్ని చెప్పుకోవచ్చు, కాని 50సం॥ తర్వాత మనం 1997లో అయోమయంలో వున్నాం. కావున విద్యా, ఆహారం, సమగ్రత కొరకు పోరాడాలి." అని ఉద్బోదించాడు.

అఖిల భారత రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ సుకుమల్ సేన్ మాట్లాడుతూ ఈనాడు విద్య,వైద్యం, పబ్లిక్ సెక్టర్‌పై ఖర్చు తగ్గించి వేయబడుతున్నది.

నిర్బంధోచిత ప్రాథమిక విద్య, ఆర్థికాభివృద్ధి అనే రెండు అంశాలు ఒకదానితో ఒకటి ముడిపడి వున్నాయి.

గ్రామాల్లో మూడాచారాలు, మూఢానమ్మకాలు ఈనాటికి కొనసాగడం సోచనీయం. కారణం శాస్త్రీయ విద్య అందించక పోవడమే.

శ్రీ రాంచంద్రన్ ట్రేడ్ యూనియన్ నాయకుడు మాట్లాడుతూ 6-7లక్షల మందికి ఉపాధ్యాయులకు సంబందించిన సంఘాల నాయకులు, కార్యకర్తలు కలసి ఈ సదస్సు ఏర్పాటు చేయడం చిన్న విషయం కాదు. పాఠశాలుపాధ్యాయులకు 30 లక్షలమందిలో 6లక్షల సంఖ్య చిన్నదేమీకాదు.

శక్తివంతమైన ఉపాధ్యాయు ఉద్యమం అవసరం ఈనాటి సదస్సులో ఒరిస్సా, బీహార్, యు.పి., యం.పి కర్నాటక నుండి ప్రతినిధులులేరు. వారిని కూడాకలుపుకొని రావాలి.

కేంద్రం/రాష్ట్ర స్థాయిలలో ఐక్యఉద్యమాలు కొనసాగాలి విద్యను వ్యాపారం చేయడం సహించరాదు, దీనికి వ్యతిరేకంగా పోరాడాలి. మంచి జీతబత్యాలు కొరకు పోరాడాలి. విద్యలో నాణ్యత సాధించుటకు, పనిభారంపై దృష్టి సాధించాలి. నిర్బంధోచిత ప్రాథమిక విద్యకై పోరాడాలి.

కొన్ని ఉపాధ్యాయ సంఘాలు కాగితాలకే పరిమితమయినాయి, వ్యాపారం చేస్తున్నాయి. కొన్ని సదస్సులు నిర్వహణకే పరిమితం అయివున్నాయి. దీనిని అధిగమించాలి. ఈ సంస్థ విశాలమైన, సామాజిక,ఆర్థిక అంశాలపై దృష్టి వుంచాలి.

మతోన్మాదం వెర్రితలలు వేస్తున్నది. హిందూ, ముస్లిం మతోన్మాదుల ఆటలు సాగనివ్వరాదు. దీనికై మతసామస్యం-సామాజిక న్యాయం కొరకు మనం కృషి చేయాలి.

దేశంలో వెనుక బడిన తరగతులకు రిజర్వేషన్ సౌకర్యం కల్పిస్తూ మండల కమిటీ రిపోర్టుపై అందోళనలు జరుగుతున్నాయి. కుల ప్రాతిపాదికపై ఐక్యతను దెబ్బతీస్తున్నది.

సేవాభావంగా ప్రారంభం అయిన మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలలు, డిగ్రీకాలేజీలు, ఇంటర్‌మీడియట్ కాలేజీలు పాఠశాలలు ప్రైవేటు రంగంలో వ్యాపార ధోరణిలో ముందుకు వస్తున్నాయి.

ప్రభుత్వం తనభాద్యతగా విద్య,వైద్యం మరియు సామాజిక రక్షణ తీసుకుపోవాలి. కాని దీనికి దూరంగా జరుగుతున్నది. మనం ఆపాలి.

కన్వెన్షన్‌కు మొత్తం 300 మంది ప్రతినిధులు హాజరయిరి. కన్వెన్షన్‌లో ప్రధానంగా విద్యా విధానం గురించి, కో ఆర్డినేషన్ కమిటీ ఆవశ్యకత గురించి, ఉపాధ్యాయుల విలువల గురించి, టీచర్స్ సమస్యలు - ఏక్షన్ ప్రోగ్రాం గురించి నివేదికలు ప్రవేశపెట్టబడి చర్చించబడ్డాయి. అవన్నీ ఏకగ్రీవంగా ఆమోదం పొందాయి. ఈ కో ఆర్డినేషన్ కమిటీ (CCSTO)కి చైర్మన్‌గా అజితబాగ్, కన్వీనరుగా బాలకృష్ణ నంబియార్, జాయింట్ కన్వీనర్సుగా డి.రామిరెడ్డి, చంద్రన్, ట్రెజరరుగా దేవరాజ్ ఎన్నికయిరి. కార్యవర్గంలోనికి ఆంధ్రప్రదేశ్ నుండి శ్రీ ఎ. వెంకటస్వామి, శ్రీ కె.కేశవరెడ్డి గార్లు ఎన్నికయిరి.

1997 జులై 16న ఉపాధ్యాయుల సమస్యలపై "ఆలిండియా స్కూలు టీచర్స్ డిమాండ్స్ డే" పేరుతో బేడ్జీలు ధరించి ప్రదర్శనలు, డిమాన్‌స్ట్రేషన్స్ జరుపాలని నిర్ణయించబడింది.

## పరిష్కరించగోరే సమస్యలు

1. నూతన విద్యావిధానాన్ని రద్దుపరచి, అందరికి విద్య పొందే హక్కును కల్పించాలి.
2. విద్యను ఉమ్మడి జాబితా నుండి తొలగించాలి.
3. కేంద్రబడ్జెట్‌లో విద్యకు 10 శాతం కేటాయించాలి.
4. అన్ని రాష్ట్రాలలోను ప్రాథమిక పాఠశాలలో మధ్యాహ్న భోజన పథకం అమలు జరుపాలి.
5. మాతృభాష ద్వారానే విద్యాబోధన జరుపాలి.
6. కేంద్ర 5వ పే కమిటీ ఆధారంగా ఉపాధ్యాయులకు వేతనాలు యివ్వాలి.
7. అన్ని యాజమాన్యాలలోని ఉపాధ్యాయులకు వృత్తి భద్రత కల్పించాలి.
8. రికగ్నిషన్‌లేని పాఠశాలలను రద్దు చేయాలి.



మద్రాసు సభలో పాల్గొన్న యు.టి.యఫ్. ప్రతినిధులు




# విద్యా విషయక సదస్సు చర్చాపత్రం

ప్రవేశపెట్టినవారు : **శ్రీ టి.జి. సంజీవరావు**
డైరెక్టర్, యు.టి.యఫ్. అకడమిక్ సెల్

సామాజిక పురోగమనానికి విద్య కీలకమైనది. "భారత దేశ భవిష్యత్తు తరగతి గదులలో రూపుదిద్దుకుంటుంది" అని కొఠారి కమీషన్ రిపోర్టులో పేర్కొనబడింది. అన్ని రంగాల అభివృద్ధి విద్యారంగంపై ఆధారపడి వుంది. దీనిని గుర్తించే కేంద్ర ప్రభుత్వం విద్యా శాఖ పేరును మానవ వనరుల అభివృద్ధి శాఖగా మార్చింది. గమ్యం వైపు నడవడానికి అనుగుణమైన విజ్ఞానాన్ని ప్రజానీకానికి అందించడం విద్య ద్వారానే సాధ్యపడుతుంది.

కాలగమనంలో ఏ దశలోనైనా పాలకవర్గాలు తమ ప్రయోజనాలను పరిరక్షించే విద్యావిధానాలనే అమలు జరిపాయి. మన రాజ్యాంగ నిర్మాతలు నిర్బంధ ప్రాథమిక విద్య అమలు జరపాలనీ, 1960 సంవత్సరము నాటికి 6-14 వయో పరిమితిలోని బాలబాలికలందరికి విద్య అందించాలనీ, అన్ని వర్గాల ప్రజలకు సమానావకాశాలు కల్పించాలని స్పష్టంగా పేర్కొన్నారు. కాని గత 50 సంవత్సరముల అనుభవం దీనికి పూర్తిగా విరుద్ధంగా వున్నది. ఆశయాలకు, ఆచరణకు పొంతన లేదు. అందువలననే ఈ నాటికి అక్షరాస్యతా శాతం 52.21గా మాత్రమే వుంది. జనాభాలో సగభాగంగా వున్న స్త్రీలలో అక్షరాస్యతా శాతం 39.29 (ఆం.ప్ర) మాత్రమే. తరతరాలుగా విద్యకు నోచుకోని దళితులలో 31.59, గిరిజనులలో 17.16 శాతం మాత్రమే అక్షరాస్యత సాధించబడింది. దీనికి కారణమేమిటి ? విద్యారంగంలో ప్రభుత్వ బాధ్యత ఎంత ? ప్రైవేటు రంగ పాత్ర ఏమిటి ? నేటి విద్యారంగం ఎటు పయనిస్తుంది ? సరియైన మార్గమేది ? అన్నది నేటి చర్చనీయాంశం.

## ప్రణాళికా కేటాయింపులు :

పాలకులు తాము నిర్దేశించుకొన్న లక్ష్యాల కనుగుణంగానే విద్యావిధానం రూపొందించుకొంటారని ముందే చెప్పాం. బ్రిటీషు వారు తమ యెడల వినయ విధేయతలు కలిగి "భారతీయ రక్తంతో బ్రిటిషు భావాలతో" వుండే ఉద్యోగులను తయారు చేసుకొనేందుకు వీలుగా ఈ విద్యా విధానం రూపొందించారు. దానికవసరమైన నిధులు కేటాయించారు.

స్వతంత్ర భారత దేశంలో విద్యారంగలక్ష్యాలు ఉదాత్తంగా రూపొందించబడ్డాయి, కాని ఆచరణలో నీరుగార్చబడ్డాయి. ప్రణాళికా కేటాయింపులు దీనికి నిదర్శనాలు. మొదటి ప్రణాళికలో 7.86 శాతం కేటాయించిన కేంద్ర ప్రభుత్వం 2, 3 ప్రణాళికలలో వరుసగా 5.83 శాతం, 6.87 శాతం, ఆ తరువాత క్రమంగా తగ్గిస్తూ 8వ ప్రణాళికలో 2.40 శాతం మాత్రమే కేటాయించింది.

ఈ కేటాయింపులో కూడా ఉన్నత విద్య, విశ్వ విద్యాలయాల విద్యకే ఎక్కువ మొత్తాలు ఖర్చు చేసి ప్రాథమిక విద్యను నిర్లక్ష్యం చేసింది. అదుచేతనే పునాది లేని విద్యా భవనం నిర్మించబడింది. విద్యారంగంపై పలు కమీషన్లు నిరమించబడ్డాయి. కమీషన్లు చేసిన అభివృద్ధికరమైన సిఫార్సులు విస్మరించబడ్డాయి. 40 సంవత్సరముల తరువాత అంటే 1986లో మొత్తం పరిస్థితిని విశ్లేషించి, తప్పులన్నింటిని అంగీకరిస్తూ 2000 సంవత్సరము నాటికి చేరవలసిన గమ్యాన్ని నిర్దేశిస్తూ నూతన విద్యా విధానం ప్రకటించబడింది. తప్పులంగీకరించినప్పటికి నిధుల కేటాయింపులో మార్పు లేదు.

## 1986 నూతన విద్యా విధానం

### నూతన విద్యా విధానం ప్రవేశపెట్టిన ప్రభుత్వం

1. అందరికి సమాన విద్యకు బదులు కొద్దిమంది మేధావులను తయారుచేసే నవోదయం పాఠశాలలకు పెద్ద మొత్తంలో నిధులు కేటాయించడం.
2. ఉన్నత విద్యా బాధ్యతల నుండి ప్రభుత్వం తప్పుకొని ప్రైవేటు రంగానికి ద్వారాలు తెరవడం.
3. డిగ్రీలకు ఉద్యోగాలకు గల సంబంధాన్ని తెగగొట్టడం లాంటి చర్యలు చేపట్టింది.

విద్యావకాశాలు అన్ని వర్గాల ప్రజలకు ఒకే విధంగా వుండాలన్న రాజ్యాంగ లక్ష్యానికి పూర్తిగా విరుద్ధమైనది. ఈ విధానం కలవారి కొక చదువు, లేనివారికొక చదువు అనే విధానమే యిది. ఈ విధానమే గత 10 సంవత్సరముల నుండి అమలు జరుపబడుతున్నది. ప్రభుత్వాలు మారినా విధానాలు మారడం లేదు. ఈ కారణంతోనే విద్యావ్యవస్థలో ప్రైవేటు రంగం పెద్ద ఎత్తున ప్రవేశించింది. విద్యని వ్యాపారంగా మార్చింది. ఈ మార్పును కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాలు ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రోత్సహిస్తున్నాయి.

1. అటానమస్ కాలేజీలను, సెల్ఫ్ ఫైనాన్సింగ్ కోర్సులను అనుమతించడం
2. కొత్తగా ప్రభుత్వ కళాశాలలను ప్రారంభించకపోవడం.
3. ప్రభుత్వ కళాశాలల అభివృద్ధిని నిర్లక్ష్యం చేయడం.
4. ఇంగ్లీషు మోజును పెంచడం.
5. ప్రైవేటు విద్యారంగాన్ని నియంత్రించే విధానం లేకపోవడం ఇందుకు స్పష్టమైన ఉదాహరణలు.

రాజ్యాంగ నిబంధనలు ప్రకారం ప్రాథమిక, మాధ్యమిక విద్యా బాధ్యతల నుండి ప్రభుత్వాలు నేరుగా వైదొలగడానికి వీలు లేదు. కాబట్టి తమ చర్యల ద్వారా ప్రభుత్వ విద్యా వ్యవస్థ పతనమయ్యేందుకు శ్రద్ధగా కృషిచేస్తున్నాయి.

## ఆర్థిక విధానం - విద్యా విధానం :

ఆర్థిక విధానాల ప్రతిబింబం విద్యారంగంలో ప్రతిఫలిస్తుంది. నూతన ఆర్థిక విధానంలోని అంశాలైన

1. గ్లోబలైజేషన్, 2. లిబరలైజేషన్, 3. ప్రైవేటైజేషన్‌ల ఫలితంగా ప్రభుత్వ రంగం పనికి మాలినదిగా, అనవసర భారంగా భావించబడుతున్నది. సాంఘిక సంక్షేమం, సామాజిక భద్రత ప్రభుత్వ పరిధిలో లేనివిగా ప్రచారం జరుగుతున్నది. విదేశీ అప్పుల మీద, పెట్టుబడుల మీద అధారపడి అన్ని రంగాలలో అభివృద్ధి సాధించాలని ప్రయత్నాలు సాగుతున్నాయి. ప్రాథమిక విద్యారంగంలో కూడా విదేశీ సంస్థలిచ్చే అప్పుల గ్రాంట్లతోనే 'అపెప్', 'డిపెప్' స్కీములు అమలు జరుగుతున్నాయి. ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా ఏ విదేశీ సంస్థయైనా ఉదారంగా నిధులు దానం చేయదు. ఈ దేశంలో అమెరికా, బ్రిటిష్ దోపిడీ విధానాలకు అవసరమైన విద్యా విధానాన్ని అమలు జరుపడమే విదేశీ సంస్థల లక్ష్యం. ఈ విధానమే కొనసాగితే విద్యారంగానికి సంబంధించిన బాధ్యతల నుండి ప్రభుత్వం క్రమంగా వైదొలగుతుంది. ప్రజల భాగస్వామ్యం అనే పేరుతో ప్రైవేటు రంగానికి విద్య అప్పగించబడుతుంది.

## ప్రభుత్వ రంగ ప్రభావం :

మన దేశంలో గత 50 సంవత్సరాలలో అమలు జరిపిన విధానాలలో ప్రభుత్వ రంగం నిర్వహించిన పాత్ర గణనీయమైనది. అన్ని రంగాలలో అభివృద్ధి ప్రభుత్వ రంగం ద్వారానే జరిగింది. కాని ఆ రంగంలో కాలానుగుణమైన సంస్థాగత మార్పులు లేనందున కొంత అలసత్వం ఏర్పడింది. దానిని సరి చేయడానికి బదులు ధ్వంసం చేస్తే పేద ప్రజానీకం భవిష్యత్తు చీకటి మయమవుతుంది. వెనుకబడిన వర్గాలకు చదువు అందని మావిపండవుతుంది; కలవారికే విద్య లభిస్తుంది. దానితోపాటు దేశ అవసరాలకు అవసరమైన రీతిలో శాస్త్రజ్ఞులు మేధావులు తయారు కారు. శాస్త్ర సాంకేతిక రంగాలలో పరిశోధన కేవలం వ్యాపారా వర్గాల గుత్త సొత్తవుతుంది. దేశం మేధా సంపత్తి కోసం విదేశీయులపై ఆధారపడే దుస్థితి దాపురిస్తుంది.

## నిర్వీర్యం చేయబడుతున్న ప్రభుత్వ రంగం :

ప్రాథమిక స్థాయి నుండి ఉన్నత విద్య వరకు మాతృభాషలో విద్యను బోధించాలని నిర్ణయించబడింది. కాని మాతృ భాషలో ఉన్నత విద్య గరిపేందుకు కావలసిన పాఠ్యగ్రంధాలు తయారు చేయడానికి ప్రభుత్వం పూనుకోవడం లేదు. అదనపు సమాచారాన్ని అందించే పుస్తకాలు వెలువడడం లేదు. ఉన్న కొద్దిపాటి పుస్తకాలలో, శాస్త్ర సాంకేతిక పదాల నిర్మాణంలో సంస్కృత భాషా ఛాందసత్వం ప్రదర్శింపబడుతున్నది.

ప్రభుత్వ విద్యా సంస్థలలో మాతృ భాషా మాద్యమం వుంది. ప్రైవేటు రంగంలో ఆంగ్ల మాద్యమం వుంది. ప్రభుత్వం మాతృభాషా మాద్యంమలో చదువుకోడానికి తగిన ప్రోత్సాహం యివ్వకపోవడం తోను, ఆంగ్లంపై మోజుతోను, ప్రైవేటు పాఠశాలల సంఖ్య క్రమేపి పెరుగుతున్నది. దీనిని అరికట్టకపోవడమే గాక ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది.

ఉపాధ్యాయులకు బోధనేతర పనులు అప్పగించడం వల్ల ప్రభుత్వ పాఠశాలల్లో పని దినాలు తగ్గిపోతున్నాయి. ఉపాధ్యాయులలో ఆత్మ విశ్వాసం, వృత్తియెడల అంకితభావం పెంచవలసిన పాలక వర్గాలు నియామకాల దగ్గర నుండి బదిలీలు, ప్రమోషన్లు, రోజు వారీ సమస్యలతో ఉపాధ్యాయులను నిర్వీర్యం గావించి మొత్తం విద్యా వ్యవస్థకు నష్టం కలిగిస్తున్నాయి.

ఉపాధ్యాయుడు తనది భావి భారతపౌరులను తయారు చేస్తున్న వృత్తియని భావించకుండా, జీతం కొరకు పనిచేసే ఉద్యోగినని భావించే స్థితికి నెట్టబడినాడు. ఫలితంగా నాణ్యమైన చదువును అందించలేక పోతున్నాయనే నిందకు ప్రభుత్వ పాఠశాలలు గురయినాయి.

ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయుల నియామకాలపై తగినంత శ్రద్ధ చూపడం లేదు. 1986 తరువాత ప్రారంభింపబడిన దాదాపు అన్ని ప్రాథమిక పాఠశాలలు ఒకరిద్దరు టీచర్లతోనే నడుస్తున్నాయి. ఆపరేషన్ బ్లాకు బోర్డు స్కీము అమలయిన తరువాత కూడా సింగిల్ టీచర్ స్కూళ్ళు, అసలు టీచర్లు లేని స్కూళ్ళు యిప్పటికీ వేలాదిగా వున్నాయి

పర్యవేక్షణ నామ మాత్రంగా మిగిలింది. పర్యవేక్షణ నియామకాలు జరగడం లేదు. ఉపాధ్యాయులను ప్రోత్సహించే పర్యవేక్షణ పద్ధతిని పాటించడానికి తగిన శిక్షణ పర్యవేక్షకులకు యివ్వడం లేదు.

బడ్జెటులో విద్యకు కేటాయింపులు తగ్గిపోతున్నాయి. రాష్ట్ర నిధుల నుండి పాఠశాలల అభివృద్ధికి గాని, అదనపు పోస్టుల మంజూరుకు గాని కేటాయింపులు లేవు. కంటిన్జెన్సీలు కూడా మంజూరు చేయకుండ నిలిపివేయడం చూస్తే ప్రభుత్వానికి ప్రభుత్వ పాఠశాలలపై ఉన్న చిన్న చూపు స్పష్టమవుతున్నది.

వీటన్నిటీ ఫలితంగా ప్రైవేటు రంగం శరవేగంతో ముందుకు పోతున్నది. ప్రైవేటు రంగంలో విద్య సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండదనేది వాస్తవం.

## ప్రత్యామ్నాయ విధానం అవసరం :

ప్రభుత్వం స్వేచ్ఛా మార్కెట్‌కు అనుగుణమైన విద్యా విధానాన్ని తేవడానికి ప్రయత్నిస్తున్నది. అందుకనుకూలమైన విధానాలు అవలంబిస్తున్నది. ఇక విద్య ఉన్నత, మధ్య తరగతి ప్రజలకు, ఉద్యోగులకు మాత్రమే పరిమితమవుతుంది. సాధారణ ప్రజానీకానికి అందుబాటులో ఉండదు.

రాజ్యాంగ నిర్దేశిత లక్ష్యాలకు అనుగుణమైన విధానాలు, కార్యాచరణ అవసరం. అందరికీ చదువు ఆచరణలోకి రావాలి. అది వట్టి నినాదం కారాదు. 'సమాజ పురోగతి' కి 'అందరికీ విద్య' కు మధ్య గల సంబంధాన్ని పాలకులు గుర్తించడం లేదు. గుర్తించినా స్వప్రయోజనాల కోసం దాటవేస్తూనే ఉన్నారు. పాలకుల ఈ స్వభావాన్ని గుర్తించి, అర్థం చేసుకొని "అందరికీ విద్య గరపే పూచీ ప్రభుత్వానిదే' అని ప్రభుత్వాన్ని నిలదీసే ప్రజలు కావాలి. ప్రజల భాగస్వామ్యం లేనిదే ఏదీ జయప్రదం కాదు.

అందుకే సార్వజనీన విద్య కోసం ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయాలి. విద్యారంగంలో ప్రజల భాగస్వామ్యాన్ని పెంచాలి. ప్రజలు భాగస్వాములై జోక్యం చేసుకోవడం, డిమాండు చేసేలా చైతన్యం పెరగడం, ఒత్తిడి చేయడం, ప్రభుత్వ వైఖరిలో మార్పుతేవడం ఈ క్రమంలో కృషి జరగాలి.

అందరికీ విద్యకు ఆటంకాలేమిటో, అవసరాలేమిటో సమాజం ముందు చర్చకు పెట్టాలి. విద్యావ్యవస్థపై శాస్త్రీయంగా వ్యాఖ్యానించి ప్రత్యామ్నాయ ప్రణాళిక చూపించే వైపు కృషి నడపాలి.

ఇందుకోసం ఉపాధ్యాయులు ప్రజల పట్ల, విద్యార్థుల పట్ల ప్రేమ, సానుభూతి కలిగి ఉండాలి. వారి ప్రేమకు, అభిమానానికి పాత్రులు కావాలి. నిత్య విద్యార్థులుగా నిరంతర అధ్యయనంతో విషయ పరిజ్ఞానాన్ని, బోధనా పాటవాన్ని పెంపొందించుకోవాలి. సామాజిక స్పృహ కలిగి ఉండాలి. విద్యార్థుల, తల్లిదండ్రుల ప్రేమాదరాలే ఉపాధ్యాయులకు రక్ష. భావి పౌరులకు, వారి ద్వారా భావిభారత సమాజాన్నే తీర్చిదిద్దే మహత్తర అవకాశం ఉపాధ్యాయులకే ఉన్నది. ఆ కర్తవ్య నిర్వహణకు ఉపాధ్యాయలోకం సన్నద్ధం కావాలి.




# విద్య శాస్త్రీయ దృక్పథాన్ని కలిగించాలి

- డాక్టర్ వై. రాధాకృష్ణమూర్తి
M.P.

సురాజ్య స్వప్నాలు కల్పించిన స్వరాజ్యం వయస్సు 50 సంవత్సరాలు. 14 ఏళ్ళలోపు బాలబాలికలందరికీ పదేళ్లలో నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్య కల్పించాలని ఆదేశించిన రాజ్యాంగం ఆవిష్కరించబడిన తరువాత 47 ఏళ్ళు గడిచి పోయాయి. కాని ఇప్పటికీ విద్యారంగం రాసిలోనూ, వాసిలోనూ, దిశలోనూ పూర్తి అసంతృప్తికరంగానే మిగిలిపోయింది.

విద్య లేనిదే అభివృద్ధి అసాధ్యమని ప్రపంచ వ్యాప్తంగా అందరూ గుర్తిస్తున్నారు. అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ ఫిబ్రవరి 5న రెండవసారి పదవీ స్వీకారం చేస్తూ "స్టేట్ ఆఫ్ ది యూనియన్' ' ప్రసంగంలో విద్యకు అత్యంత ప్రాధాన్యతనిచ్చి 10 అంశాల కార్యక్రమాన్ని ప్రకటించాడు. అతి సంపన్న దేశంగా పరిగణింపబడుతున్న అమెరికాలో 8 సం॥ వయసున్న వారిలో 40 శాతం స్వంతంగా చదవలేరట! అధ్యక్షుడు యువతీ యువకులందరికీ కాలేజీ విద్య కల్పించే లక్ష్యం ప్రకటించాడు. మన కేంద్ర ప్రభుత్వం కనీస ఉమ్మడి కార్యక్రమం అవగాహన మేరకు ఆలస్యంగానైనా విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తించే శాసనం తెస్తానంటున్నది.

మన దేశంలో విద్యారంగం యొక్క దైన్యస్థితిని పరిష్కరించలేనందుకు కలత చెందని ప్రభుత్వం గాని ప్రజానాయకులు గాని ప్రజా ప్రతినిధులు గాని విద్యావేత్తలు గాని లేరని చెప్పవచ్చు. ప్రభుత్వానికి దిక్కుతోచనప్పుడు ఒక కమీషన్ వేసి కాలానికో, కర్మానికి వదలివేయడం కర్మకాండగా జరుగుతుంది. మొదలియార్, రాధాకృష్ణన్, కొఠారి, రామమూర్తి చటోపాధ్యాయ, యశ్పాల్, నిన్న మొన్న కేరళ ప్రభుత్వం నియమించిన అశోక్ మిత్రా కమిటీలు మచ్చుకు కొన్ని మాత్రమే.

ఈ ఉద్దండులందరూ చెప్పక వదిలిందీ లేదు.

మనం చిత్తశుద్ధితో ఆచరించిందీ లేదు.

తామర తంపరగా వేసిన, ప్రకటించిన ప్రణాళికలకూ కొదవలేదు.

జాతీయ విద్యా విధానం 1986 (యన్.ఇ.పి.) దానిని మెరుగుపరచడం (1992), జాతీయ అక్షరాస్యతా కమీషన్ అవతరణ, వయోజన విద్యా పథకం (ఎ.ఇ.పి.) జిల్లా ప్రాథమిక విద్యా పథకం (డిపియిపి) సార్వత్రిక ప్రాథమిక విద్యా పథకం (యు.ఇ.ఇ) ఆపరేషన్ బ్లాక్ బోర్డ్ (ఒ.బి.బి.) మధ్యాహ్న భోజన పథకం, కేంద్రీయ విద్యాలయాలు, నవోదయ విద్యాలయాలు, ఓపెన్ యూనివర్శిటీలు, ప్రైవేటు విద్యా సంస్థలు, మైనారిటీ విద్యా సంస్థలు, సెల్ఫ్ ఫైనాన్సింగ్ కోర్సెస్, అటానమస్ కాలేజీలు, ప్రైవేట్ యూనివర్శిటీలు ప్రకటించిన, ఆచరణలో పెడుతున్న ప్రణాళికలు.

**ఫలితం :**

దేశ జనాభాలో నేటికీ 48 శాతం నిరక్షరాస్యులుగానే మిగిలిపోతున్నారు. బడి ఈడు గల బిడ్డలలో 20 శాతం బడి మొహం చూడడానికి నోచుకోవడం లేదు. చూసినవారు 5వ తరగతికి వచ్చేసరికి 48 శాతం జారిపోతున్నారు. 7వ తరగతికి వచ్చేసరికి 66 శాతం చదువు మానివేస్తున్నారు. ఉన్నత విద్యకు 2 శాతానికి మించి వెళ్ళలేకపోతున్నారు. లక్షలాది బిడ్డలు ప్రమాదకర వృత్తులలో మగ్గుతున్నారు. 10 కోట్ల మంది కట్టుబానిసలుగా బతుకులీడుస్తున్నారు. ఆడ బిడ్డల బతుకులు మరింత అధ్వాన్నంగా వున్నాయి. ఉత్తర ప్రదేశ్, బీహార్, ఆంధ్ర ప్రదేశ్ నిరక్షరాస్యతలో అగ్రస్థానాల్లో వున్నాయి. ఏకోపాధ్యాయ పాఠశాలలు, ఉపాధ్యాయ పోస్టులు ఖాళీలు, ఉపాధ్యాయ నియామకాలలో జరిగే కుంభకోణాలు విద్యా వ్యాప్తిని అడ్డుకొంటున్నాయి.

అప్పిచ్చిన వాడి ఆజ్ఞలతో ఆర్థిక సంస్కరణలు చేపట్టబడుతున్నాయి. ఆర్థిక సంస్కరణల ప్రభావం విద్యారంగంపై ప్రతిఫలిస్తున్నాయి. విద్యకి కేటాయింపు జి.డి.పి.లో 3.5 శాతానికి ఏనాడూ మించలేదు. ఆరు శాతం కేటాయింపు ఆశ పెట్టడంగానే నేటికీ వుంది.

ఇన్ని పరిమితులతో ఈనాడు మనం నేర్పుతున్న విద్యలో వెల శాతం ఎంత? విలువల శాతం ఎంత? - పరిశీలిద్దాం.

## శిశు విద్య (ప్రీ ప్రైమరీ ఎడ్యుకేషన్)

3-6 సం॥ల బిడ్డలకు చెప్పే చదువు శిశు విద్య. ఆ నునులేత మొగ్గలకు ఎంట్రన్స్‌లు చేటనీ పాఠం కన్నా ఆటపాట చాలనీ, స్కూలు బాక్స్ గాడిద బరువుతో వారి చిన్నారి నడుములను వంచవద్దనీ, యూనిఫారం పేరుతో మెడ నుండి పాదాల వరకు కట్టిపడవేయనక్కర లేదనీ, వారి సుకుమారమైన శరీరాలకు మనసులకు అంత కఠినమైన శిక్ష అక్కరలేదనీ యశ్‌పాల్ కమిటీ చెపితే "పబ్లిక్ స్కూళ్ళు" ఉపాధ్యాయులు - తల్లి దండ్రులు - ఎవరు పట్టించుకున్నారు? ఆ శిశుహింస - ఆనందంగా సాగిస్తూనే వున్నాం.

## కార్పొరేట్ స్కూళ్ళు :

ఇటీవలి కాలంలో పంచనక్షత్రాల పాఠశాలలు పుట్టుకొస్తున్నాయి. వెల సంగతి వేల సంగతి వదిలేద్దాం. కాని ఇక్కడ ఒక ప్రత్యేక వర్గానికి చెందిన బిడ్డలు తయారు చేయబడతారు. ఈ తయారీ "నూతన సంస్కరణల" సిద్ధాంతానికి అనుగుణంగానే జరగుతుంది. ఈ నేల మీద నిలవని - సామాన్యుడి ఆలోచన, సంస్కృతి స్థాయికి అందని ఒక ప్రత్యేక ఉన్నత వర్గాన్ని తయారు చేస్తున్నాయి ఈ సంస్థలు. ఇటీవల మార్చి 4న బిల్‌గేట్స్ న్యూఢిల్లీ సందర్శించాడు. అతడు కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ ద్వారా ప్రపంచ ప్రజల దృష్టి నాకర్షించాడు. అతడు రోజుకు 150 కోట్ల రూపాయలు సంపాదిస్తాడు. ప్రపంచ వ్యాప్తంగా 48 దేశాలలో అతడు 20,000 రిపోర్టర్లను నియమించాడు. అతడు రాత్రికి అంటే నిద్రపోయే సమయంలో కూడా 10 మిలియన్ల డాలర్లు సంపాదిస్తాడు. ప్రభుత్వాధినేతలకు పారిశ్రామికవేత్తలకు అతడంటే పెద్ద క్రేజ్. అలాంటి క్రేజ్‌ను పెంచేవి ఈ విద్యా సంస్థలు. అలాగే హర్షద్ మెహతా, సుఖరామ్‌ల లాగా దగ్గర దారులను వెతకాలనే ఆకాంక్షను పెంచేవి ఈ ఐదు నక్షత్రాల విద్యా సంస్థలు.

## రెసిడెన్సియల్ విద్యా సంస్థలు :

వీటిలో విద్య పాలెంత ? వ్యాపారం పాలెంత ? అనే మీ మాంసను వదిలేద్దాం.

గానుగ ఆడించినట్లు విద్యా బోధన జరుగుతుంది. ఆట స్థలం - ఆటలు లేవు. ఎక్స్‌ట్రా కరికులర్, కోకరికులర్ ఎక్టివిటీస్ లేవు. బయట ప్రపంచంతో, సమాజంతో సంబంధం లేదు.

ఇవి అందమైన 'అండమాన్ సెల్యులర్ జైళ్ళు"

"మంచి తిండి" "మంచి చదువు" "మంచి మార్కులు" - అంతకు మించిన "మంచి" లేదు.

ఇవి ఫ్లాస్టికాహారం వేసి, మంచి సైజు గుడ్లు లెక్కపెట్టుకునే పౌల్ట్రీ ఫారమ్స్ అంటే అపహాస్యమూ కాదు - అతిశయోక్తీ కాదు.

ఈ వాతావరణంలో విశాలమైన సామాజిక దృక్పథం బదులు తాను, తనని తప్ప మరెవరినీ చూడలేని సంకుచిత దృక్పథం అలవడుతుంది. ఈ విద్యాసంస్థలు గుండె మార్పిడి చేయగల నిపుణులైన డాక్టర్లనీ, ఆకాశాహర్మ్యాల్ని నిర్మించగల ఇంజనీర్లనీ, జెనిటిక్ ఇంజనీరింగ్‌తో నకిలీ జంతువుల్ని తయారుచేయగల సైంటిస్టులనీ తయారు చేయవచ్చు. కాని మంచి మనసున్న మానవుల్ని మాత్రం తయారు చేయలేవు. ఇవి మనిషిని యంత్రంగా మారుస్తాయి. మానవతను హరిస్తాయి. అంటే స్పందన లేని మర మనుషుల్ని తయారు చేసే కర్మాగారాలు ఈ విద్యా సంస్థలు.

## విద్య శాస్త్రీయ దృక్పథాన్ని కలిగించాలి :

మన రాజ్యాంగంలోని ఆర్టికల్ 51 ఎ (హెచ్) యిలా ఆదేశిస్తుంది. It shall be the duty of every citizen of India to develop the Scientific temper, humanism and the spirit of inquiry and reform"

మన కేంద్ర ఆర్థిక మంత్రి ఫిబ్రవరి 28న బడ్జెట్ ప్రసంగంలోని ఒకటి రెండు వాక్యాలు ప్రస్తావిస్తాను. The interest in learning of Science in Schools and Colleges was diminishing. I hold the view that an M.B.A-even if he is from Harward - is not a patch on scientist".

జాన్ మేజర్ ఇలా అన్నాడు. "The true intellectuals opted for careers in Science, the smart ones went for business and only the average ones has chosen careers in Politics."

ఇక మన చదువులో ఆ "Scientific Temper" ఏ మేరకు వుందో పరిశీలించేందుకు ఒకటి రెండు ఉదాహరణలు:

1995 సెప్టెంబర్ 21న గణేశుని విగ్రహాలు పాలు త్రాగుతున్నాయని పుకారు. మన ఉన్నత విద్యావేత్తలు కూడా పాల బకెట్లు పుచ్చుకొని బజార్న పడలేదా ?

1995 అక్టోబర్ 24న అరుదుగా వచ్చే సంపూర్ణ సూర్యగ్రహణం. మన శాస్త్రవేత్తలు, అధ్యాపకులు, ఉపాధ్యాయులు ఎందరు శివపూజలు చేసి, మైలస్నానాలు చెయ్యలేదు?

1996 అక్టోబరు, నవంబరు నెలలు- రాజపలాయం రామర్‌పిళ్ళె మూలికలతో పెట్రోలు తయారు చేస్తానంటే ఎంతమంది విద్యావంతులు, సైన్సు మాష్టర్లు, పార్లమెంటు సభ్యులు 'అద్భుతం' 'మహాద్భుతం' అని సమర్థించలేదు.

ఈ మహిమల్ని, మౌఢ్యాల్ని ప్రచారం చేయడానికి మన పాత్రికేయులు- పత్రికలు పంచరంగుల చిత్రాలతో పోటీపడ లేదా ? సైన్సు పాఠం కంఠస్థం చేయడానికీ "Scientific Temper, Sprit of Enquiry" అలవర్చుకోవడానికి ఎంత వ్యత్యాసం ? మన విద్యా విధానంలో దీనికిస్తున్న ప్రాముఖ్యమెంత ?

## సంకుచిత భావాలు :

మన రాజ్యాంగం ఉపక్రమణికలోనే మనది సెక్యులర్ రాజ్యమని చెప్పబడింది.

రాజ్యాంగంలోని ఆర్టికల్ 51 ఎ (ఇ) ఆదేశిస్తుంది. "it shall be the duty of every citizen of Inida to promote harmony and the spirit of common brotherhood transcending religious, linquistic and regional or sectional diversities" మనది బహుళ మత, బహుళ భాషా, బహుళ సంస్కృతీ సంపన్నమైన దేశం. భిన్నత్వంలో ఏకత్వం మన ప్రత్యేకత. పరస్పర సహనం, పరస్పర గౌరవం కీలకాంశం. మత ఛాందసానికి దురభిమానానికి ద్వేషానికి దూరంగా వుండడం బిడ్డలకు నేర్పాలి.

గత దశాబ్దపు పరిణామాల్ని నిశితంగా పరిశీలిస్తున్న వారెవరైనా - మనం ఈ విలువల్ని భావి తరాలకు అందిస్తున్నామని గుండె మీద చేయివేసుకుని చెప్పగలరా ?

మన విద్యాలయాలు ముఖ్యంగా విశ్వ విద్యాలయాలు

కుల మత విద్వేషాలకు- కలహాలకు నిలయాలుగా వుంటున్నాయన్న మాట కాదనగలమా?

ఈ అంటువ్యాధి అధ్యాపకుల నుండి క్రిందికి పాకుతున్నట్లు వస్తున్న ఆరోపణలు వాస్తవం కాదా ?

కొన్ని ప్రైవేటు విద్యా సంస్థలు సంకుచిత కుల మత భావాలను ప్రణాళికా బద్ధంగా బోధించుతున్నాయనడం సత్యం కాదా?

## నైతిక సంక్షోభం :

దేశం ఈనాడు ఒక నైతిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. ప్రతి రోజూ ఒక దాన్ని మించిన మరొకటి - కుంభోకోణాలు వెలుగులోకి వస్తున్నాయి. అత్యున్నత స్థానాలు ఆక్రమించిన వారి నుండి క్రింది అంతస్థులో వున్న వారి వరకూ - అందరూ భాగస్వాములే. అవినీతి సర్వాంతర్యామిగా అత్యంత నైపుణ్యమైన కళగా అభివృద్ధి చెందింది. 'ట్రాన్సపరెన్సీ ఇంటర్నేషనల్' అనే సంస్థ చేసిన ప్రత్యేక అధ్యయనంలో (అక్టోబరు 4, 1996) పవిత్ర భారతదేశం - ప్రపంచంలో అతి అవినీతికర దేశాల్లో తొమ్మిదొ స్థానంలో వున్నట్లు ప్రకటించింది. (అమెరికా, జర్మనీ, జపాన్‌లవి వరుసగా మొదటి మూడు స్థానాలు)

దేశం ఈ స్థితికి రావడానికి విద్యారంగం పాత్ర ఎంతో పరిశీలించుకోవాలి. "True education percolates from politician - bureaucrat - financer - nexus down below" "Youth is more impressionable" జాగ్రత్తగా తయారు చేసిన పాఠ్యగ్రంథాలు, అధ్యాపకుల నేర్పరితనం మాత్రమే సరిపోతుందా? ఉన్నత నైతిక స్థాయి కలిగిన భావితరాన్ని తయారు చేయడానికి ఎలాంటి ప్రణాళిక అవసరమో ఇలాంటి సదస్సులు చర్చించాలి.

"There is more of politics in Education
and less of Education in Poltiics"

దేశంలో అందరూ పెద్దలే; అందరూ గౌరనీయులే - కాని అన్ని రంగాలలో అవధులు లేని అవినీతి.

"Hell is empty and all the Devils are here"
— Shakespeare

## సాంస్కృతిక కాలుష్యం :

సాంస్కృతిక కాలుష్యం దేశాన్ని ముంచివేస్తున్నది - రేడియో, టి.వి., సినిమా, టెలికాం,కంప్యూటర్, ప్రింట్ మీడియా - అన్నీ కలిసి సామూహిక సంఘటిత కుట్రపన్నుతున్నట్లు ఆకాశాన్ని కమ్మివేస్తున్నాయి. ఒక పెను తుఫానులా ప్రభంజనంలా మన సంస్కృతిని కూకటి వేళ్ళతో పెరికివేస్తున్నాయి. పెట్టుబడికి కట్టుకథకు పుట్టిన విష పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియాలు కలిసి భ్రష్టు పట్టిన పాశ్చాత్య విష సంస్కృతిని యువతరంపై కారు మేఘాలలా వ్యాపింప వేస్తున్నాయి. మన బిడ్డల్ని ఇడియట్ బాక్స్‌కూ పనికిమాలిన కంప్యూటర్ గేమ్స్‌కూ బానిసల్ని చేస్తున్నాయి. "ఇది వ్యాపారం - వ్యాపార పోటీ - లాభాలకై వేట - మార్గ మేమైనా సరే" ఇదీ ఆధునిక సంస్కరణల వేదాంతం - "In love and war nothing is forbidden" - "ప్రేమ - యుద్ధాలలో ఏదీ నిషిద్ధం కాదు" - పాత సామెత "వ్యాపారం - లాభాలు పొందడంలో ఏదీ అనైతికం కాదు" ఈ నాటి మాట.

యువతరం ఎదుర్కొంటున్న ఈ సవాలుకు విద్యారంగం ఏమి పరిష్కారం ఏమి మార్గం చూపుతుంది? విద్యావేత్త లందరూ సమిష్టిగా సీరియస్‌గా ఆలోచించవలసిన విషయం ఇది.

## క్షీణిస్తున్న పాశ్చాత్య సంస్కృతీ ప్రభావం :

క్షీణిస్తున్న పాశ్చాత్య సంస్కృతి గొప్పదిగా, అనుసరణీయంగా భావింపబడుతున్నది. హెరాయిన్, పెథిడిన్, కొకైన్, కేనబిస్ - లాంటి మాదక పదార్థాలు విద్యా సంస్థలలోకి హాస్టల్స్‌లోకి చొచ్చుకొని వచ్చాయి. పాశ్చాత్య సంస్కృతి ప్రభావంతో పెరుగుతున్న స్వలింగ సంపర్కం కారణంగా మానసిక సమస్యలే గాక హెపాపటిస్ బి, యస్.టి.డి., ఎయిడ్స్‌లాంటి భయంకరమైన వ్యాధులు ప్రబలుతున్నాయి. ఆర్థిక సహాయం, ఎయిడ్స్ వ్యాధి - ఈ రెండు బహుమతులు పశ్చిమ దేశాల పెద్ద మనుషులు (జి-7 దేశాల వారు) మనకు అందజేసిన కానుకలు.

## నిరుద్యోగ భూతం :

విద్యార్థి లోకంలో నిరాశా నిస్పృహలకు అసాధారణ ప్రవర్తనకు హింసా ప్రవృత్తికి, కులం మతం ప్రాంతం పేరుతో ఈర్ష్యా ద్వేషాలకు - మరొక ప్రధాన కారణం చెప్పకోక తప్పదు. అదే వారి ఎదుట కన్పిస్తున్న నిరుద్యోగ భూతం. మన ప్రభుత్వాలు తాము సాధించిన సాధించదలచుకొన్న "ఆర్థిక ప్రగతి"ని వ్యవసాయ రంగంలో పెరుగుదల, పారిశ్రామిక రంగంలో పెరుగుదల, యితర రంగాలలో సాధించిన పెరుగుదలకు సంబంధించిన అంకెలతో వివరించి గందరగోళ పరుస్తుంటాయి. కాని యు.యన్.డి.పి. ప్రకటించిన హ్యూమన్ డెవలప్‌మెంట్ రిపోర్టు 96 - ఈ పెరుగుదలకూ మానవ అభివృద్ధికీ మధ్య గల వ్యత్యాసాన్ని వివరించింది. మనం సాధించామని చెప్పకుంటున్న పెరుగుదలకు నిరుద్యోగ పెరుగుదలగా వర్ణించింది. వాస్తవ మానవాభివృద్ధి లేకుండానే ఆర్థిక పెరుగుదల ఎన్ని రకాలుగా వుండవచ్చో చెప్పింది.

విద్య ఉపాధి కల్పించేదిగా, వృత్తిపరమైన నిపుణలతను అందజేసేవిగా, శారీరక శ్రమతో గాని, మానసిక శ్రమతో గాని జీవనాధారాన్ని కల్పించేదిగా వుండాలని అన్ని కమిటీలు చెప్పాయి. కాని కమిటీల సిఫార్సులు ఆచరణకు నోచుకోలేదు. "ఆర్థిక సంస్కరణలు" లేదా "సంస్థాగత సర్దుబాట్లు" విధానాల ఫలితంగా ప్రభుత్వాలు విద్యా వైద్య రంగాలను క్రమేపి విస్మరించడం వలన చదువుకొనుగోలు వస్తువుగా మార్చబడింది. "స్వేచ్ఛా మార్కెటు, - పోటీ" వేదాంతం ఉద్యోగాలను కల్పించక పోగా, ఉన్న ఉద్యోగాలను ఊడబెరకనారంభించింది. ఇది ఊహించని సామాజిక ఉద్రిక్తలకు దారితీస్తుంది.

ఇన్ని పరిమితులు ఇబ్బందులు వున్నా ఉపాధ్యాయులు తమకున్న సామాజిక బాధ్యతను మరువలేరు. విద్యా రంగం సాలెగూడులో చిక్కుకుంది. దీన్ని ఏ మేరకైనా సంస్కరించి - బాధ్యతగల భావి పౌరుల్ని పావన నవజీవన బృందావన నిర్మాతల్ని తయారు చేయడంలో మీ కర్తవ్యాన్ని ఒక పవిత్ర యజ్ఞంగా భావించి నిర్వర్తిస్తారని నా ప్రగాఢ విశ్వాసం.



# ఉపాధ్యాయులు సామాజిక స్పృహతో పనిచేయాలి

-డాక్టర్ పి. సుబ్రహ్మణ్యం I.A.S.
కమీషనర్ మరియు డైరెక్టర్ పాఠశాల విద్య

మన దేశ ప్రగతిని విదేశాలలో పోల్చుకొని ఆ దేశాలు సాధించాయి కాబట్టి మనమూ సాధించవచ్చునని సంబరపడిపోవడం ముఖ్యంగా 1991 నుండి అంటే సరళీకృత ఆర్థిక విధానాలు చేపట్టినప్పటి నుండి మనకు అలవాటయిపోయింది. మార్కెటులో అన్నీ దొరుకుతాయని సరళీకృత విధానాలు చెప్పినంత మాత్రాన ప్రగతి సాధ్యపడదు.

ఉదాహరణకు అక్షరాస్యతా శాతం తీసుకొందాం. 1991లో భారతదేశంలో అక్షరాస్యతా శాతం 52.21. చైనాలో 80%, దక్షిణ కొరియాలో 97.6%, శ్రీలంకలో 89.6%, ఇండోనేషియాలో 82%, కేరళలో 89.8%. భారతదేశంలో అక్షరాస్యత శాతం కంటె దక్షణ కొరియాలో ఎక్కువగా వుంది. సమాజంలో మౌలిక మార్పులు రావాలంటే విద్యారంగంలో మార్పులు రావలసివుంది. విద్యారంగంలో మార్పులు రావాలంటే అందుకవసరమైన షరతులు నెరవేర్చవలసివుంటుంది. సామాజిక రంగంలో సరియైన అభివృద్ధి సాధించకుండానే ఆర్థిక సంస్కరణల ద్వారా అన్నీ సాదిద్దాం అనుకుంటున్నాం. నా వ్యక్తిగత అభిప్రాయం ప్రకారం ఇది నేల విడిచి సాము చేయడమే అవుతుంది.

మన దేశంలో అక్షరాస్యతా శాతం ఎందుకు తక్కువగా వుంది? అంటే. తలసరి ఆదాయం తక్కువ కాబట్టి అంటుంటారు. ఈ తలసరి ఆదాయం విషయానికి వస్తే భారతదేశంలోను గుయనాలోను 1992లో 330 అమెరికా డాలర్లు వుంది. కాని అక్షరాస్యతా శాతానికి వస్తే మనది 52 శాతం వుంటే గుయానాలో 97 శాతం వుంది. అదే విధంగా శ్రీలంక, మొజాంబిక్ దేశాల తలసరి ఆదాయం యించుమించు ఒకటే. కాని శ్రీలంక అక్షరాస్యతా శాతం 89 కాగా మొజాంబిక్‌లో 67 శాతం వుంది. మరొక ఉదాహరణ. సౌదీ అరేబియా తలసరి ఆదాయం శ్రీలంక తలసరి ఆదాయం కంటె 16 రెట్లు వుంది. కాబట్టి ఏ దేశంలోనైనా ఆ ప్రభుత్వం సామాజిక రంగంలో విద్యకి యిచ్చే ప్రాధాన్యతను బట్టి విద్యాభివృద్ధి జరుగుతుంది గాని కేవలం తలసరి ఆదాయాలకు బట్టి కాదు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రాథమిక విద్యని పరిశీలిద్దాం. రాష్ట్రంలో 6-11 సం॥ల మధ్య గల బాలబాలికలు 1 కోటి 1 లక్షమంది వున్నారు. కాని పాఠశాలల్లో 76 లక్షలమంది మాత్రమే నమోదు చేయబడి వున్నారు. అంటే 25 లక్షల మంది పాఠశాలల్లో లేరు. అంటే 25 లక్షల మందికి మన పాఠశాలలు అందుబాటులో లేవు. నమోదయిన వారిలో 5వ తరగతికి వచ్చేసరికి 50 శాతం మాత్రమే మిగులుతున్నారు. బాలికల విద్య ప్రోత్సాహకరంగా లేదు. షెడ్యూల్డు కులాల తెగల పరిస్థితి మరీ అధ్వాన్నం.

బడికిపోయే పిల్లలకు పాఠశాల అందుబాటులో వుండడం అవసరం. అందుబాటును మనం రెండు రకాలుగా పరిశీలించాలి. ఒకటి భౌతికంగా అందుబాటులో వుండడం. అంటే వారు నివసించే ప్రదేశాలలో పాఠశాలలు వుండడం. ఇక రెండవది సామాజికంగా అందుబాటులో వుండడం. కొన్ని గ్రామాలలో కొన్ని ప్రాంతాలలో అక్కడ వున్న సాంఘిక సాంస్కృతిక పరిస్థితుల వలన కొంత మంది పిల్లలు బడికి వెళ్ళరు. అంటే సామాజికంగా వారికి బడి అందుబాటులో లేదన్నమాట. అనేక ప్రాంతాలలో బడి వున్నప్పటికిని హరిజన గిరిజన బాలబాలికలు వెళ్ళకపోవచ్చు.

నమోదు కావడం, మధ్యలో చదువు మానివేయడాన్ని గురించి యింతకు ముందు ప్రస్తావించాను. బడికి హాజరయ్యే విద్యార్థులపై ఈ మధ్య ప్రొఫెసర్ ఈశ్వరరెడ్డి డాక్టర్ సందీప్ గారల చేత "బేస్ లైన్ స్టడీ" చేయించాము. బాలబాలికల యావరేజ్ స్కోరు తక్కువగా వుండడమూ, ఒకటో తరగతిలో సాధించిన స్కోరు మేరకు గాక 4వ తరగతికి వచ్చేటప్పటికి బాగా తగ్గిపోవడం, ఎక్కువ మార్కులు సాధించే వానికి తక్కువ సాధించేవానికి మధ్య అంతరం చాలా ఎక్కువగా వుండడం - సర్వేలో గమనించిన ముఖ్యాంశాలు. అంటే విద్య యొక్క స్థాయి అధ్వాన్నంగా వుందని చెప్పడానికి ఇదొక ఉదాహరణ.

అసలు పాఠశాల తటస్థ సంస్థయేనా? అనే సందేహం కలుగుతుంది. దీనికి సమాధానం 'అవును' 'కాదు' - అని చెప్పడం కష్టం. పాఠశాలలకు పిల్లలు రకరకాల సామాజిక నేపథ్యాల నుండి వస్తుంటారు. వివిధ సామాజిక తరగతుల నుండి వస్తుంటారు. అక్షరాశ్యులైన తల్లిదండ్రుల బిడ్డలు రావచ్చు. నిరక్షరాస్యులైన తల్లిదండ్రుల బిడ్డలు రావచ్చు. కాబట్టి అనేకమైన వ్యత్యాసాలతో పాఠశాల నడపబడుతుంది. ఒక విద్యార్థి పాఠశాల విద్య పూర్తి చేసిన తరువాత పెద్ద చదువులేం చదవాలి? అంటే మెడిసిన్ చేయాలా? ఇంజనీరింగ్ చేయాలా ? - ఐ.ఎ.యస్. చేయలా? - అనేది కొంత మేరకు తాను ఏ సమాజం నుండి వచ్చాడో ఆ సమాజం పరిస్థితుల మీద, కొంత మేరకు తల్లి దండ్రుల మీద, కొంత వరకు తాను పొందిన వ్యక్తిగత అనుభవం మీద చూస్తున్న పరిసరాల మీద ఆధారపడివుంటుంది.

ఉదాహరణకు ఒక విద్యార్థికి కొంత డబ్బు యిచ్చి మద్రాసు పంపారనుకోండి. కొన్ని చూడవలసిన ప్రదేశాలు చూస్తాడు. మహాబలిపురం చూస్తాడు. కొంత విజ్ఞానం పొందుతాడు. అలాగే మరొక విద్యార్థికి దృశ్య శ్రవణ పరికరాలు సమకూర్చారనుకోండి. అవి అతడి మెదడుకు కాస్త పదునుపెడతాయి. కాని గ్రామీణ ప్రాంతంలో ఒక విద్యార్థిని తీసుకొండి. ఆ విద్యార్థికి కూడా కొన్ని ఆదనపు నిపుణతలు వుంటాయి. తాటి చెట్టు ఎక్కగలుగుతాడు. నాగలిపట్టి కొండ్ర వేయగలుగుతాడు. లేదా దుంపలలో ఏది విషపూరితమైనది ఏది కానిది - చెప్పగలుగుతాడు. కాని వీటికి పాఠశాల విధానాలతో ప్రమేయం ఏమీ లేదు. పాఠశాలకు గల అందుబాటును గురించి చెప్పాలంటే అదొక సూపర్ బజార్ లేక షాపు లాంటిది. షాపులో సూపర్ బజారులో ఏమేమి దొరుకుతాయో తెలుసు కాబట్టి డబ్బున్నవారు

అవసరం వున్నవారు కావలసినవి కొనుక్కొని వస్తారు. అదే విధంగా బడిలో ఏం దొరుకుతుందో, ఆ దొరికేదాని విలువ తెలిసిన వాళ్ళు తమ పిల్లల్ని స్కూల్లో చేర్పిస్తారు. చదివిస్తారు. అవసరమనుకొంటే ట్యూషన్స్ ఏర్పాటు చేస్తారు. తామే పాఠాలు చెపుతారు. బిడ్డని ఎన్ని విధాల పైకి తీసికొని రావడానికి అవకాశాలుంటాయో అన్ని విధాల తీసుకొని వస్తారు. కాని నిరక్షరాస్యులైన తల్లి దండ్రులు ఈ అవసరాన్ని గుర్తించలేరు. అవకాశాలకు వినియోగించుకోలేరు.

ఇప్పుడున్న పద్ధతులలో బడి వద్దకు సమాజం వస్తున్నది. కాని సమాజం వద్దకు బడిని ఎలా తీసికొని వెళ్ళాలి? - అన్నది మనం ఆలోచించాలి. విద్యాపరంగా వెనుకబడ్డ గ్రామాలకు ప్రాంతాలకు మీరు దత్తత తీసుకోవాలా? వెనుకబడ్డ ప్రాంతాలలో స్తబ్దతలో కూరుకుపోయి నిస్త్రాణంగా వున్న వారిని తట్టిలేపి ముందుకు తీసుకుపోవాలా ? ఏ విధంగా చేస్తే సత్ఫలితాలు సాధించగలం? అనేది మేధావులైన ఉపాధ్యాయులు ఆలోచించి చర్చించి తగిన మార్గాలు రూపొందించాలని విజ్ఞప్తి చేస్తున్నాను. అలాగే ఒకటో తరగతిలో చేరిన వారి విద్యలో మానుకోకుండా ఐదవ తరగతి పూర్తి చేయించడానికి తగిన వ్యూహాన్ని రూపొందించగలమా ? ఉపాధ్యాయులుగా మీరు ఆలోచించాలి.

విద్యని ప్రభావితం చేసేవిగా కొని in school factors వున్నాయి. పాఠశాలకు అవసరమైయ్యేంత మంది ఉపాధ్యాయులు వుండడం, సకాలంలో పాఠ్య పుస్తకాలు అందజేయడం బోధనా పద్ధతులను అనుసరిస్తూ సమర్థవంతంగా పనిచేయడం, పాఠశాలకు కనీస వసతులు కల్పించడం లాంటివి in school factors.

సమాజంలో అసమానతలు వున్నాయి. తాతలు తండ్రులు చదువుకొన్న కుటుంబాలలో బిడ్డలు పెంపకం, వారికి నేర్పే మాటలు పద్ధతులు ఒక రకంగా వుంటాయి. రెక్కాడినా దొక్కాడని కుటుంబాలకు చెందిన బిడ్డల పెంపకం మరొక రకంగా వుంటుంది. అలాగే సాంస్కృతిక వారసత్వం కూడా విద్యపై ప్రతిఫలిస్తుంది. గతంలో వేదాలు ఫలానా వారే చదవాలని, ఇతరులు చదవడమే కాదు విననుకూడా వినకూడదని కట్టుబాట్లు వుండేవి. అవన్నీ పోయినవి గదా! ప్రస్తుతం అమలులో వున్న రాజ్యాంగం ప్రకారం సార్వత్రిక విద్య అమలు జరుగుతుంది గదా ! అనవచ్చు. నిజమే. ఆర్టికల్ 37 క్రింద అస్పృశ్యతను కూడా రద్దు చేశారు. మన మనసులలో నుండి ఆ భావం పోనంత వరకు కాగితాలకే పరిమితమవుతుంది తప్ప ఆచరణలో అస్పృశ్యత పోతుందా? పాఠశాల అందరికీ అందుబాటులో వుంచాం. అని చెప్పినంత మాత్రాన అందరూ వచ్చి బడిలో కూర్చొనగలుగుతారా! అందుబాటులో వుందని చెప్పుతున్నాం తప్ప జయప్రదం చేసేందుకు కృషి చేయవలసినంతగా చేయడం లేదు. చట్టాలు చేసినంత మాత్రాన అన్నీ అమలు జరగవు. ప్రజలను చైతన్యపరచి అమలు జరిపించుకొనడం కూడా మన బాధ్యతే.

రామకృష్ణరావు కమిటీ సిఫార్సులను ఉపాధ్యాయులలో చాలా మంది వ్యతిరేకించారు. మంచిదే వారికి ఆ స్వేచ్ఛ వున్నది. కాని ప్రత్యామ్నాయముగా యిలా వుండాలి అని సూచించగలగాలి. రామకృష్ణారావు కమిటీ బిడ్డల తల్లిదండ్రులకు పాఠశాల నిర్వహణలో తగు ప్రాధాన్యత కల్పించాలంటుంది. మనం వాటిని వ్యతిరేకిస్తున్నాం అనుకొండి. కారణమేమిటి ? ఉపాధ్యాయులు గ్రామ పాలక వర్గం పరస్పర విరుద్ధ శక్తులు అనుకుంటున్నాం. ఈ వైరుధ్య భావం విడనాడి సమాజం వద్దకు పాఠశాలను తీసుకొని పోవలసిన ఆవశ్యకతను గుర్తించి ప్రజల సహకారంతో విద్యాభివృద్ధికి కృషి చేయడం అవసరమని భావిస్తున్నాను.

ఈ మధ్య పాఠశాలన్ని నెలసరి రిపోర్టులు పంపమని అడుగుతున్నాం. ఎంతమంది పిల్లలు హాజరవుతున్నారు? సిలబస్ ఏ మేరకు పూర్తి చేశారు? ఎన్ని పరీక్షలు పెట్టారు? వాటిలో ఎంత మంది పాస్ మార్కులు తెచ్చుకొన్నారు. తల్లి దండ్రుల ఉపాధ్యాయ సమావేశాలు జరుగుతున్నాయా? స్కూల్స్‌కి మంజూరు చేసిన ఇన్‌సెంటివ్స్ అన్నీ ఉపయోగించుకొనగలగుతున్నారా? లాంటి వివరాలను తెలుసుకోవాలని ఈ రిపోర్టులు ప్రవేశపెట్టాం. కాని మీ సహకారం లేకపోతే ఆశించిన ఫలితాలు సాధించబడవు.

ఒక ప్రక్క మనం ప్రైవేటీకరణను వ్యతిరేకిస్తున్నాం. అలాంటప్పుడు వున్న విధానాన్ని మెరుగుపరచుకోవాలి గదా! అదనంగా నిధులు కావాలంటున్నాం. మంచిదే. కాని ప్రస్తుత విధానంలో దుబారాను తగ్గించాలి గదా ! ఇప్పుడు అలసత్వం లేదా? పాఠశాల సక్రమంగా జరుగుతుందా! అందరూ నిర్ణయించిన కాలం మేరకు పనిచేస్తున్నారా ? ఎవరి విధులు వారు నిర్వహిస్తున్నారా? అదనంగా నిధులు యిస్తే విద్యాభివృద్ధికి వినియోగింపబడతాయా? ఇవన్నీ ఉపాధ్యాయులు ఎవరికి వారుగా సమిష్టిగా కూడా ఆలోచించవలసిన అంశాలు.

ప్రజలు ఉపాధ్యాయులను గురించి ఏమనుకుంటున్నారు! ఉపాధ్యాయుల పనితీరును గురించి ప్రజల అభిప్రాయాలు సేకరించండి. మనం ఒక వస్తువును కొంటే దానిని పలుకోణాల నుండి పరిశీలించి చూస్తాం. మనం చేస్తున్న సేవలకు మూల్యాన్ని తీసుకుంటున్నాం గదా! మన సేవలు సక్రమంగా వున్నాయా? లేదా ? తెలుసుకోవలసిన అవసరం బాధ్యత ప్రజలకు ప్రభుత్వానికి వున్నది. ఉపాధ్యాయులు బాగా పనిచేసున్నారని ప్రజలు అభిప్రాయపడితే అలాంటి ఉపాధ్యాయులను గౌరవిద్దాం. లేకపోతే మన విధానంలో లోపాల్ని సవరించుకొందాం.

ప్రభుత్వం గాని రామకృష్ణారావు కమీషన్ గాని డైరెక్టరు గాని 'మీ బాధ్యతలను మీరు సక్రమంగా నిర్వర్తించండి' అని ఎందుకు చెప్పాలి? ఉపాధ్యాయులుగా మీ అంతట మీరే అందుకు పూనుకోవాలి. సంఘంగా మీరు బాధ్యత వహించి ఒక పిలుపు యివ్వండి. మీరు సమాజాభ్యున్నతికి పనిచేస్తున్నారని నిరూపించుకోండి.

ఆర్థిక సంస్కరణల కారణంగా ఎవరి ఉద్యోగాలు వుంటాయి? ఎంతమందివి పోతాయి? - అనేది ఒక అంశం. యంత్రాల మీద సూచనలు వుంటాయి గదా! ఏ మీట నొక్కితే యంత్రం ఎలా పనిచేస్తుంది. - తెలుసుకోవడానికి అవసరమైన ప్రాథమిక విద్య శ్రామికులకు లేకపోతే ఏ సంస్కరణలైనా ఎలాంటి ప్రయోజనాలను సాధించగలుగుతాయి? అందువలననే విద్య మీద అదనంగా పెట్టవలసిన అవసరం ఎంతైనా వుంది. ఇప్పుడిప్పుడే ఆ ఆలోచనకు రూప కల్పన జరుగుతుంది. ప్రభుత్వం ప్రాథమిక విద్యని నిర్బంధంచేయబోతున్నది. ఇది చాలా హర్షణీయమని భావిస్తున్నాం.

ఏ దేశమైనా బాగుపడాలంటే ఆర్థిక నిర్మాణం, సామాజిక నిర్మాణం - రెండూ అవసరం. ధనం వెచ్చించి వేసిన రోడ్లు, కట్టించిన భవనాలు యితర కట్టడాలు వగైరా, చెడిపోతే రిపేర్ చేసుకోవచ్చు. లేక కాంట్రాక్టర్ దగ్గర నుండి జరిగిన నష్టాన్ని రాబట్టవచ్చు. సామాజిక యంత్రాంగంలో నష్టం జరిగితే ఉదాహరణకు బోధనాయంత్రాంగంలో లోపం జరిగితే రిపేర్ చేయడం సాధ్యం కాదు. కాలచక్రాన్ని వెనక్కి తిప్పడం ఎంత అసాధ్యమో ఈ లోపాల్ని సరిచేసుకొనడం అంత అసాధ్యం. కాబట్టి రంగంలో జరిగిన నష్టం శాశ్వతమైనది. ఆ సమాజంలో నిరక్షరాస్యులు పేరుకుపోతారు. సమాజంలో చదువుకి వున్న ప్రాధాన్యతను గుర్తించి ఉపాధ్యాయులు తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించవలసిందిగా ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో విద్యా బోధన సక్రమంగా సాగించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను.



# మహిళల హక్కులూ మానవ హక్కులే

**శ్రీమతి మైథిలి శివరామన్**
అఖిల భారత శ్రామిక మహిళా సంఘ నాయకురాలు

మహిళ అన్ని విధాలా పురుషునితో సమానామా? అనే ప్రశ్నకు ఉద్యోగం చేస్తున్న మహిళ ఈ విధంగా చెప్పింది. "నేను నా భర్త ఒకే ఆఫీసులో పనిచేస్తున్నాం. ఇద్దరం చేసే పని స్వభావం కూడా ఒకటే. ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు మేము సమానమే. సాయంత్రం 5 గంటలకు ఇంటికి వెళ్లి చెప్పులు విడుస్తాం. అక్కడ చెప్పులతోపాటు నా సమానత్వాన్ని కూడా వదిలేస్తాను. ఇల్లు చేరిన తర్వాత భర్త అవసరాలు తీరుస్తాను. బిడ్డల సంరక్షణ చూస్తాను. వంట గదికి పరిమితమవుతాను. అంటే ఇల్లు చేరగానే నా రెండవ షిఫ్టు ప్రారంభమవుతుంది." ఆమె చెప్పిన దానిలో ఏమైనా అవాస్తవంగాని విపరీతంగాని వుందా? ఇంటా బయటా షిఫ్టుల ప్రకారం పనిచేసే మహిళకు కనీసం వార్తా పత్రిక చదివే తీరిక కూడా వుండదు. ఇంటా బయటా గానుగెద్దు చాకిరికి అలవాటు పడిన మహిళ ఆలోచనలు గిడసబారి పోతాయి. కొన్ని పరిమితులకు లోబడి మాత్రమే సమాజాన్ని చూడగలుగుతుంది. దృష్టి మందగిస్తుంది. సంకుచిత మవుతుంది. ఈ లక్షణాలు సమాజంలో ఒక వ్యక్తిగా తాను వ్యవహరించడంలోనేగాక బిడ్డల పెంపకంపై కూడా ప్రభావం చూపుతాయి.

సాధారణంగా ఒక వ్యక్తికి అతనికి మాత్రమే చెందిన లక్షణాలు కొన్ని వుంటాయి. ఉదాహరణకు ఒక పురుషుణ్ణి తీసుకొందాం. అతడు ఉపాధ్యాయుడు, తెలుగు మాతృభాషగా గలవాడు. మధ్య తరగతికి చెందినవాడు. ఇవన్నీ అతడికి మాత్రమే చెందిన లక్షణాలు. అదే మహిళ విషయానికి వస్తే ఆమెకు చెందిన లక్షణం ఒకటే వుంటుంది. అది (She will adjust and accomodate) స్టేట్స్‌లో డాక్టర్లుగా, ఇంజనీర్లుగా లేక పెద్ద ఆఫీసర్లుగా పనిచేసే వారైనా వారి కుతురు పెండ్లి ప్రస్తావన వస్తే మా అమ్మాయిని భారతీయ సాంప్రదాయాల కనుగుణంగా పెంచాం. కాబట్టి (She will adjust and accomodate) అని చెపుతారు. అంటే తండ్రి చెప్పినట్లు భర్త చెప్పినట్లు నడుచుకుంటుంది. నీరు ఏ పాత్రలో పడితే అ ఆకారాన్ని పొందినట్లు.

పురుషులతో సమానంగా ఉద్యోగాలు యితర పనులు చేసే మహిళల్ని "ఇంటి పనులలో మీతో సమానంగా మీ వారిని చేయమని ఎందుకు అడగరు?" అంటే ఏమంటారు. "వేదికలెక్కి మైకు ముందు నిలబడి ఉపాన్యాసాలిచ్చినంత తేలిక కాదు. అలా అడిగితే కొంప కొల్లేరవుతుంది. సంసారాలు ప్రశాంతంగా సాగవు" అంటారు. అలా వారనడంలో ఏమైనా విపరీతముందా?

సామాజిక చైతన్యాన్ని పెంచే సభలు సమావేశాలకు మహిళలు అంతగా హాజరుకారు. అలా వెళ్ళి యింటికి కొంచెం ఆలస్యంగా వస్తే సాధింపులు, వేధింపులు.

కాబట్టి ఉన్నత విద్యావంతులు, విద్యా ప్రదాతలు, మేధావులు, సామాజిక మార్పును కోరే ఉపాధ్యాయులు మహిళా సమస్యల విషయంలో కూడా ముందుండాలి. మహిళా చైతన్యాన్ని పెంచే కార్యక్రమములో మీ చెల్లెళ్లు కూతుళ్లు, భార్యలు పాల్గొనేలా ప్రోత్సహించాలి. అలాగే ఉద్యోగాలు చేసే భార్యలు గల పురుషులు ఇంటి పనులలో సహకరించాలి. ఉన్నత సంస్కారవంతులైన ఉపాధ్యాయులు చేయకపోతే సాధారణ కార్మికుని నుండి సాధారణ పురుషుని నుండి ఈ సంస్కారం ఆశించగలమా ?

## సరళీకృత ఆర్థిక విధానాలు - మహిళలు :

ఇటీవలి కాలంలో గ్లోబలైజేషన్, లిబరలైజేషన్ ప్రైవేటీజేషన్ - లాంటి పదాలు ఎక్కువగా వినపడుతున్నాయి. వీటికి అనుకూలంగా సంస్కరణలు చేపట్టకపోతే మన దేశం వెనకబడి పోతుందని, ఆధునిక ప్రపంచంలో ఆటవిక దశకు తిరోగమించ వలసి వస్తుందని ప్రచారాలు జరుగుతున్నాయి. ప్రజల బాగోగులు మార్కెటు దయాదాక్షిణ్యాలకు వదలివేయబడుతున్నాయి. మార్కెటు పోటీ వలన ప్రయోజనాలు పొందేది పేదలు, నిర్భాగ్యులు, సాధారణ ప్రజానీకం కాదు. సంపన్నులు మాత్రమే. సంస్కరణల పేరుతో అవలంబించబడుతున్న ఈ నూతన ఆర్థిక విధానాలు, వీటితో పాటు అన్నిటినీ నిర్ణయించే శక్తిగా ఎదుగుతున్న మార్కెటు పోటీ ఉపాధి సౌకర్యాలను దెబ్బతీస్తుంది. ఉత్పత్తి రంగంలోని, యితర ఉద్యోగాలలోను అంతంత మాత్రంగా వున్న స్త్రీల పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది. ఉద్యోగం చేస్తున్న అమ్మాయి తాను పెళ్ళి చేసుకుంటున్నానని సంతోషంగా యాజమానికి వెడ్డింగ్ కార్డు యిస్తే దానిని ఒక చేత్తో పుచ్చుకుంటూ రెండవ చేతితో ఊస్టింగ్ ఆర్డర్లు యిచ్చిన సంఘటనలు చాలా వున్నాయి. అధునిక మార్కెటు పోటీననుసరించి యాజమానికి కావలిసింది లాభాలు గాని అమ్మాయిల సంక్షేమం కాదు. పెరుగుతున్న నిరుద్యోగం పేదరికం ద్వారా సమాజంలో వివాహేతర సంబంధాలు. అరాచక ధోరణులు ప్రబలుతున్నాయి. మహిళలు, అత్యాచారాలకు సంఘ విద్రోహ శక్తుల దౌర్జన్యాలకు గురవుతున్నారు.

## కులతత్వం :

భారత దేశంలో కులతత్వం బలంగా వేళ్ళూనుకునే వుంది. దళితులు యిప్పటికీ చెప్పులు వేసుకొనడానికి అనుమతించని ప్రాంతాలూ వున్నాయి. వారు గురి చేయబడే అవమానాలకు అంతులేకుండా వుంది. దళితులను దోపడికి గురిచేసి ప్రయోజనాలు పొందే వర్గము వుంది. అదే సమయంలో దళితలను అడ్డం పెట్టుకుని రాజకీయ ప్రయోజనాలు పొందే పవర్ బ్రోకర్లు వున్నారు. ఈ రెండు తరగతులకు చెందిన వారు తరచుగా కుల ఘర్షణలు రెచ్చగొడుతున్నారు. ఇలాంటి సందర్భాలలో వేధింపులకు, అవమానాలకు, అత్యాచారాలకు హింసలకు గురయ్యేది మహిళలే. ఒక కులం వారు మరొక కులం వారిపై కసి దీర్చుకోనడంలో భాగంగా మహిళలపై అత్యాచారాలు జరుగుతున్నాయి.

### మతతత్వం :

ఏదో తీవ్రమైన విధ్వంసం జరిగే వరకు మనం మతతత్వాన్ని గురించి ఆలోచించడం లేదు. సాధారణంగా మనమంతా సెక్యులరిస్టులమని, మతత్వానికి వ్యతిరేకంగా పోరాడతామని చెప్పుకుంటాం. రోజువారీ జీవితంలో ఈ పని మనం చేస్తున్నామా? శతాబ్దాలుగా వివిధ మతాలు సహజీవనం చేస్తున్న దేశం మనది. ఒక మతం మరొక మతానికి యిచ్చి పుచ్చుకొన్నది ఎంతో వుంది. స్వతంత్ర పోరాటంలో వివిధ మతాలు కలిసికట్టుగా వలస పాలనకు వ్యతిరేకంగా పోరాడాయి. కాని ఈనాడు మత ప్రాతిపదికగా అధికారం కైవశం చేసుకోవాలని మెజారిటీ మతం ప్రయత్నిస్తున్న విషయం బహిరంగ రహస్యమే. బాబ్రీ మసీదు విధ్వంసం చేయబడింది. మనం ప్రేక్షకులుగా వుండిపోయాం. స్పందించవలసినంతగా స్పందించ లేదు. మన ఉదాసీన వైఖరి మతతత్వవాదులకు ప్రోత్సాహంగా కనిపిస్తుంది. మధుర, కాశీలలో మసీదుల విధ్వంసానికి సన్నద్ధ మవుతున్నారు. మతపరమైన దాడులలో మంచి మానవతకు స్థానం లేదు. సంకుచిత ప్రయోజనాలకు తప్ప దైవ చింతనకు అస్కారం లేదు. మతపరమైన దాడులలో ఘర్షణలలో అవమానాలకు అత్యాచారాలకు గురయ్యేది మహిళలు. మంచిని పెంచవలసిన మతాలు మహిళల్ని సమిధలుగా చేసి మానవత్వాన్ని మంట గలుపుతున్నాయి.

### ఉపాధ్యాయుల కర్తవ్యం :

ఉపాధ్యాయులలో కొందరు పాఠ్య పుస్తకం పరిధిని మించి, ఒక్క విషయమూ చెప్పడానికి యిష్టపడని వారు వుంటారు. పాఠ్య పుస్తకం ఒక ఉపకరణం మాత్రమే. ఉపాధ్యాయులు శాస్త్రీయ అవగాహనను సామాజిక చైతన్యాన్ని పెంచుకునే దిశలో అధ్యయనం సాగించాలి. విద్యని ప్రజాస్వామ్యయుతం చేసి విద్యార్థియిని పెంచడం ఉపాధ్యాయుని బాధ్యత. విద్యార్థులలో విమర్శనా దృక్పధాన్ని పెంచి వారు నేర్చుకొన్న ప్రతి విషయాన్ని ప్రశ్నించే లక్షణాన్ని పెంచడం ఉపాధ్యాయుని బాధ్యత. సమాజ పురోగమనానికి దోహదం చేసే విధంగా విద్యని తీర్చి దిద్దడం కూడా ఉపాధ్యాయుని బాధ్యత. ఈ బాధ్యతలు నిర్వర్తిస్తే సమాజ పురోగమనానికి తద్వారా మహిళాభ్యున్నతికి ఉపాధ్యాయులు దోహదం చేసిన వారవుతారని నా ప్రగాఢ విశ్వాసం.

### మహిళా సమస్యల[illegible]పత్రం

మన దేశ జానాభాలో సగభాగం స్త్రీలు. అయినా వారి సాంఘిక స్థాయి మాత్రం నానాటికి దిగజారుతున్నది. స్త్రీ తన మనుగడ కోసం ఇంటా బయటా, పనిచేసే చోటా అడుగడుగునా పోరాడవలసి వస్తున్నది. కుటుంబ, సామాజిక వివక్షతలకు గురి అవుతూ పనిచేసే చోట కూడా కనీస అవసరాలు లేని స్థితిలో ఉద్యోగ బాధ్యతలను నిర్వహిస్తున్నది.

ఇంటిలో కుటుంబ పని, బయట పనితో శ్రమ భారం పెరుగుతున్నది. ఫలితంగా సగభాగంగా వున్న స్త్రీలు మానసిక ఎదుగుదలకు అవకాశం లేక సామాజిక కార్యక్రమాలపై దృష్టి సారించే సమయం లేక పరిమితమైన పరిధులలో ఉండిపోతున్నారు. ఈ స్థితి ఆమె ఆలోచనలకు సంకుచితత్వం అనే బిరుదును తెచ్చిపెడుతున్నది.

తాను మహిళగా పుట్టినందులకు ఉద్యోగ మహిళ కూడా వరకట్నం, కుటుంబ హింస, చులకన, వేధింపులకు గురి అవుతున్నది. మొత్తం మహిళల సమస్యల్నీ ఉద్యోగులైన మహిళలకూ ఉన్నాయి. ప్రభుత్వ ఆర్థిక విధానాలు, నిరుద్యోగం, మీడియా ప్రభావం స్త్రీకి రక్షణగా నిలువకపోగా అభద్రతా భావానికి గురిచేస్తూ మరింత కుంగ తీస్తున్నాయి. ఈ సమస్యలతో పాటు వృత్తి పరంగా అనేక సమస్యలను ఎదుర్కొంటున్న నేపథ్యంలో కనీసం వృత్తి పరమైన సమస్యల నుండి అయినా ఆమెను విముక్త గావించాలని ఈ మహాసభ కోరుతోంది.

### మహిళల సమస్యలు

1. ఉద్యోగ మహిళలకున్న ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా (ఉద్యోగ, కుటుంబ బాధ్యతల భారం) ఆమె ఉన్నత చదువులకై "స్టడీ" సెలవు సౌకర్యం కల్పించాలి.
2. కనీస అవసరమైన మరుగుదొడ్లు లేక అనేక అవస్థలు పడుతున్నారు. ఈ స్థితి ఆమె ఆరోగ్యంపై ప్రభావం చూపుతున్నది. అదే విధంగా స్త్రీలు పని చేసే చోట ప్రత్యేకంగా విశ్రాంతి గది ఒకటి ఉండాలి. కాబట్టి మరుగుదొడ్లు స్టాఫ్ రూమ్ సౌకర్యం కలిగించాలి.
3. నియామకాలలోనూ, బదిలీలలోనూ మారుమూల ప్రాంతాలకు గాక రోడ్డుకు దగ్గరగాను, మండల కేంద్రాలలోనూ నియమించుట ద్వారా రాజకీయ ప్రమేయం, అవినీతికి తావులేకుండా చేయాలి.
4. డిపార్టుమెంట్, ప్రయివేట్ వృత్తి అనే దానితో సంబంధం లేకుండా భార్యభర్తలు ఒకే చోట ఉండే విధంగా అవకాశం కల్పించాలి.
5. బిడ్డలకు తండ్రులను మాత్రమే ప్రస్తుతం గార్డియన్‌గా గుర్తించుచున్నారు. బిడ్డలను కనిపెంచడంలో పురుషుల కంటే స్త్రీలు ఎక్కువ బాధ్యత వహించుచున్న స్త్రీలను గార్డియన్‌గా అంగీకరించాలి.
6. మహిళల పట్ల వివక్షతతో కూడిన పాఠ్యాంశాలను తొలగించాలి.

ఉదా : 1. అమ్మాయి అయితే తల్లికి సాయం చేస్తుంది. అబ్బాయి చదువుకుంటాడు.
2. పొదుపు అమ్మాయి పెళ్ళి, అబ్బాయి చదువు.
3. తల్లి వంట చేస్తుంది. తండ్రి ఆఫీసుకెళ్ళి డబ్బు తెస్తాడు.

7. ప్రపంచములో ఆరోగ్య సంస్థ బిడ్డకు తల్లి పాల ప్రాముఖ్యాన్ని చాటిచెబుతున్న సమయంలో పనిచేసే చోట క్రెచ్ సౌకర్యం కల్పించడం ద్వారా బిడ్డకు పాలు ఇచ్చే అవకాశం కల్పించాలి. లేదా కనీసం కొంత ప్రత్యేక సమయం కేటాయించాలి.
8. స్త్రీలకు వచ్చే గర్భకోసం వ్యాధులకు మెడికల్ రీ-ఎంబర్స్‌మెంట్ ఇవ్వాలి.
9. మెటర్నటీ సెలవులో వున్న సమయంలో సెలవును ముందుగానే గ్రాంటు చేసి నెలనెలా జీతం వచ్చే విధంగా ఏర్పాటు చేయాలి.
10. ఎయిడెడ్ వారికి కూడా మెటర్నటీ లీవ్ 4 మాసములు అన్ని జిల్లాలలో అమలు వర్తింపజేయాలి.
11. కో-ఎడ్యుకేషన్ పాఠశాలలో బాలికల అవసరాలు గ్రహించే నిమిత్తం కనీసం ఇద్దరు మహిళా ఉపాధ్యాయినులను నియమించాలి.
12. హాస్టల్స్‌లో వుండి చదివే బాలికలు అనేక అత్యాచారాలకు గురి అవుతున్న నేపథ్యంలో ఆ విద్యార్థినులకు తగు రక్షణ కల్పించాలి.
13. జిల్లాకేంద్రాలలోనూ, ముఖ్య పట్టణ ప్రాంతాలలోనూ మహిళలకు "వర్కింగ్ ఉమెన్స్" హాస్టల్స్ ఏర్పాటు చేయాలి.
14. బస్‌లలో స్త్రీలకు కేటాయించిన సీట్లను బస్ బయలు దేరు ప్రాంతంలో నిమిత్తం లేకుండా స్త్రీలకే కేటాయించాలి.



# యు.టి.యఫ్. అమూల్య వారసత్వాన్ని కొనసాగించండి

**ప్రతినిధుల సభలో శ్రీ మోటూరి హనుమంతరావు,**
ప్రజాశక్తి సంపాదకులు

యు.టి.యఫ్. సప్తమ విజ్ఞాన విద్యా మహాసభలు గత ఆరు మహాసభల కంటే మిన్నగా జరుపుకుంటున్న నిర్వాహకులను అభినందించుతున్నాను. అధికార దర్పం గలవారి మోజు, ఆడంబరం లేకపోయినా ఒంగోలు మహాసభలు అపూర్వ సమీకరణశక్తితో జరగడం ఉద్యమ చైతన్యానికి నిదర్శనం.

23 సంవత్సరాల క్రితం జన్మించిన యు.టి.ఎఫ్. అన్ని ఉపాధ్యాయ సంఘాలకంటే ఔన్నత్యంలో వుండటం దాని విశేషం. 20వేల ఐక్య ఉపాధ్యాయ పత్రికల సర్క్యులేషన్‌తో ఇప్పటికి 70 వేల సభ్యత్వం గల సంస్థగా అది దినదినాభివృద్ధి చెందడం అత్యంత విశేషం. ఉపాధ్యాయ సమస్యల పరిష్కారం కొరకు సమరశీల పోరాటాలను నిర్వహించుతూ ఉద్యమ స్థాయిని ఇంత వరకు పెంపొందించడం కార్యకర్తలకు, నాయకత్వానికి గర్వ కారణం. ఉద్యమం కొరకు అంకితమై నిస్వార్థంగా కృషి చేస్తూ నాయకత్వం ఒకటిగా వ్యవహరించింది. గనుకనే ఈ పురోగమనం సాధ్యమైందని భావిస్తూ అటువంటి కృషికి వారికి విప్లవాభినందనలను తెలుపుతున్నాను. కొందరు విచ్ఛిన్నశక్తులు చిచ్చులు పెట్టినా వాటిని పటాపంచలు చేయగలగడం సంఘటిత ఉద్యమ విశేషంగా భావించగోరుతున్నాను.

## సూత్రబద్ధంగా నిలిచిన యు.టి.యఫ్.

23 సంవత్సరాల జీవితంలో యుటి.యఫ్ అమూల్యమైన అనుభవాలను సంతరించుకున్నది. ప్రాథమికోపాధ్యాయ సంఘాన్ని నిజమైన ఉపాధ్యాయ సంఘంగా, రాజకీయ భిన్నాభిప్రాయాలతో నిమిత్తం లేకుండా అభివృద్ధి చేయాలే గాని కొందరి జేబు సంస్థగా అది దిగజారేందుకు అవకాశం ఇవ్వకూడదని అద్యులు చెన్నుపాటి లక్ష్మయ్య, నాదెళ్ళ సీతారామాచారి, సుబ్బరాజు, సూర్యనారాయణరాజు, మైనేని వెంకటరత్నం వంటి అమరులు సూత్రబద్ధ వైఖరి తీసుకున్న పోరాటంలో యు.టి.యఫ్. అవతరించింది. అందుకొరకు నిలిచిన యోధులు కొందరు చనిపోయారు. మరి కొందరు రిటైరయినారు. అయినా నేటి తరాలవారైన మీ అందరికీ అది నిలయంగా పెంపొందింది. భావితరం వారి ఉజ్వల భవిష్యత్తుకు వెలుగు బాటలు వేయగల అవకాశం మీ కందరికి దక్కింది. యు.టి.యఫ్. వేసిన అడుగుజాడలు అందుకు ప్రధానం.

1969 నుండి 73 వరకు జై తెలంగాణా, జై ఆంధ్రా వేర్పాటు వాదం పెచ్చరిల్లి మధ్యతరగతి మేధావుల్ని, ఎన్.జి.ఒ.లను విద్యార్థుల్ని, ఉపాధ్యాయులను ప్రక్కదారులు పట్టించింది. ఆ కలుషిత వాతావరణాన్ని బ్రద్దలుగొట్టుకొని 1974లో యు.టి.ఎఫ్. ఆవిర్భవించింది. అంతకు ముందు 1956లోనే అంధ్ర ప్రదేశ్ ఏర్పడినా రాష్ట్ర వ్యాపితమైన ఉపాధ్యాయ సంఘం ఒకటే లేదు. అటువంటి రాష్ట్ర సమైక్యతకు మొదట నాందీ ప్రస్తావన పలికింది యు.టి.ఎఫ్. మాత్రమే. అలాగే అదివరకు ప్రాథమిక ఉపాధ్యాయయులకే పరిమితమైన సంఘాన్ని సెకండరీ ఉపాధ్యాయుకులకు కూడా సభ్యత్వాన్ని విస్తరింపచేసిన ఘనత కూడా యు.టి.ఎఫ్ దే.

రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించవలసిన బాధ్యతలలో రాజ్యాంగ చట్టం విద్యావిధానాన్ని చేర్చింది. ఆ అధికారాన్ని కూడా కేంద్రం గుప్పెట్లోనే కేంద్రీకరించుకోవాలన్న దుర్బుద్ధితో ఇందిరాగాంధీ విద్యను కంకరెంటు (ఉమ్మడి) లిస్టులో చేర్పేందుకు రాజ్యాంగ సవరణ తెచ్చింది. భాషలరీత్యా జాతులకున్న రాష్ట్రాభివృద్ధి బాధ్యతకు స్వస్తి వాచకం పలికే ఆ చర్యను యు.టి.యఫ్. వ్యతిరేకించింది. ఇతర ఉపాధ్యాయ సంస్థలన్నీ యూనియన్ ప్రభుత్వం చేతిలో విద్యారంగాన్ని చేర్చితే ఉపాధ్యాయుల సదుపాయాలు పెరుగుతాయని ఆశించారు. కాని ఆ ఉపాధ్యాయుల స్థితిగతులు ఉమ్మడి లిస్టులో ఉన్నంత మాత్రాన ఉపాధ్యాయులకు ఒరిగిపడినది ఏమీ లేదని నేటి పరిణామాలు విదితం చేస్తున్నాయి. పైగా కేంద్రం విద్యారంగానికి కేటాయించే నిధుల శాతం కూడా నానాటికీ తగ్గించుతూ వున్నది. యు.టి.యఫ్. తీసుకున్న వైఖరే సరైనదని నేటి పరిణామాలు విదితం చేస్తున్నాయి.

విద్యా, విధానం మెరుగుపడాలంటే పాఠశాలలను పంచాయితీల పెత్తనంలో పెట్టాలని రామకృష్ణారావు కమిటీ సిఫారసు చేసింది. ఉపాధ్యాయుల మీద గ్రామ పెత్తందారుల పరిపాలన వస్తే ఈ పరిస్థితిలో మరింత అధ్వాన్న స్థితిగతులు ఏర్పడతాయని ఉపాధ్యాయ సంస్థలన్నీ అభ్యంతరం తెలిపాయి. యు.టి.ఎఫ్. అందుకు ముందుండి తన తీవ్ర అభ్యంతరాన్ని తెలిపింది. ప్రస్తుతం ఆ సమస్య అలా ఆగి వున్నది.

అనేక సమస్యల్లో సూత్రబద్ధమైన వైఖరి తీసుకొని యు.టి.ఎఫ్. పెరిగింది. దాని సమీకరణ శక్తి పెరిగింది. ప్రజాస్వామికంగా సంఘ నిర్ణయాలు చేసి ప్రతిష్ఠాకరంగా పురోగమించింది. ఉపాధ్యాయ సంఘాలన్నీ సమస్యలపట్ల యునానిమిటీ పద్ధతిని పరిష్కారాలు, పోరాటాలు సాగించడం సముచితం, ఆ ప్రాతిపదికపైనే యు.టి.ఎఫ్.

అన్ని సంఘాలతో కలిసి పనిచేసింది. అయితే కొన్ని సంఘాలు కలిసి మెజార్టీ నిర్ణయం పేరిట తమ నిర్ణయాన్ని యు.టి.యఫ్. మీద రుద్దడానికి ప్రయత్నిస్తే అందుకు యు.టి.యఫ్. నిరాకరించి స్వతంత్రంగానే పోరాడేందుకు పూనుకున్నది. అనేక ఉపాధ్యాయ సంఘాలతో కలిసి పోరాటాల్లోనూ, సమ్మెలలోనూ పాల్గొంటూనే సూత్రబద్ధవైఖరితో యు.టి.ఎఫ్. నిలబడ్డది.

ఈ చారిత్రకానుభవాలన్నింటిరీత్యా యు.టి.ఎఫ్ కార్యకర్తలు తమ భవిష్యత్తును తీర్చిదిద్దుకోవాలి.

## సంస్కరణలకూ ఆశయాలకూ బద్ధులై నిలవండి

సమాజంలో కలుషిత వాతావరణం విపరీతంగా ప్రబలుతున్నది. అభ్యుదయ సంస్కృతి నేటి టి.వి.ల వల్ల సన్నగిల్లుతోంది. విద్యాధికులుగా విజ్ఞాన వంతులుగా నేటితరం ఉపాధ్యాయులు సాంఘిక సంస్కరణలకు చేయూతనివ్వాలి. మతమౌఢ్యాలు, కులపిచ్చి, మూఢనమ్మకాలు ప్రబలుతున్న ఈ సందర్భంలో మన సంఘ సంస్కర్తలైన కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, భాషా సంస్కర్తలైన గిడుగు రామమూర్తి, మరో ప్రపంచానికి పిలుపునిచ్చిన శ్రీ శ్రీ వంటి మహనీయుల పురోగమనబాటను వారు గ్రామసీమల్లో వేనోళ్ళ చాటి చెప్పాలి. మహిళాభ్యుదయానికి, విద్యకు, వితంతు వివాహాలకు, వర్ణాంతర వివాహాలకు, బాల్య వివాహాల నివారణకు అమోఘమైన కృషి చేసిన మహనీయులు కందుకూరి పోరాడి, ఛాందసుల దాడులను ప్రతిఘటించి మరీ సమాజాన్ని మేల్కొలిపారు. కన్యాశుల్కాలు పోయి, వరకట్న బాధలు విపరీతంగా స్త్రీ జాతిని వేధించుతున్న సమయంలో నవశక్తులుగా మీరు విజృంభించి, ఆ సాంఘిక సంస్కర్తల అడుగు జాడల్లో సమాజాన్ని మేల్కొలపాలి. ఎన్నడో 19వ శతాబ్దంలోనే సరోజినీ నాయుడు, వీరేశలింగంగారు అంతర్జాతి వివాహాల్ని నిర్వహించగా నేటి శాస్త్రజ్ఞులు సైతం ఛాందస భావాలకు బలికావడం వికృతంగా వున్నది. అందుకే నేటి నాగరిక సమాజంలో సైతం విద్యాధికులైన మన యువతరం, ఉపాధ్యాయులు సాంఘిక సంస్కరణలకు నడుం కట్టాలి.

నేటి సమాజం నానా ఇక్కట్లుకు బలవుతున్నది. 50 సంవత్సరాల స్వాతంత్రపాలన అనంతరం ధనవంతులు మరింత ధనవంతులైనారు. దరిద్రులు మరింత నిష్టదరిద్రులుగా మారారు. అభివృద్ధి చెందిన ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని ఈ ఏబైయ్యేళ్ళు పెరిగిన మన దేశ గుత్త పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలు తమ స్వాధీనం చేసుకొని కష్టజీవుల్ని దోచుకుంటున్నారు. ఈ ధనకేంద్రీకరణ జరిగిన కొలదీ కష్టజీవుల శ్రమశక్తిని భారీగా దోచుకోవడం జరుగుతుంది. అవినీతి హద్దులు మీరి ప్రవహిస్తుంది. దోపిడీకి గురయ్యేవారు నెలసరి జీతాల మధ్యతరగతి ఉద్యోగులతో సహా గనిలో, వనిలో, కార్ఖానాలో పనిచేసే కష్టజీవులు. వారందరిలోనూ నిరుద్యోగం ప్రబలుతున్నది. నిర్బంధోచిత విద్య గగన కుసుమం కాగా ప్రపంచంలో గల నిరక్షరాస్యులలో సగం మంది మన దేశంలోనే వున్నారు. ఆ విధంగా జనం అధిక ధరలకు, అనర్థకాలకు బలవుతుండగా విద్యాధికులుగా వున్న మీ స్థానం ఎక్కడ ?

అందుకే ఈ సామాజిక మార్పు కోసం మీరు కంకణం కట్టాలి. ఎవరో అధికారులు మనకు బాధ్యతలు నేర్పవలసిన పనిలేదు. గ్రామాల్లో పనిచేస్తున్న మీరు ఐచ్ఛికంగా యు.టి.యఫ్. సభ్యులుగా మీ విద్యుక్త ధర్మాన్ని మీరు నెరవేర్చాలి. భావి పౌరులను సరైన బాటలో పెట్టవలసిన బాధ్యత మీ పై వున్నది. "స్వంత లాభం కొంతమానుక పొరుగువాడికి తోడుపడవోయ్" అన్న గురజాడ సూక్తిని అందరం చేపట్టాలి. సమాజంలో కార్మిక కర్షక శక్తులు విప్లవాలకు చోదకశక్తులైనా అందుకు బుద్ధిబలాన్ని జోడించగలిగిన వారు మేధావులే. మొదట మార్క్స్ గొప్ప బూర్జువా మేధావి. ఎంగెల్స్ పెద్ద పారిశ్రామికవేత్త కుమారుడు; గొప్ప మేధావి. వారిద్దరు కార్మికవర్గ సిద్ధాంత మహోపాధ్యాయులై వెలుగొందారు. చారిత్రిక పరిణామాన్ని అధ్యయనం చేసి తర్వాత మెట్టు అనివార్యంగా సోషలిజానిదేనని మానవులకు చైతన్య దీప్తిని చేకూర్చిన ఘనత వారిది.

సోవియట్ యూనియనూ మరి కొన్ని దేశాలు కూలడంతో సోషలిజానికి ఎంతో ఎదురు దెబ్బ తగిలింది. అవన్నీ పెట్టుబడిదారీ మురికి కూపంలో పడి మళ్లీ సోషలిజానికి చేరాలని ఇప్పుడు తాపత్రయపడుతున్నాయి. సోషలిజం అనివార్యం. ఆ మార్పుకే మనం కృషిచేయాలి. నిలదొక్కుకున్న చైనా మళ్ళీ ప్రపంచానికి మార్గం చూపగలుగుతోంది.

మహత్తరమైన ఆశయమూ, సంస్కారం, అటువంటి సంస్కృతి మన జీవితాలకు మార్గదర్శకం కాకపోతే మన పిల్లల ఉజ్వల భవిష్యత్తుకు మనం సరైన బాటలు వేయలేము.

యు.టి.యఫ్. ఉపాధ్యాయ సంఘాలన్నింటిలో ఉత్తమమైనది. దాని సభ్యులైన మీరు ఆదర్శ ఉపాధ్యాయులుగా కూడా ఉండగలరని విశ్వసిస్తున్నాను.'

# ఉపాధ్యాయ ఉద్యమ తలమానికంగా యు.టి.యఫ్.

**- ఎ. వెంకటస్వామి**

ఉపాధ్యాయ ఉద్యమంలో ఎడాపెడ ధోరణులను అధిగమించి ప్రాంతీయోన్మాదాలూ, వేర్పాటువాద ఉద్యమాలనూ ఎదురొడ్డి ఉపాధ్యాయ ఉద్యమవనంలో ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ (యు.టి.యఫ్) 1974 ఆగస్టు 10న వికసించింది. ఆనాడు తలెత్తిన ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా భేదబావాలను అధిగమించి,' ప్రాధమిక, ప్రాదమికొన్నత స్థాయి బేదాలను విస్మరించి 'ఎయిడెడ్ పంచాయతీరాజ్, మున్సిపల్ ప్రభుత్వ పాఠశాలలనే తేడాలను ప్రక్కన పెట్టి ఉపాధ్యాయ ఉద్యమ విశాలవేదికగా, సమైక్య సంస్థగా యు.టి.యఫ్. అంకురించింది.

ఆనాటి ప్రాంతీయోద్యమాల ప్రభావం ఉపాధ్యాయ ఉద్యమంపై కూడా పడింది. ప్రాంతీయోద్యమ విద్వేషాలు రగులుతున్న ఆ రోజుల్లోనే తెలంగాణా ప్రాంతం ఖాజీపేటలో 1975 జనవరి 13న సదస్సు జరిపి సమైక్యతాభావంతో ఐక్యఉద్యమానికి సమరశంఖం పూరించింది. సాహసోపేతంగా ఆనాడు చేపట్టిన ఈ చర్య మొత్తం ఉపాధ్యాయ లోకాన్ని విజయపథాన నడిపించి అనేక పోరాటాలలో జయకేతం ఎగురవేయించింది. పుష్కరకాలం తరువాత మిగతా ఉపాధ్యాయ సంఘాలూ యు.టి.ఎఫ్. మార్గాన్నే అనుసరించవలసి రావడం ఉపాధ్యాయ ఉద్యమంలో యు.టి.ఎఫ్. నైతిక విజయం. అమరజీవి చెన్నుపాటి ఆశయాల అఖండ విజయం.

## అత్యవసర పరిస్థితి అంధకారపు రోజుల్లో

అది ప్రజాస్వామిక హక్కులను కాలరాచి ఉద్యోగులు, ప్రజల ప్రాథమిక హక్కులపై పాలకవర్గం తన ఉక్కుపాదం మోపిన అత్యవసర పరిస్థితి అంధకారపు రోజులకు ముందుకాలం. అప్పటికే పాలకుల నిరంకుశ పోకడలు వివిధ రంగాలపై ఎక్కుపెట్టబడ్డాయి. రెండు కోట్లమంది ఉద్యోగులపై దాడికుద్దేశించి కెంద్రప్రభుత్వం వేతన స్తంభన ఆర్డినెన్సును 1974 జూలై 6న ప్రకటించింది. దీని ప్రకారం జీతం పెరిగితే ఏడాదికాలం పూర్తిగానూ, కరువుభత్యం పెరిగితే రెండేళ్ళపాటు సగభాగం నిర్బంధ పొదుపు పథకం క్రింద జమకట్టాలన్నది దాని సారాంశం. ఈ వేతన స్తంభన ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా అప్పుడే రూపుదిద్దుకుంటున్న యు.టి.యఫ్.రాష్ట్రంలోని ఎన్.జి.ఒ.లతో భుజం కలిపి పోరాడింది. దివిసీమ ఉప్పెన సందర్భంగా విజయవాడ వచ్చిన రాష్ట్రపతి దృష్టికి సమస్యను తీసుకెళ్ళి అప్పటివరకు వున్న సి.డి. మొత్తాలను రాబట్టింది. అలా రాబట్టిన మొత్తాన్ని దివిసీమ బాధితులకిచ్చి తన ఉదారతను చాటుకున్నది. ఈ పోరాటం ఉపాధ్యాయుల మనోఫలకాలపై చెరగని ముద్రవేసింది. తదుపరి అత్యవసర పరిస్థితి రూపంలో ప్రజలపై మోపిన ఉక్కుపాదం ఉపాధ్యాయ హక్కులపై కూడా పడింది. ఉపాధ్యాయులు రాజకీయాలలో పాల్గొంటున్నారనే పేరిట స్వగ్రామాలను వదిలి 25. కి.మీ. దూరంలో పనిచేయాలని, 1975 జూన్‌లోనే ఈ బదిలీలు జరగాలని ప్రభుత్వం నిర్దేశించింది. ప్రాథమిక హక్కులను సైతం కాలరాచిన ఆ రోజుల్లోనే యు.టి.ఎఫ్. ఈ విధానానికి వ్యతిరేకంగా పోరాట బావుటా ఎగురవేసింది ప్రభుత్వంతో అనేక రాయబారాలు నెరిపింది. ఈ సందర్భంగా యు.టి.ఎఫ్. పతాక గేయ రచయిత కడలి గంగిశెట్టితోపాటు 80 మంది ఉపాధ్యాయులను నిర్బంధ రిటైర్‌మెంట్‌కు గురిచేసింది. దీనికి వ్యతిరేకంగా కూడా పోరాడి తిరిగి ఉద్యోగాలలో నియామకాలు జరిపేలా విజయం సాధించింది. ఈ సందర్భంగా కారుచీకటి కాళరాత్రిలో సైతం ఉద్యమాల వెలుగుదివ్వెలు వెలిగించిన ఘనత యు.టి.ఎఫ్.కే దక్కుతుందని ఉపాధ్యాయలోకం హర్షించింది.

ఆ కాలంలోనే ఉపాధ్యాయ ఉద్యమంపై మరో దాడి జరిగింది. రోజుకు నాలుగున్నర లేదా ఐదుగా వున్న పనిగంటలను ఆరుకు పెంచి సంవత్సరానికి 220 నుండి 240 పనిదినాలకు పెంచింది. మోడరేషన్‌లో కుట్రవన్ని పరీక్షా ఫలితాలు తగ్గాయంటూ, ఉపాధ్యాయులను దేశద్రోహులుగా చిత్రీకరిస్తూ పత్రికలు, రేడియోల ద్వారా ప్రభుత్వం ప్రచారదాడి సాగించింది. జైళ్ళు నోళ్ళు తెరిచి, పోలీసు పదఘట్టనల క్రింద పాలకులు ప్రకటించిన ప్రజాస్వామ్యమే చితికిపోతున్న ఈ రోజుల్లో యు.టి.యఫ్. దీనికి వ్యతిరేకంగా రాష్ట్రవ్యాపిత సదస్సులు నిర్వహించింది. ఈ నేపధ్యంలోనే వెయ్యిమంది ఉపాధ్యాయులను సమీకరించి 1976 సెప్టెంబర్ 29, 30 తేదీలలో గుంటూరులో చారిత్రాత్మక సదస్సు నిర్వహించింది. నాటి నాగార్జున యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ బాలయ్య గోష్టిని ప్రారంభిస్తూ ప్రభుత్వ వైఖరిని నిశితంగా విమర్శించారు. ఈ సదస్సులోనే శ్రీ ఎం.జె. మాణిక్యరావు కన్వీనరుగా జె.సి.టి.ఎ. ఏర్పాటుకు శ్రీకారం చుట్టి, దాని ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా సమావేశాలు జరిపి ఉపాధ్యాయ నిరసన జ్వాలలు పాలకుల పీఠాన్ని తాకేలా చేసింది. కార్డు క్యాంపెయిన్, టెలిగ్రాం పోరాట రూపాల ద్వారా పాలకుల మెడలువంచి 1976 డిసెంబర్ 15న ఉపాధ్యాయులతో చర్చలు జరిపేలా చేసింది. ఈ చర్చలకు ముందురోజునే కొందరు జె.సి.టి.ఎ.లో చేరికకు ముందుకురాగా వారందరినీ సాదరంగా ఆదరించింది. ఈ పోరాటాల ఫలితంగా 7,10 తరగతులకు పెంచిన పనిగంటలు తగ్గించబడినాయి. మోడరేషన్ తిరిగి యివ్వడంతోపాటు పరీక్షా ఫలితాలలో లోపాలను కూడా సవరించింది. ఆకాలంలోనే యు.టి.యఫ్. 20 పాయింట్లను సమర్థించలేదంటూ, 12 పాయింట్లను పారాయణ చేయలేదంటూ సాగించిన దాడిని కూడా త్రిప్పికొట్టింది.

ఈ పోరాటాల నేపధ్యంలో అత్యవసర పరిస్థితి అనంతరం ఖమ్మంలో 1977 ఆగస్టు 17, 18 తేదీలలో జరిగిన రెండవ మహాసభలో తెలంగాణా జిల్లాలతోపాటు అన్ని జిల్లాల నుండి ఐదువేలమంది ప్రతినిధులు పాల్గొన్నారు. అన్ని సంఘాల నుండి సౌహార్ద ప్రతినిధులు కూడా పాల్గొనడం యు.టి.ఎఫ్. చరిత్రలో మరపురాని మైలురాయిగా భావించవచ్చు ఆ మహాసభ అనంతరం తెలంగాణా ప్రాంతానికి యు.టి.యఫ్. శరవేగంతో విస్తరించి బలాబలాల పొందికలో తీవ్రమార్పులకు అవకాశం కల్పించింది. ఆ మహాసభను బెంగాల్ ఉపాధ్యాయ ఉద్యమనేత సత్యప్రియరాయ్ ప్రారంభించగా దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత పుచ్చలపల్లి సుందరయ్యగారు నూతన దృక్పధానికి పునాదివేసే ప్రసంగం చేశారు.

## ఎన్నికలు

అనంతరం శాసనమండలి [illegible] నుండి ఎనిమిదమందిని ఎన్నుకోవలసి వచ్చింది. అత్యవసర పరిస్థితి కాలంలో 1976లో వచ్చిన ఈ ఎన్నికలలో శ్రీ ఎం. మాధవరావును యు.టి.ఎఫ్.

ఏకైక అభ్యర్థిగా నిలపగా ఉపాధ్యాయులు అపూర్వంగా ఆదరించి గెలిపించారు. అవకాశవాద విధానాలతో ఉద్యమాన్ని చిన్నాభిన్నం చేసిన శ్రీ సింగరాజును ఉపాధ్యాయులు తిరస్కరించారు. తర్వాత 1982లో జరిగిన ఎన్నికలలో యు.టి.ఎఫ్. అభ్యర్థిగా శ్రీ డి. రామిరెడ్డిని గెలిపించారు. శ్రీ సింగరాజు అభ్యర్థిని మార్చినా ఓటమిని తప్పించుకోలేకపోయారు. యు.టి.ఎఫ్. గుంటూరు నియోజకవర్గంలో శ్రీ ఎం.జె. మాణిక్యరావును, ఉభయగోదావరిజిల్లాలో శ్రీ శివరామరాజును నిలపగా అందరూ విజయం సాధించారు.

## రీగ్రూపింగ్ స్కేళ్ళ కోసం

ఎన్ని కమిటీలు వచ్చినా ఉపాధ్యాయుల జీతాలలో ఎదుగూబొదుగు లేని నేపథ్యంలో రీగ్రూపింగ్ వేతన విధానంపై యు.టి.ఎఫ్. నిర్దిష్టంగా 'ప్యాఫ్టో'లో ప్రతిపాదించింది. తొలుత కొందరు అభ్యంతరాలు చెప్పినా చివరకు అందరూ అంగీకరించారు. ఉపాధ్యాయులు చదివిన కాలాన్నిబట్టి వారి జీతాలు నిర్ణయించాలని, ఇంటర్ స్థాయివరకు ఒక కేడరు, డిగ్రీస్థాయి వరకు ఒక కేడరుగా మూడు గ్రేడులు చేయాలని యు.టి.యఫ్ సూచించింది. మార్చి అగ్రిమెంటులో ప్రభుత్వం అంగీకరించిన కోర్కెలు అమలు జరపడానికి వాయిదా వేయడాన్ని వ్యతిరేకిస్తూ 1982 డిసెంబర్ 17 నుండి సమ్మె మొదలైంది. ప్రభుత్వం డిసెంబర్ 17 అర్ధరాత్రి ఒప్పందానికి వచ్చి ఉపాధ్యాయులను మూడు క్యాడర్లు చేసి, రీగ్రూపింగ్ స్కేలును 1982 డిసెంబర్ 1 నుండి 1000 (యస్) జి.ఒ. ద్వారా అమలు జరిపింది. కృష్ణస్వామి పే కమిటీ ఉపాధ్యాయులు జీతాలు ఒక స్టేజికి పైన వుండాలంటే రీగ్రూపింగ్ వలన నాలుగు, ఐదు స్టేజీలు పెరిగాయి. దీనితో ఉపాధ్యాయుల వేతనాలలో గణనీయమైన మార్పు వచ్చింది. ఎన్.జి.ఒ.లకు ఇచ్చిన ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీం 10.15 సంవత్సరాల స్కేల్సు, ఉపాధ్యాయులు రీగ్రూపింగ్ స్కేల్సు ప్రాతిపదికగా సాధించుకున్న తర్వాత వారి స్కేల్స్ స్వరూపమే మారిపోయింది.

## ప్యాఫ్టోలో పెడధోరణులు - జాక్టా ఏర్పాటు

1972లో రూపుదిద్దుకొని అనేక విజయాల సాధనలో అగ్రభాగాన నిలిచిన 'ప్యాఫ్టో' రానురానూ ఉపాధ్యాయులకు హాని కలిగించే విధంగా 1986లో ప్రభుత్వం పిలిచినా చర్చలకు నిరాకరించడం, 1988లో ఎవరితోనూ సంప్రదించకుండా జె.సి.ఎ.లో చేరడం, సభ్యసంఘాలతో సంప్రదించకుండా పనిచేయడంవంటి పెడధోరణులకు లోనుకావడంతో తప్పనిసరి పరిస్థితులలో "జాక్టా" ఏర్పాటకు శ్రీకారం చుట్టాల్సివచ్చింది. యు.టి.ఎఫ్., ఎస్.టి.యు., ప్రైమరీ టీచర్స్ సంఘం, ప్రధానోపాధ్యా సంఘాలతో కలిపి "జాక్టా" ఏర్పడింది. అయినా ఉపాధ్యాయుల ప్రయోజనాల పరిరక్షణకోసం ప్యాఫ్టోతో కలిపి సంయుక్త కార్యాచరణలు చేపట్టింది.

## సి.సి.అర్.టి.యు. ఏర్పాటు

శ్రీ రాజాజీగారు యిచ్చిన సలహామేరకు ప్రభుత్వ గుర్తింపు పొందిన యు.టి.యఫ్., పి.ఆర్.టి.యు., ఎస్.టి.యు. ప్రయిమరీ టీచర్స్ సంఘాలు జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో ఉన్న సందర్భంలో చర్చలు ఎక్కువగా ఉపాధ్యాయుల సమస్యలపై ఎక్కువగా చర్చించే అవకాశం వుండదని, ప్రభుత్వ ప్రధానకార్యదర్శి ముందు డిపార్టుమెంటు అధికారులతో చర్చలు జరిపి అనేక సమస్యలు అక్కడికక్కడే పరిష్కరించుకోవచ్చుననీ, అప్పటికీ పరిష్కారంకానివి జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో చర్చించుకోవచ్చుననే విధానాన్ని యు.టి.ఎఫ్. అనుసరిస్తోంది. ప్రభుత్వ గుర్తింపు పొందిన పై నాలుగు సంఘాల సమన్వయం కోసం "కో-ఆర్డినేషన్ కమిటీ అఫ్ రికగ్నైజ్డ్ టీచర్స్ యూనియన్స్" (సి.సి.ఆర్.టి.యు) ఏర్పాటు అయింది. ఈ విధంగా ఇప్పటికి 11 సార్లు చర్చలు జరిగాయి. అనేక సమస్యలు పరిష్కారం అయ్యాయి. ఇటీవల 7, 10 తరగతుల స్పాట్ వాల్యూయేషన్ రేట్ల పెంపుదల సందర్భంగా పై సంఘాలు పోరాడి విజయం సాధించాయి.

హక్కులు-బాధ్యతలను రెండు నేత్రాలుగా భావించి ఉపాధ్యాయులు శ్రమించి విద్యార్థులకు బోధించాలనేది యు.టి.యఫ్. విధానం దీనికి తగినట్లుగా ఉపాధ్యాయులకు మార్గదర్శకంగా వుండేందుకు యు.టి.యఫ్. అకడమిక్ సెల్‌ను ఏర్పాటు చేసింది. ఈ సెల్ ఉపాధ్యాయులకు పీరియడ్ ప్లానులు, విద్యార్థులకు నమూనా ప్రశ్నాపత్రాలు రూపొందించడంలో అమోఘమైన కృషి చేస్తున్నది. ఆర్థిక భారంతో కూడిన కాన్వెంటుల మోజు నుండి తల్లిదండ్రుల దృష్టిని ప్రభుత్వ పాఠశాలలు, పంచాయతీరాజ్, మున్సిపల్, ఎయిడెడ్ పాఠశాలల వైపు ఆకర్షించే దిశగా ఈ సెల్ తన కృషిని కేంద్రీకరిస్తున్నది. ఒకానొక చారిత్రక దశలో ఏర్పడ్డ యు.టి.యఫ్. నిర్వహించిన కర్తవ్యాలు ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో నిలిచిపోయేవిగా ఉన్నాయి. కనుకనే ఆ సంస్థ నడుపుతున్న 'ఐక్యఉపాధ్యాయ' ఉపాధ్యాయరంగంలో 20 వేల సర్క్యులేషన్‌లో సాటిలేని మేటి పత్రికగా విరాజిల్లుతోంది.

# పేదల చదువుకు ఉరితాడు విద్యారంగ ప్రైవేటీకరణ

**- కె. కేశవరెడ్డి**

'మీ బిడ్డల బంగారం భవిష్యత్తుకు బాటలు వేయాలనుకుంటున్నారా?' -ఫలానా కాన్వెంట్‌లో చేర్పండి.

'ఉత్తమ శిక్షణకు, క్రమశిక్షణకు పెట్టింది పేరు - ఫలానా విద్యాసంస్థ.

'మీ బిడ్డలను డాక్టర్లను చేయలనుకుంటున్నారా? మీ కలల్ని నిజాలుగా మార్చే ఫలానా జూనియర్ కాలేజీలో చేర్పండి.'

"కొద్ది సీట్లే - త్వరపడండి ఆలసించిన ఆశాభంగం మంచితరుణం మించిపోతుంది." - లాంటి ప్రకటనలు విస్తృత ప్రచారంగల పత్రికలలో పూర్తి పేజీ ప్రకటనలుగా వస్తున్నాయి. వాటికితోడు వాల్‌పోస్టర్లు, పట్టణాల్లోనే కాక పల్లె పల్లెల్లో వీధి వీధినా సందుగొందుల్లో లౌడ్‌స్పీకర్ల హోరు.

ప్రచారం ఎంత ఎక్కువగా వుందంటే ఏదో ఒక ప్రైవేటు విద్యాసంస్థలో బిడ్డని చేర్పితీరాలని తల్లిదండ్రులను ఒప్పించేటంత తీవ్రంగా సాగుతుంది. ఎందుకీ ఆదరణ?

తల్లిదండ్రులు తమ బిడ్డలకు మంచి బట్టలు వేయాలనుకుంటారు. బిడ్డల ముద్దు, ముద్దు మాటలు విని ముచ్చట పడాలనుకుంటారు. తమకు రాని భాషలో రైమ్స్ చదువుతుంటే బిడ్డల్ని గురించి బంగారు కలలు కంటుంటారు. తమకు రానివి తమ బిడ్డలకు వచ్చేస్తుందని ఆనందం. ఇక చదువుకొని ఉద్యోగాలు చేసే తల్లిదండ్రులు కూడా తమ చిన్ననాటి చదువులు తమ బిడ్డలకు 3 ఏళ్ళ ప్రాయం నుండే చెప్పించగలుతున్నందుకు గర్వపడుతుంటారు. తమ ప్రత్యేక శ్రద్ధ వలన బిడ్డలు మంచి చదువులు చదివి పైకి వస్తారని కలలు గంటుంటారు. అంతేగాక షర్ట్ నిక్కర్, నెక్‌టై, స్కూల్ బేగ్స్‌తో తమ బిడ్డల్ని ఎక్కువ మంది కంటే పై స్థాయిలో వుంచటం వారికి తృప్తినిస్తుంది. వారి కలలను గిలకొట్టేందుకు కాన్వెంట్‌ల ప్రచారాలహోరు, ప్రకటనల జోరు సరేసరి. నేలపై వుండి కటువైన జీవిత వాస్తవాలను చూడడానికి మధ్యతరగతి మనస్తత్వం యిష్టపడదు. సమానాంతరంగా చూడడానికి యిష్టపడదు. ఎపుడూ దాని చూపునింగి కేసే. అంతేగాక పట్టణాలలో తగినన్ని పాఠశాలలు లేకపోవడం, ఆ వున్న కొద్ది పాఠశాలల్లో సీటు దొరకకపోవడంతో విధిగా ప్రైవేటు పాఠశాలలకు ఎగబడవలసి వస్తుంది.

## చారిత్రక పూర్వరంగం

స్వాతంత్ర్యానికి పూర్వం అప్పటి సంఘసంస్కర్తలు, స్వాతంత్ర పోరాటంలో పాల్గొన్న పెద్దలు విద్యయొక్క ప్రాధాన్యతను గుర్తించారు. అందరికీ చదువు చెప్పించాలన్నారు. విద్యాబోధన, పాఠశాలల, కళాశాలల నిర్వహణ ప్రభుత్వ బాధ్యతగా వుండాలన్నారు. సమగ్ర విద్యా చట్టాల కొరకు చట్టసభల లోపల వెలుపలా పోరాడారు. పాలనా నిర్వహణకు అవసరమైన యంత్రాంగాన్ని తయారుచేసుకొనే సంకుచిత లక్ష్యంతో నైనప్పటికీ బ్రిటిషు పాలకులు పరిమితంగా విద్యావ్యాప్తికి తోడ్పడ్డారు. విద్యను ప్రభుత్వ బాధ్యతగా స్వీకరించారు. స్వాతంత్ర్యం వచ్చింది. స్వతంత్ర భారతదేశంలో విద్య, వైద్యం యితర సౌకర్యాలు అన్నీ అందరికీ అందుబాటులోకి వస్తాయని ప్రజలు ఆశించారు. విద్యాలయాలు, ఆధునిక దేవాలయాలు అన్నారు తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ. రాధాకృష్ణన్ కమీషన్, మొదలియార్ కమీషన్, కొఠారి కమీషన్ లాంటి పలు కమీషన్‌లు నియమించబడ్డాయి. విద్యకు జాతీయ స్థూలదాయంలో 6 శాతం, కేంద్ర బడ్జెట్‌లో 10 శాతం నిధులు కేటాయంచాలని సూచనలు చేశాయి. కమీషన్ల సూచనల మేరకు నిధులకు కేటాయించబడలేదు. అంతేగాక కేటాయించిన నిధులకు కూడా కోతలు విధించబడ్డాయి. కమీషన్ల సిఫార్సులలోని అభివృద్ధికరమైన సిఫార్సులను ప్రభుత్వాలు విస్మరించాయి. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో నిర్దేశించిన 5-14 సం॥ల వయోపరిమితిలో వున్న బిడ్డలకు 1960 నాటికి సాధించాలన్న నిర్బంధ ప్రాథమిక విద్యాలక్ష్యాన్ని ఈ శతాబ్దాంతానికి కూడా పూర్తి చేయడం ఈ అరకొర నిధులతో సాధ్యపడదని గ్రహించిన ప్రభుత్వం సరికొత్త వాదనని రూపొందించింది. అదే రాజీవ్‌గాంధీ ప్రవేశపెట్టిన నూతన విద్యావిధానం.

## నూతన విద్యావిధానం

దేశ అభివృద్ధి పథంలో ముందుకు పోవాలంటే అభివృద్ధి చెందిన పారిశ్రామిక దేశాలకు ధీటుగా ఉత్పత్తులు పెంచాలనీ, పరిశ్రమలకు అవసరమైన శాస్త్ర సాంకేతిక నిపుణులను తయారు చేసుకునేందుకు వడపోత ద్వారా మెరికల్లాంటి బిడ్డలను ఎంపిక చేసుకొని క్రింద స్థాయిలో నవోదయ పాఠశాలలు, పైస్థాయిలో సెంటర్స్ ఆఫ్ ఎక్సలెన్సీలు స్థాపించి శిక్షణ యివ్వాలని, అందుకు విద్యారంగ నిధులలో అత్యధిక మొత్తాలను కేటాయించాలని నూతన విద్యావిధానం ప్రతిపాదించింది. నిర్బంధ ప్రాథమిక విద్య, అందరికి విద్యా లక్ష్యాలకు అనియత విద్య, దూరవిద్యల ద్వారా నెరవేర్చాల్సి ఉంది.

డాక్టర్లు, ఇంజనీర్లు కావాలనుకుంటున్న వారు వారి వారి స్వంత ఖర్చులతో చదువుకోవచ్చునన్నది ప్రభుత్వం. సాంకేతి నిపుణులు కావలసినవారు అంటే పారిశ్రామికవేత్తలు వారే ఇంజనీరింగ్ కాలేజీలు, పాలిటెక్నిక్ కాలేజీలు తెరచి యిష్టమొచ్చినంత ఫీజులు వసూలు చేసుకొని శిక్షణ యివ్వవచ్చునన్నది. ఈ విధంగా నూతన విద్యావిధానం ప్రైవేటీకరణకు సిద్ధాంతపరమైన సమర్థన నిచ్చింది.

## ప్రభుత్వ ప్రోత్సాహం

మెడిసిన్, ఇంజనీరింగ్, బి.వి.ఎస్.సి., బి.ఎస్.సి. (ఎ.జి.) పాలిటెక్నిక్, పోస్టు గ్రాడ్యుయేట్ సీట్లకొరకు ప్రభుత్వమే ఎంట్రన్స్ పరీక్షలు నిర్వహిస్తున్నారు. ఈ ఎంట్రన్స్ పరీక్షలకు నిలిచి సీట్లు సాధించాలంటే ప్రైవేటు ట్యూషన్స్ అవసరమనే భావాన్ని ప్రజలలో పెంచుతున్నది. అంతేగాక ప్రభుత్వమే క్రిందస్థాయి నుండి కొన్ని వడపోతలతో వారి కొరకు రెసిడెన్షియల్ స్కూల్స్, కాలేజీలు నడుపుతున్నది. వారికి ధీటుగా నిలిచి ఎంట్రన్స్ పరీక్షలలో నెగ్గుకురావాలంటే పెద్ద మొత్తాలు ఖర్చు పెట్టి ప్రత్యేక వసతులున్న రెసిడెన్షియల్ పాఠశాలలు కళాశాలల్లో చదివించాలనే ఆలోచనను ప్రజలలో కలిగిస్తున్నది. ప్రభుత్వం, ప్రైవేటు సంస్థలు నిర్వహించే పాఠశాలల్లో, కళాశాలల్లో సీట్లు రావాలంటే క్రింది స్థాయి నుండి కాన్వెంట్ చదువు, ప్రత్యేక ట్యూషన్లు అవసరమనే భావం ప్రబలిపోతున్నది. ఇలాంటి ప్రభుత్వ చర్యల వలన ప్రభుత్వ విద్యా వ్యవస్థకు సమానాంతరంగా ఒక పోటీ వ్యవస్థగా ప్రైవేటు వ్యక్తుల అధీనంలో వున్న విద్యారంగం ఎదుగుతున్నది. ఇది ప్రభుత్వ విద్యారంగానికి ఒక సవాల్‌గా పరిణమిస్తున్నది. దీనివలన కలిగే నష్టాలు దీర్ఘకాలిక స్వభావాన్ని కలిగి వుంటాయి. విద్యావ్యాపార కేంద్రాలలో తయారయ్యే విద్యార్థులు కూడా వాటి యజమానుల వలననే, తమ స్వార్థం, తమ ప్రయోజనాలు తప్ప సమాజాన్ని గురించి ఆలోచించే బాధ్యతాయుతమైన పౌరులుగా ఎదగలేరు. కాన్వెంట్లు, యితర ప్రైవేటు వ్యక్తుల ఆధీనంలో వున్న విద్యాసంస్థలు కలిగించే

నష్టం ఒక దశలో అధిగమించలేని స్థితికి చేరుకుంటుందని ప్రభుత్వం గుర్తించాలి.

### ప్రభుత్వ చర్యలలోని ఆంతర్యం

రెసిడెన్షియల్ పాఠశాలలు, రెసిడెన్షియల్ జూనియర్ కళాశాలలు నడపడం, సహకార రంగంలో జూనియర్ కళాశాలల్ని ప్రోత్సహించడం, అలాగే కాంట్రాక్ట్ పద్ధతిపై ఉపాధ్యాయుల నియామకం, గ్రామకమిటీలచే పారా టీచర్ల నియామకం లాంటి ప్రకటనలు రాష్ట్ర ప్రభుత్వం అనాలోచితంగా చేపడుతున్న చర్యలు కావు. కేంద్ర ప్రభుత్వం నిర్బంధ ప్రాథమిక విద్యా లక్ష్యాన్ని గాలికి వదలడం, నవోదయ పాఠశాలల్ని నిర్వహించడం, డిగ్రీలకు ఉద్యోగాలకు సంబంధం తెగగొట్టాలనడం వగైరాలు యాదృచ్ఛికంగా చేపడుతున్న చర్యలుగా ఇవి విద్యారంగంలో ప్రైవేటీకరణకు ప్రభుత్వాలు చేపడుతున్న చర్యలుగా గమనించాలి.

నిపుణతకు ఒక తరంవారు తరువాత తరానికి అందజేసే సాధనం విద్య. సమాజం యొక్క అవసరాలకు సరిపడే ఉత్పత్తులను నిరంతరం నిరాటంకంగా చేయించే సాధనం విద్య. అంతేగాక సమాజాభివృద్ధికి తోడ్పడే విధంగా వ్యక్తియొక్క ప్రవర్తనా విధానాన్ని తీర్చిదిద్దేది విద్య. ప్రక్కవాని మెడమీద కత్తిపెట్టి ముందుకు పోవాలనే ధోరణిలో సాగుతున్న విద్యాబోధన, విద్యాభావం, సమాజ పురోగతికి అడ్డురాళ్ళుగా పరిణమిస్తున్నాయి.

### విద్య - సామాన్యులకు అందని మానిపండు

ప్రస్తుతం ప్రభుత్వ విద్యాసంస్థలు, ప్రైవేటు పాఠశాలలు సమాంతరంగా నడుస్తున్నాయి. ప్రభుత్వ ఉదాసీన వైఖరి, ప్రజలకు కల్పించబడిన భ్రమల కారణంగా ప్రైవేటు పాఠశాలలు యింకా అభివృద్ధి చెందితే విద్య సామాన్యులకు అందుబాటులో వుండదు. అందని మాని పండవుతుంది. సంపన్నుల పంచజేరుతుంది. కారణం చాలా స్పష్టమే. ఎల్.కేజీ నుండి ఇంటర్ మీడియట్ వరకు ప్రైవేటు విద్యాసంస్థలు వసూలు చేసే ఫీజులు యిప్పటికే మధ్యతరగతి ప్రజలకు అందుబాటులోలేవు. వారు ఎన్నో త్యాగాలు చేసి వారి బిడ్డల్ని చదివిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలల్ని నిర్వీర్యపరిస్తే విద్య పేద, మధ్యతరగతి ప్రజానీకానికి దూరమవుతుంది.

### ఉపాధ్యాయుల కర్తవ్యం

ప్రభుత్వ పాఠశాలల్లోని ఉపాధ్యాయులు సరిగా పనిచేయలేకపోవడం వలననే ప్రైవేటు విద్యాసంస్థలు కుప్పలు తెప్పలుగా పుట్టుకు వచ్చి అవి అభివృద్ధి చెందుతున్నాయనే విమర్శ వున్నది. ఈ విమర్శలలో పాక్షికంగానైనా సత్యం లేకపోలేదు. పాఠశాలలకు కనీస వసతులు కల్పించలేకపోవడం, ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తిని విద్యా కమీషన్ల రిపోర్టుల ననుసరించి అమలు జరపకపోవడం లాంటి ప్రభుత్వపరమైన లోపాలున్నప్పటికీ, ఉన్న పరిస్థితులలోనే చిత్తశుద్ధిగా పనిచేయవలసిన అవసరం, బాధ్యత ఉపాధ్యాయులపై వున్నది. హక్కులు, బాధ్యతలు రెండు కళ్ళవంటివి. రెంటికీ సమాన ప్రాధాన్యత వున్నది. బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించినప్పుడే హక్కుల కొరకు పోరాడేస్థాయి వుంటుందని ఉపాధ్యాయులు గమనంలో వుంచుకోవాలి. విద్యను ప్రైవేటీకరించడం వలన పేద మధ్య తరగతి ప్రజానీకానికి దూరమవుతుందని వారికి అర్థమయ్యేరీతిలో చెప్పాలి. ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఉపాధ్యాయులు సంఘటితంగా పోరాడాలి. విస్తృత ప్రజానీకం యొక్క సహకారాన్ని పొందాలి.

# చెన్నుపాటి సారథ్యంలో ఐక్యంగా సాగిన పోరాటాలు

సంఘం పెట్టుకునే హక్కు, సమ్మె హక్కు ఆనాడు మహాపాతకంగా పరిగణించబడింది. నిర్దిష్టమైన పనిగంటలు లేవు. అడుగడుగునా బెదిరింపులు... లాఠీలు.... జైళ్ళు..... ఇదీ ఆనాటి పరిస్థితి. స్వాతంత్ర్యానికి పూర్వమున్న దుస్థితి ఇది. స్వాతంత్ర్యానంతర పాలనలో కూడా వారు నిర్బంధాలకు, అణచివేతకు గురయ్యారు. ఈ దోపిడి-పీడనల నుండి విముక్తి కోసం ప్రజలందరితోపాటు ఉపాధ్యాయులూ తమ హక్కుల కోసం వీధుల్లోకొచ్చారు. లాఠీ దెబ్బలకు, బెదిరింపులకు భయపడక మరింత స్ఫూర్తితో ఉపాధ్యాయులు ఉద్యమించారు. సంఘటిత శక్తికి తిరుగులేదని, ఐక్యపోరాటానికి పాలకులు తలవంచక తప్పదని వారు నిరూపించారు. బానిసత్వం క్రింద నలిగిపోతున్న ఉపాధ్యాయులకు అప్పటికే ఊపందుకున్న ప్రజా పోరాటాలు దారిచూపాయి.

అప్పుడే ఉపాధ్యాయ ఉద్యమం అంకురించింది. వేరు వేరు మేనేజిమెంట్లు, జీతాలు, చట్టాలు ఉపాధ్యాయుల ఐక్యతకు అడ్డుగా వుండటంతో తొలుత మేనేజిమెంట్ల వారీ సంఘాలను స్థాపించి పాలకులకు తమ సమస్యలను విజ్ఞాపనల ద్వారా తెలియజేశారు. వీటితో పాలకులు దిగిరాకపోవడంతో ఉపాధ్యాయులు విసుగుచెంది ప్రత్యక్ష పోరాటాలకు దిగారు. 1939లో మలబారు జిల్లా ఎయిడెడ్ ఉపాధ్యాయ సంఘం పోరాట బావుటా ఎగురవేసింది. సమ్మె పోరాటానికి దిగి స్కూళ్ళన్నింటినీ మూసి వేయించి ప్రజల అండతో నిర్విఘ్నంగా తమ పోరాటాన్ని కొనసాగించింది. పోరాటం చేస్తున్న ఉపాధ్యాయులను ప్రభుత్వం అనేక నిర్బంధాలకు గురిచేసింది. అనేకచోట్ల పోరాటాలు ఊపందుకున్నాయి. వేలాదిమంది ఉపాధ్యాయులు వీధుల్లోకి రావడం, వీరి ఆందోళనకు పత్రికలు, ప్రజలు కూడా మద్దతు తెలుపడంతో ప్రభుత్వం గంగవెర్రులెత్తింది. ఉపాధ్యాయులకు సంఘాలే పనికిరావన్న ప్రభుత్వం దిగివచ్చి జీతాలు పెంచుతూ, సంఘాలు స్థాపించుకోవచ్చుననే విధానానికి అంగీకరించక తప్పలేదు. ఈ నేపథ్యంలో ఉపాధ్యాయులు 1939 నుండి 46 వరకు ఆ సంఘాల ద్వారానే, ఆ పరిమితులలోనే తమ కోర్కెలను సాధించుకోసాగారు. కానీ ప్రభుత్వం వారి కోర్కెలలో ముఖ్యమైనవాటిని అంగీకరించలేదు. పైగా వేరు వేరు సంఘాల వారు వేర్వేరు కోర్కెలు కోరడంతో ప్రభుత్వం ఎగనామం పెట్టేందుకు దీనిని అవకాశం తీసుకుంది. ఏ సంఘమైనా కాస్త గట్టిగా ఆందోళన చేస్తే దాని రికగ్నిషన్ రద్దు చేసేవారు. అయినా ఉపాధ్యాయులు వెనుకంజ వేయక పాలకుల ఎత్తులను చిత్తుచేసి ఐక్యంగా పోరాడేందుకు బలమైన సంఘ నిర్మాణం అవసరమైని తలందారు.

అందులో భాగంగానే 1944లో తూర్పుగోదావరి జిల్లా తాపేశ్వరంలో రాష్ట్రస్థాయి ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ పేరుతో రాష్ట్ర సంఘాన్ని నిర్మించుకున్నారు. కానీ ప్రభుత్వ జి.ఒ.కు వ్యతిరేకంగా సంఘాన్ని స్థాపించారనే పేరుతో కార్యకర్తలందరిపై చర్యలు తీసుకోబడతాయని ప్రభుత్వం ప్రకటించింది. ప్రభుత్వం బెదిరింపులతో ఆ సంఘ నిర్వాహకులు సంస్థ కార్యకలాపాలను నిలిపివేశారు. 1946లోనూ, 1947వ సంవత్సర ప్రారంభంలోనూ జరిగిన పోస్టల్, రైల్వే ఉద్యోగుల సమ్మె - సాధించిన విజయాల ప్రభావం ఉపాధ్యాయ వర్గంపై కూడా పడింది. బ్రిటిష్ పాలకులు భారతీయులకు అధికార ప్రదానం చేయబోయే సంధికాలమది. ఈ కాలంలో చెలరేగిన ప్రజా ఉద్యమాలు కొంతమేరకైనా సఫలీకృతం కాగలిగాయి. ఇదే సమయంలోనే గుంటూరు తాలూకా ఎయిడెడ్ టీచర్ల యూనియన్ తరపున రాష్ట్రంలోని వివిధ ఉపాధ్యాయ తాలూకా యూనియన్ ప్రతినిధులను ఆహ్వానించి 1947 ఫిబ్రవరిలో సమావేశం జరిపారు. ఈ సమావేశం ఉపాధ్యాయ ఉద్యమానికి ఓ మూల మలుపువంటిది. వివిధ సంఘాల క్రింద చీలిపోయివున్న ఉపాధ్యాయులందరినీ ఒకే త్రాటిపైకి తెచ్చి ఐక్యఉపాధ్యాయ ఉద్యమాన్ని నిర్మించాలని సమావేశం నిర్ణయించింది. ఏ జి.ఒ.ను సృష్టించి ఉపాధ్యాయుల సంఘ స్వేచ్ఛను హరించపూనుకున్నారో ఆ జి.ఒ.ను పాతిపెట్టి సంఘ స్వాతంత్ర్యాన్ని స్థాపించాలని ఆ సమావేశం ఏకగ్రీవంగా నిర్ణయించింది. రాష్ట్రంలోని అన్ని మేనెజిమెంట్ల క్రింద వున్న ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యం వహించే శక్తివంతమైన సంఘాన్ని స్థాపించేందుకుగాను శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్య అధ్యక్షులుగాను, శ్రీ పి. రామసుబ్బయ్య కార్యదర్శిగా ఒక ఆర్గనైజింగ్ కమిటీని ఎన్నుకున్నారు. ఉపాధ్యాయలోకానికి ఐక్య ఉపాధ్యాయ ఉద్యమనిర్మాణ సన్నాహాలు ఉత్సాహాన్ని, ఊపును యిచ్చాయి. 1947 ఏప్రిల్‌లో ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ తొలి మహాసభ గుంటూరులో 1500 మందితో జరిగింది. బ్రహ్మాండంగా జరిగిన ఈ మహాసభలో బలమైన రాష్ట్ర సంఘం నిర్మించబడింది. ఆ సభలో ప్రసంగించిన శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావు, శ్రీ గాడిచర్ల సర్వోత్తమరావులు ఉపాధ్యాయులు సమ్మెకు దిగి అయినా తమ హక్కులు సాధించుకోవాలని ఉత్తేజపరిచారు.

1947 మార్చి 1వ తేదీన మద్రాసులో జరిగిన మద్రాసు రాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ మహాసభ 1947 జూన్ 27లోగా ప్రభుత్వం ఉపాధ్యాయుల కనీస వేతనం రు. 50లుగా నిర్ణయించకపోతే రాష్ట్రవ్యాపితంగా సమ్మె చేయాలని ఏకగ్రీవంగా తీర్మానించింది. మార్చి నుండి జూన్‌వరకు ఉపాధ్యాయులు వివిధ రకాలు ఆందోళనలు నిర్వహించారు. అన్ని పార్టీల నాయకులు ఉపాధ్యాయుల కనీస కోర్కెలను తీర్చాలని ప్రభుత్వాన్ని కోరారు. అయినా సమ్మెను కఠినంగా అణచివేస్తానని బెదిరించింది. బెదిరింపులకు పాల్పడినా, ఉపాధ్యాయులకు రైతులకు, విద్యార్థులకు - ఉపాధ్యాయులకు, మధ్య విభేదాలు పెంచేలా పాచికలు వేసినా అవేవీ పారలేదు. ఉపాధ్యాయ వర్గం బ్రహ్మాండంగా కదిలి సమ్మెకు సర్వసన్నాహాలూ సిద్ధం చేసింది. ప్రజల, ప్రజానాయకుల, ప్రజాసంఘాల, పత్రికల సహకారంతో సాగిన ఉపాధ్యాయ ఉద్యమం ప్రభుత్వాన్ని కుదిపివేసింది. ఇక వేరే దారిలేక ప్రభుత్వం ఉపాధ్యాయుల కోర్కెలు న్యాయమైనవేనని, వాటిని పరిష్కరిస్తామని ప్రకటించింది. 1947 జూన్ 5న జీతాలు పెంచుతూ ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. ఉపాధ్యాయుల ఐక్యపోరాటం వల్ల వేతనాలు పెంచుకోవడం ఆంధ్ర ఉపాధ్యాయుల చరిత్రలో ఇదే ప్రథమం. పైకి ఉపాధ్యాయుల కోర్కెలను ఆమోదిస్తామని చెప్పిన ప్రభుత్వం ఆచరణలో విద్యాశాఖాధికారులలో సమ్మెకు వ్యతిరేకంగా ప్రచారం చేసి ఉద్యమంలో పాల్గొన్న ముఖ్యులందరిపై చర్యలు తీసుకొమ్మంటూ ఉత్తర్వులు జారీ చేసింది. విద్యార్థుల ఫీజులు పెంచి తద్వారా ఉపాధ్యాయులను వారికి దూరం చేయ ప్రయత్నించారు. సమ్మెను విరమించి ప్రభుత్వానికి అవకాశమిచ్చి వేచి చూడాలన్న పత్రికల, ఇతర పెద్దల సలహా మేరకు సమ్మెను వాయిదా వేశారు. సమ్మె వాయిదా అనంతరం మిగిలిన కోర్కెలన్నింటినీ ప్రభుత్వమే నెరవేర్చుతుందన్న భ్రమలో ఉన్న వారిని మరలా పోరాటోన్ముఖులను చేయాల్సిన కర్తవ్యం ఉపాధ్యాయ ఉద్యమంపై పడింది. ఉపాధ్యాయుల్లో అవరించిన భ్రమలను, నిస్తబ్దతను తొలగించేందుకు సంఘం దీర్ఘకాలం కృషి చేయాల్సి వచ్చింది. కేవలం ఆర్థిక పోరాటాలకే పరిమితం కాకుండా సంఘ నిర్మాణాన్ని పెంపొందించుకునేందుకు కూడా కృషి చేయాల్సి వచ్చింది. ఉపాధ్యాయ ఫెడరేషన్ కమ్యూనిస్టులదని నిందారోపణలు చేసి అసలు సమస్యను కప్పిపుచ్చ యత్నించారు. విద్యాశాఖమంత్రి ఉపాధ్యాయులపై సాగిస్తున్న అసత్య ప్రచారాలను త్రిప్పికొట్టడానికి, ఉపాధ్యాయుల సమస్యలను ఎత్తి

చూపడానికి, వారి వాదనను వినిపించడానికి ఉపాధ్యాయపత్రిక అవసరమని భావించి 1948 ఫిబ్రవరిలో ఉపాధ్యాయ పత్రికను స్థాపించారు. "ప్రతి టీచరూ ప్రతినెలా తాను కమ్యూనిస్టును కాదని, కమ్యూనిజాన్ని స్కూలులో బోధించడం లేదని గ్రామ మునసబు వద్ద నుండి సర్టిఫికెట్ తెస్తేనే ఆ నెల జీతంగాని, గ్రాంట్ గాని చెల్లించబడదనే' ప్రభుత్వ ఉత్తర్వుకు వ్యతిరేకంగా తీవ్రపోరాటం నడపాల్సివచ్చింది. ఎడతెగని ఆందోళనతో ఆ ఉత్తర్వును పాలకులు రద్దుచేయక తప్పలేదు. గ్రామాల్లోని కొందరు స్వార్థపరులు ఉపాధ్యాయులకు కమ్యూనిస్టులుగా చిత్రీకరించి అరెస్ట్ చేయిండం, కేసులు పెట్టించడం, సర్టిఫికెట్లను రద్దు చేయించడం, ఉద్యోగాల నుండి తొలగించడం వంటి వేధింపు చర్యలను పత్రిక చీల్చి చెండాడింది. దీంతో ప్రభుత్వం ఉధృతాన్ని తగ్గించింది. అచ్చంగా పోలీస్ రిపోర్టుతోనే శిక్షించడం మాని, విద్యాశాఖతో కూడా విచారణ జరిపించాలని ఉత్తర్వులు జారీ చేయించగలిగింది ఉపాధ్యాయ సంఘం. ఈ కృషి వల్ల ఎందరో ఉపాధ్యాయులు పోలీసువాత బడకుండా రక్షించబడ్డారు. అలాగే కొందరు విద్యాధికారుల లంచగొండితనానికి, జిల్లా బోర్డుల అక్రమాలకు వ్యతిరేకంగా కూడా సంఘం పోరాడి వాటిని కొంతమేరకు నివారించగలిగింది. రోజురోజుకూ ఉపాధ్యాయుల అభిమానాన్ని చూరగొంటున్న ఉపాధ్యాయ సంఘాన్ని విచ్ఛిన్న చేయడానికి కొందరు స్వార్థపరులు, మేనేజర్లు కలిసి పోటీ సంస్థను స్థాపిస్తున్నామని ఆర్భాటంగా ప్రచారం చేసినా, కాంగ్రెసు నాయకులు దానిని భుజాన వేసుకున్నా పట్టుమని పాతికమందిని కూడా సమీకరించలేకపోయారు.

ఉపాధ్యాయులను దైనందిన కోర్కెల నుండి పక్కదారి పట్టించడానికి పాలకులు పథకం వేశారు. అమాల్గనేషన్ స్కీంపేరుతో నిర్బంధ విద్యావిధానాన్ని తొలగించి వందలాది మంది ఉపాధ్యాయులను నిరుద్యోగులుగా మార్చింది. ఉన్నవారికి పనిభారం పెరిగింది. ఉపాధ్యాయులు అసమర్థులనే నెపంతో వారిని తొలగించడం, సస్పెండ్ చేయటం, జరిమానాలు విధించడం లాంటి అధికారాలను స్థానిక సంస్థలకు ప్రభుత్వం అప్పజెప్పింది. పస్తులతో తాళలేక జీతాలు పెంచమని అడిగిన వారిని కమ్యూనిస్టులుగా చిత్రించబూనుకున్నారు. ఈ విధంగా ఉద్యమాన్ని నీరుగార్చడానికి అన్నివైపులా దాడి ప్రారంభమైంది. సమస్యలను పరిష్కరించకపోగా కష్టాలను నివేదించుకొనే సంఘాలు కూడా వుండరాదంటూ సంఘ స్వాతంత్ర్యాన్నే హరించబూనుకున్నారు. సంఘ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకునేందుకు హైకోర్టుకు వెళ్ళాలని సంఘం నిర్ణయించింది. ఇది ఉపాధ్యాయ చరిత్రలో కనీవినీ ఎరుగని ఘట్టం.

8 నెలల అనంతరం న్యాయమూర్తులు తీర్పు చెపుతూ ఉపాధ్యాయులకు కూడా వాక్, సభా, సంఘ, పత్రికా స్వాతంత్ర్యాలున్నాయని విశదపరిచారు. ఫెడరేషన్‌పై జారీ చేసిన ఉత్తర్వులు రాజ్యాంగ చట్టంలోని సంఘం స్వాతంత్ర్యాన్ని భగ్నపరుస్తున్నాయని. కావున అవి చెల్లవని స్పష్టం చేశారు. ఈ తీర్పు అనంతరం సంఘ స్వేచ్ఛకై ఎదురుచూస్తున్న వేలాదింది ఉపాధ్యాయులు ఉత్సాహంతో కార్యరంగంలోకి దిగారు. వేరు వేరు మేనేజిమెంట్ల క్రింద ఉన్న ప్రాథమిక పాఠశాలలకు ఒకే మేనేజ్‌మెంట్ క్రిందికి తీసుకురావడానికి కూడా ఫెడరేషన్ ఆధ్వర్యంలో ఉపాధ్యాయులు ఐక్యంగా సాగించిన కృషే ఇందుకు కారణం. జీతాల పెంపుకు, సరాసరి హాజరుశాతం తగ్గింపుకు 1957లో అప్పటి విద్యాశాఖమంత్రి అంగీకరించకపోవడంతో ఫిబ్రవరి 14న ఒకరోజు నిరాహారదీక్షకు ప్రభుత్వ బెదిరింపులను లెక్క చేయక 35 వేలమంది ఉపాధ్యాయులు నిరాహారదీక్షలో పాల్గొన్నారు. ఈ విధంగా అనేక పోరాటాలలో ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ప్రతి సందర్భంలోనూ బెదిరింపులకు, వేధింపులకూ గురయ్యారు. అయినా సంఘం కార్యకర్తల వెన్నంటి వుండివారిని చైతన్య పరచి పోరాటోన్ముఖులుగా తీర్చిదిద్దింది. ప్రతి పోరాటమూ వారికి అనేక అనుభవాలను నేర్పింది.

# కర్తవ్య నిర్వహణకు సంకెళ్ళుగా ఉపాధ్యాయుల సమస్యలు

**- కె. జోజయ్య**

"దేశ భవిష్యత్తు తరగతి గదుల్లోనే రూపుదిద్దుకుంటుంది' అని కొఠారి కమిషన్ తన నివేదికలో పేర్కొన్నది. దానిని బట్టే తరగతి గది ప్రాధాన్యతనూ, ఆ తరగతి గదిని నిర్వహించే ఉపాధ్యాయుని ప్రాముఖ్యతనూ అర్థం చేసుకోవచ్చు. కనీస వసతులు కరువైన తరగతి గదులు సాధారణంగా మనకు దర్శనమిస్తుంటాయి. ఆ గదులలోనే ఉన్నత ప్రమాణాలను సాధించాలని, అది ఉపాధ్యాయుని బాధ్యతని చాలా మంది చాలా సందర్భాలలో చెప్తుంటారు. మెరుగైన విద్యా ప్రమాణాలను సాధించడంలో ప్రధాన భూమిక నిస్సందేహంగా ఉపాధ్యాయునికి వున్నది.

అయితే ఆ భూమికను వృత్తిలో నిమగ్నమై ప్రశాంతంగా నిర్వర్తించే పరిస్థితులు ఉపాధ్యాయునికి కల్పించవలసి వున్నది. విద్యార్థులకు నిత్యం ధర్మాసూత్రాలు బోధించే ఉపాధ్యాయుణ్ణి సహితం అందుకు భిన్నమైన పరిస్థితులు చుట్టు ముట్టి, ఉక్కిరిబిక్కిరి చేస్తూ పరీక్షకు నిలబెడుతున్నాయి. అధికార, అనధికార వర్గాల అంతులేని అవినీతి, అధికార దర్పం అతణ్ణి "వెన్నుముకలేని మానువుని"గా మారుస్తూ అతని నిజాయితీని పరీక్షకు పెడుతున్నాయి. ఈ విధంగా నిత్యం సమస్యలతో సతమతమయ్యే ఉపాధ్యాయుడు ఆశించిన స్థాయిలో బాధ్యతలను నిర్వర్తించాలనుకోవడం, విద్యా ప్రమాణాలు మెరుగవ్వాలనుకోవడం అత్యాసే అవుతుంది. అందుచే ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యల స్వభావాన్ని, వాటి పరిష్కార మార్గాలనూ పరిశీలించవలసిన అవసరముంది.

విద్యారంగం ఎదుర్కొంటున్న మౌళిక సమస్యలు ఉపాధ్యాయ సమస్యలను తప్పక ప్రభావితం చేస్తాయి. సరళీకృత ఆర్థిక విధానాల ప్రభావంతో విద్యారంగ ఖర్చును అనుత్పాదకమైనదిగాభావించడం, కేటాయింపులను తగ్గించడం, పోస్టులను సకాలంలో నింపకపోవడం, సౌకర్యాలపై కోత విధించడం వంటివి జరుగుతున్నాయి. ఆ కారణంగానే ఉపాధ్యాయుల సమస్యలు దీర్ఘకాంగా అపరిష్కృతంగా వుండటం, ఉపాధ్యాయులలో అనాసక్తత ఏర్పడటం జరుగుతోంది. ఈ పూర్వ రంగంలో మొత్తం ఉపాధ్యాయుల సమస్యలను 1) వృత్తిపరమైన సమస్యలు, 2) ఆర్థికపరమైన సమస్యలు, 3) సామాజికపరమైన సమస్యలుగా వర్గీకరించి పరిశీలించవలసి వున్నది.

## వృత్తిపరమైన సమస్యలు

విస్తరిస్తున్న విజ్ఞానాన్ని, మారుతున్న సిలబస్‌ను "నిత్య విద్యార్థిగా" ఉపాధ్యాయుడు అధ్యయనం చేయవలసి వుంది. అందుకు అవసరమైన సమాచారాన్ని ఉపాధ్యాయునికి అందించడంతోపాటు నూతన పాఠ్యపుస్తకాలను ప్రవేశపెట్టే ముందుగా సిలబస్‌ను ఉపాధ్యాయులకు అందివ్వడం, పునఃశ్చరణ (ఓరియంటేషన్) తరగతులను నిర్వహించడం అవసరం. అలా చేయకపోవడం వలన ఉపాధ్యాయుని వృత్తి నైపుణ్యం సన్నగిల్లుతోంది.

ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తికి అనుగుణంగా పోస్టులను సృష్టించకపోవడం, ఖాళీలను సకాలంలో నింపకపోవడం జరుగుతోంది. దీని వలన ఉపాధ్యాయుని పనిభారం పెరిగి సక్రమ బోధన చేసేందుకు అటంకం కలుగుతోంది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే మన రాష్ట్రంలో ఇంకా 70 వేల ఉపాధ్యాయుల పోస్టులు సృష్టించవలసి వున్నది.

మారుతున్న సిలబస్‌కు అనుగుణంగా బోధన సులభంగానూ, విద్యార్థులకు సులభ గ్రాహ్యంగానూ వుండేందుకు పాఠశాలలకు తగినన్ని సౌకర్యాలను కలుగజేయవలసి వుంది. అవసరమైన కొన్ని బోధనోపకరణాలను సరఫరా చేస్తూనే ఉపాధ్యాయుడు మరికొన్నింటిని తయారు చేయుటకు అవసరమైన ముడిసరుకును అందివ్వాలి. గత నాలుగు సంవత్సరాలనుండి కనీసం సుద్ద ముక్కలకు కూడా కంటింజెంట్ గ్రాంటు యివ్వకపోవడం గమనార్హం.

కొందరు ఉపాధ్యాయులను కనీస సౌకర్యాలు లేని పాఠశాలల్లోనూ, గ్రామాలలోనూ దీర్ఘకాలం కొనసాగించడం వలన వారిలో నైరాశ్యం, అనాసక్తత చోటు చేసుకొంటున్నాయి. వాటిని తొలగించేందుకు శాస్త్రీయమైన బదిలీల కోడ్‌ను రూపొందించి ఉపాధ్యాయులందరూ అన్ని రకాల ప్రాంతాలలో, అన్ని రకాల ప్రాంతాలలో, పనిచేసే అవకాశం కల్పించాలి. ఉపాధ్యాయుల పనివిధానాన్ని, బోధనను పర్యవేక్షిస్తూ మెరుగైన బోధనకు తగిన సూచనలివ్వడానికి పర్యవేక్షణా వ్యవస్థ సరిగా లేకపోవడం కూడా ఒక లోపం. దానిని సరిచేయడానికి తగినన్ని పర్యవేక్షణాధికారుల పోస్టులను సృష్టించడంతోపాటు ఖాళీగా వున్న పోస్టులను క్రమం తప్పకుండా నింపవలసి వున్నది.

రామకృష్ణారావు కమిటీ సిఫారసులలో ఒకటైన "పారా టీచర్స్" వ్యవస్థను ప్రవేశపెట్టబోతున్నట్లు ముఖ్యంమంత్రి వ్యయంగా యిటీవల ప్రకటించారు. కనీస అర్హతల లేని వారిని కూడా పారా టీచర్స్ పేరుతో నియమించబూనుకోవడం ఉపాధ్యాయ వృత్తిని మరింత దిగజార్చడమే అవుతుంది.

## ఆర్థికరమైన సమస్యలు

అధికారుల అలక్ష్యం, ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా దీర్ఘకాలంగా అపరిష్కృతంగా వుండి, ఉపాధ్యాయులను అందోళనకు గురిచేస్తున్న న్యాయమైన సహేతుకమైన సమస్యలు అనేకం వున్నాయి. వాటికి తోడు ప్రభుత్వమే ఆర్థిక దోపిడీకి పూనుకోవడం వలన యిటీవల ఉత్పన్నమవుతున్న సమస్యలు మరికొన్ని వున్నాయి

వినియోగదారుల ధరల సూచికకు అనుగుణంగా కేంద్ర ప్రభుత్వోద్యోగులతో సమానంగా ఎప్పటికప్పుడు కరువుభత్యాన్ని చెల్లించడం లేదు. కేంద్ర ప్రభుత్వం నుండి ప్రత్యేక గ్రాంటు లభిస్తున్నా ఏజన్సీ ప్రాంతాలలోని ఉపాధ్యాయులకూ, ఉద్యోగులకూ ప్రత్యేక గ్రాంటు లభిస్తున్నా ఏజన్సీ ప్రాంతాలలోని ఉపాధ్యాయులకూ, ఉద్యోగులకూ ప్రత్యేక అలవెన్సులను 1996 మార్చి నుండి కొనసాగించకపోవడం, అప్రెంటిస్ టీచర్లు అనే క్రొత్త పేరు తగిలించి వారికి రూ. 1,2000/1,500లు నిర్ణీత వేతనం చెల్లింస్తుడటం ప్రభుత్వ

బహిరంగ దోపిడీకి ఒక నిదర్శనం. దేశంలో ఏ రాష్ట్రంలో లేని విధంగా మన రాష్ట్రంలోనే కేవలం విద్యాశాఖలోని ఉపాధ్యాయుల నియమామకంలో మాత్రమే ప్రవేవపెట్టబడినదీ; దోపిడీ విధానం. పోస్టులేమో రెగ్యులర్‌వి. పేమెంటేమో ఇర్రెగ్యులర్. ఈ క్రమంలోనే మరో దారుణమైన విషయాన్ని పేర్కొనాలి. అది ఓ.బి.బి. పోస్టులకు కేంద్ర ప్రభుత్వం నుండి పొందుతున్న గ్రాంటులో సగం మాత్రమే ఆ పోస్టులలో పనిచేస్తున్న అప్రెంటిస్ టీచర్లకు చెల్లిస్తుండటం. ఇదీ ప్రభుత్వం చేస్తున్న "గౌరవప్రదమైన దోపిడి"

బడ్జెట్ కంట్రోలు పేరుతో ఎయిడెడ్ ఉపాధ్యాయులకు జీతాలను ప్రతి నెలా అలస్యంగా చెల్లించడం లేక రెండు, మూడు మాసాలకు ఒకసారి చెల్లించడం జరుగుతోంది. 1993 పి.ఆర్.సి. బకాయిలను ఎయిడెడ్ ఉపాధ్యాయులకు నేటికీ చెల్లించడం లేదు. మున్సిపల్ ఉపాధ్యాయుల జీతాల చెల్లింపులో సంక్లిష్టంగా వున్న విధానాన్ని సులభతరం చేయలేదు. ఇతర రాష్ట్రాలలో లేని వృత్తిపన్ను ఒక్కసారిగా పెద్ద ఎత్తున పెంచబడింది. పనిదినాల ప్రాతిపదికగా ఉపాధ్యాయులకు సంవత్సరానికి కనీసం 20 రోజులు సంపాదిత సెలవును జమ చేసేందుకు ఉత్తర్వులివ్వడం లేదు. హామీ యిచ్చి కూడా స్పెషల్ టీచర్ల, హాఫ్.ఎ. మిలియన్ టీచర్ల సర్వీసును అటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీముకు, పెన్షన్ స్కీముకు పరిగణిస్తూ ఉత్తర్వులివ్వలేదు. వృత్తి విద్యా ఉపాధ్యాయులకు టైం స్కేలును యివ్వలేదు. ప్రధాన నగరాలలో యితర ఉద్యోగులకున్న బస్‌పాస్ సౌకర్యాన్ని ఉపాధ్యాయులకు కల్పించలేదు. ఆదనపు యింక్రిమెంట్లు, కు.ని. ఇంక్రిమెంట్లు వంటి స్పెషల్ పే/పర్సనల్ పేలపై చెల్లిస్తున్న డి.ఎ., హెచ్. ఆర్.ఎలను రద్దుచేసింది. ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీములో వుండి ప్రమోషన్‌ను పొందిన వారికి ఎఫ్.ఆర్. 22 బి సౌకర్యాన్ని రద్దుచేసింది. వ్రాసుకుంటూపోతే యిలాంటి సమస్యలు ఎన్నో..... ఎన్నెన్నో వున్నాయి.

## సామాజిక సమస్యలు

స్వాతంత్ర్యం వచ్చి యిన్నేళ్ళయినా షెడ్యూల్డ్ కులాలు, తెగల నుండి వచ్చిన ఉపాధ్యాయులు సమాజంలో నేటికీ వివక్షతకు గురౌతున్నారు. ముఖ్యంగా గ్రామ సీమల్లో గృహవసతి పొందటం వారికి ఒక సమస్యగానే వున్నది. సమాజిక విలువల కన్నా, విద్యాగంధం కన్నా ఆర్థికానికి హారతిపడుతున్న నేటి సమాజంలో ఉపాధ్యాయుని పట్ల ఆదరణ, గౌరవం సన్నగిల్లడం జరగుతోంది. రాజకీయ నాయకులు ఉపాధ్యాయులను తమ చెప్పుచేతల్లో పెట్టుకోవాలనుకోవడం, అందుకు అనుగుణంగా ఉపాధ్యాయులు కొందరు తమ ఆత్మ గౌరవాన్ని మరచి వారికి అనుచరలుగా మారటం జరుగుతోంది. ప్రభుత్వ విధానాల కారణంగా అపోహతో ఇంగ్లీషు మీడియం చదువుపై మోజు పెరగడం, మాతృభాషలో విద్యాభోదనపై చిన్న చూపు ఏర్పడటం జరుగుతోంది.

ఇన్ని సమస్యలతో సతమతమవుతున్న ఉపాధ్యాయులపై అధికార వికేంద్రికరణ పేరుతో గ్రామ విద్యా కమిటీలకు పెత్తనం యిచ్చే ప్రయత్నం జరుగుతోంది. ప్రజాస్వామ్యంలో అధికార వికేంద్రికరణ ఒక మూలసూత్రమని అంగీకరిస్తూనే మన వ్యవస్థలో నిబద్ధతగల నిజాయితీగల రాజకీయ నాయకత్వం లోపించడం వలన ఉపాధ్యాయ వర్గం దానిపై ఆందోళన చెందుతోంది.

ఇక అధికార, అనధికార వర్గాలలో పెచ్చరిల్లిన అవినీతి, అధికారదర్పం "నోబుల్ ప్రొఫెషన్"లో వున్నాడని చెప్పే ఉపాధ్యాయుడి ఆత్మ గౌరవాన్ని కించపరుస్తూనే వుంది. ఒకే యాజమాన్యంలో పనిచేస్తున్నా అక్కడి ఆఫీసులలోని అధికారులు, సిబ్బందిచే ఉపాధ్యాయులు రెండవ తరగతి పౌరులుగానే చూడబడుతున్నారు. దీర్ఘకాల ఉద్యమాల ద్వారా ప్రభుత్వం నుండి సౌకర్యాలను సాధించడం ఒక ఎత్తైతే, వాటిని అమలు జరిపించుకోవడం మరొక ఎత్తవుతోంది. ప్రభుత్వంలో పై నుండి క్రింది దాకా విశృంఖలంగా పెరిగిన అవినీతి "కొర్రీల" ' మీద 'కొర్రీ'లు వేస్తూ ఉపాధ్యాయుణ్ణి ఆఫీసులు చుట్టూ ప్రదక్షిణ చేయిస్తోంది. సంఘాల ద్వారా ఉపాధ్యాయులు సంఘటిత పడకుండా జిత్తులమారి ఎత్తుగడలు వేస్తోంది. వారిని నీతిగా నిలబడనివ్వక వేధిస్తోంది.

పెట్టుబడిదారీ సమాజపు ఈ దుర్లక్షణాలన్నీ పోవాలంటే ప్రత్యామ్నాయ సమాజం సోషలిస్టు సమాజం స్థాపనే ఏకైక మార్గమని గ్రహించి, అందుకు కలిసివచ్చే యితర శ్రామిక వర్గాలతో ఉద్యమించడానికి ఉపాధ్యావర్గం సమాయత్తం కావలసి వుంది. వారితో చేయి చేయి కలిపి ముందుకు సాగవలసి వుంది.

ఈ లోగా సమస్యలెన్నున్నా, కష్టజీవుల శ్రమఫలితంతో సమాజంచే పోషించబడుతున్నామనే వాస్తవాన్ని గుర్తెరిగి ఉపాధ్యాయుడు అంకిత భావంతో పనిచేయాలని, "హక్కులు, బాధ్యతలు రెండు నేత్రాలుగా భావించి పనిచేయాలని యు.టి.యఫ్. ఉద్బోధిస్తోంది. "అధ్యయనం అధ్యాపనం-సామాజిక స్పృహ"లను త్రిసూత్రాలుగా అతడు అలపరచుకోవాలని యు.టి.యఫ్. అభిలషిస్తోంది. అప్పుడు మాత్రమే పైన పేర్కొన్న పలు సమస్యలను పరిష్కరించుకోవడంలో అతడు చేపట్టే ఉద్యమాలకు సామాజిక మద్దతు లభిస్తుందని యు.టి.యఫ్. విశ్వసిస్తోంది.

# అభ్యాసనంలో ఆహ్లాదం, బోధనలో ఆనందం

## ఇదీ ప్రాథమిక విద్యలో పరమార్థం

**- వి. బాలసుబ్రహ్మణ్యం**

"బాబు బడంటే నీకిష్టమా? బర్రెలు మేపుకోవడం నీకిష్టమా?" నాకు బర్రెలు మేపుకోవడమే ఇష్టమండీ!' ఒక పశువుల కాపరి జవాబు.

"బడికి వెళ్ళాలంటున్నావు గదా, మరి రెండు నెల్లకే ఎందుకు మానేశావు?" "నాకు టీచరంటే భయమండీ, బళ్ళో ఒకటే బోరండి" మరో అమ్మాయి సమాధానం.

ప్రొఫెసర్ రామకృష్ణ తమిళనాడులో బడి మానేసిన పిల్లల్ని నేరుగా అడిగినప్పుడొచ్చిన జవాబులివి. దీని ఆధారంగా ఆయనొక రిపోర్టు తయారుచేశారు. దీని ప్రకారం 62శాతం విద్యార్థులు ఆర్థికేతర కారణాల వల్లే బడి మానేస్తున్నారు.

42వ నేషనల్ శాంపిల్ సర్వే మరింత సూటిగా 25శాతం పిల్లలు బడి ఆసక్తికరంగా లేనందువల్లే బడి మానేస్తున్నట్లు పేర్కొంది. 'నాయన తార రిపోర్టు', "వర్ఘీస్ రిపోర్టు" సైతం కాస్త అటూ ఇటూగా దీనినే నిర్ధారించాయి.

1986లో 1-8 తరగతుల మధ్య బడి మానేసినవారు 77 శాతం, 1-5 తరగతుల మధ్య 56 శాతం. దాదాపు 19 కోట్ల బాలల్లో 14 సం॥లోపు వారిలో 7వతరగతి లోగా బడి బయట 13 కోట్ల మంది ఉండిపోతున్నారు! ఇలా చూస్తే మన ప్రాథమిక విద్యారంగానికి పెనుసవాలు మధ్యలో బడి మానేయడంగా మనం గుర్తించవచ్చు.

### బడి మానేస్తున్నారా? బడి నుండి తరిమేస్తున్నారా?

పిల్లలు వారికి వారు బడి మానేస్తున్నారా? దీనికి మనమేమైనా కారకులామా? నిజానికి వీరు మానేసిన వారా (dropouts)? తరమేసిన వారా (Pushouts)? విద్యారంగాన్ని - మరీ ప్రాథమిక విద్యారంగాన్ని పరిశీలిస్తున్న ప్రతి ఒక్కరినీ వేధిస్తున్న ప్రశ్న ఇది. దీని మీద చాలా పరిశోధనలు జరుగుతున్నాయి. ప్రయోగాలు చేస్తున్నారు.

రంగారెడ్డి జిల్లాలో రు. 1000కి కట్టు బాసిసైన అబ్బాయి ఒక బడిలో నాలుగు నెలలు చదువుకొని, ఇప్పుడు తాను టీచరై కూర్చున్నాడు. అంతా కలిసి ఆరేళ్ళలో జరిగిన సంగతి ఇది. అందరూ టీచర్లుగాలేరు గానీ ఇలాంటి వారు ఇప్పటికి 5,000 మంది పైగా బండ చాకిరీ నుండి విముక్తులై బడికిపోతున్నారు. వీరిలో ఒక డ్రాపౌట్ కూడా లేదు. ఇదెలా సాధ్యమైంది?

NCERT 1992-93లో ఒక సర్వే చేసింది. దీని ప్రకారం 5వ తరగతి పూర్తి చేసిన వారిలో, వారి సిలబస్‌లోని పదాలను అర్థం చేసుకొనగల భాషా జ్ఞానం పొందినవారు 50 శాతం మాత్రమే. దేశంలో అక్షరాస్యతలో అగ్రస్థానంలో వున్న కేరళలో సైతం మాతృభాషలోని ఒక పేరాను చదివి జీర్ణం చేసుకొని జవాబు చెప్పగల స్థాయి గల పిల్లలు నాలుగుతరగుతులు పూర్తి చేసినా 56 శాతం మించి లేదు. గణితంలోనైతే 40 శాతం కూడా నిర్దేశించిన లక్ష్యం చేరుతున్నవారు లేరు!

అయిదేళ్ళు చదివినా ఆ మాత్రం రానపుడు బడిలో పిల్లలెందుకుంటారు? చదువంత కష్టమైనపుడు ఆ పనికి ఏ పిల్లవాడైనా ఎందుకు ఏళ్ళ తరబడి కూచుంటాడు? దీన్నే ప్రొఫెసర్ యశ్‌పాల్ ఇలా సూత్రీకరించాడు "మన చదువులో అటు విద్యార్థికి, ఇటు ఉపాధ్యాయుడికీ బొత్తిగా ఆహ్లాదం అంటే ఏమిటో తెలీదు. బోధించడం, నేర్చుకోవడం రెండూ ఉపాధ్యాయుడికీ ఏ మాత్రం ఇష్టంలేని వ్యాపకాలు. బడికి వెళుతున్న పిల్లల్లో ఎక్కువమందికి చదువంటే విసుగు. బడికెళ్ళడమంటే చేదు మాత్రమింగడమే. పరీక్షల కోసం తయారవ్వడమే చదువని మన విద్యావిధానం సూత్రీకరించేసింది. ఇంతకంటే చదువుకి పరమార్థం మనదృష్టిలో ఏమీలేదు."

దీనికంటే మన బోధనా విధానానికి మన బడి వాతావరణానికి మరో వ్యాఖ్యానం దేనికి ?

సమాజంలో సైన్స్యు ముందుకెళ్ళి, విజ్ఞానం విస్తరించి, ప్రతిరంగంలో ఎన్నో మార్పులొస్తున్నాయి. ఏ పనైనా సులువుగా చేయడం, విసుగు లేకుండా చేయడం ఆధునికంగా, శాస్త్రీయంగా పేర్కొనాలి. కానీ విచిత్రమేమంటే నవనవోన్మేషంగా మారాల్సిన బోధనా విధానం, చిన్నారి పిలల్ని తీర్చిదిద్దే విధానం ఏ మాత్రం మారకపోవడం. యాభై ఏళ్ళ ముందు మన అమ్మా నాన్నల తరం బడిలో చేరినప్పుడు ఎలా పలకమీద అక్షరాలు రాసిచ్చి దిద్దమన్నారో, ఎలా బెత్తాన్ని ఝుళిపించారో, ఎలా పద్మాసనం వేయించి కదలకుండా జైలుశిక్ష విధించారో, ఇప్పుడు మన పిల్లలూ అదే అనుభవిస్తున్నారు! మన సాంస్కృతిక వారసత్వంలోనే శిక్షణకూ, శిక్షకూ తేడా అతిస్వల్పం. ఆ రెండింటికీ సంబంధం అవినాభావం!

### ఎక్కడుంది లోపం?

బడిని ఆహ్లాదంగా మార్చలేమా? నేర్పడంలో ఆనందం మిళితం చేయలేమా? అసలు మన అక్షరాలూ, లెక్కలూ నేర్చుకోవడం అంతకష్టమా? బడిలో చేరకముందు పిల్లవాడు ఎన్ని నేర్చుకొంటున్నాడు! ధారళంగా మాట్లాడడం నేర్చుకొన్నాడు. ఒక్క వ్యాకరణం పొల్లుందా? ఎంత అద్భుతంగా తన భావాల్ని, అవసరాల్ని వ్యక్తీకరిస్తున్నాడు. ఒక్క భాషేనా ఎన్ని విషయాలు సేకరిస్తున్నాడు? ఎన్ని పనులు నేర్చుకొంటున్నాడు? వీటిలో వెనకబడిపోయిన పిల్లవాడిని ఒక్కర్నీ మనం చూడ్డం లేదే! వీళ్ళకివి మనం నేర్పామా? బడిలో భాష నేర్పినట్టే ప్రతి ఒక్కటీ కూచోబెట్టి, భయపెట్టి, పరీక్ష పెట్టి మాటలు నేర్పి వుంటే మన పిల్లాడి కెప్పటికైనా మాట్లాడ్డం వచ్చి వుండేదా? అడుగడుగునా మన పర్యవేక్షణలో వేయించి, ఏ మాత్రం సరిగా అడుగు వేయలేకపోయినా చీవాట్లు పెట్టి నడక నేర్పించి వుంటే ఎప్పటికయినా మన పిల్లలు నడవగలరా? మరి బడిలోకి వచ్చేప్పటికి ఏమి నేర్చుకోవాలన్నా దండించాలనీ, ప్రతినిత్యం సరిచేయాలనీ మనమెందుకనుకుంటాము. తప్పులు చెయ్యడం కూడా నేర్చుకోవడంలో భాగమే అని మనమెందుకు అనుకోము? అసలు నేర్చుకోవడం ఎలాగో నేర్పడమే అసలైన బోధనా విధానమని మనమెందుకు భావించము?

ఆరేళ్ళ పిల్లవాడు మనబడిలోకి వస్తాడు. (వచ్చేముందే ఇంట్లో బడంటే జైలనీ, టీచరంటే యముడనీ అమ్మానాన్న చెప్పే వుంటారు?) బిక్కుబిక్కుమంటూ కూచుంటాడు. మనం అక్షరాలు రాసిచ్చి గీత తప్పకుండా దిద్దమంటాం. కదలడానికి లేదు; మాటాడ్డానికి లేదు. ఆ ఆకారంలోనివి ఏమిటో, అవలా ఎందుకు దిద్దాలో వాడికేమీ అంతుబట్టదు. ఇప్పటిదాకా వాడే వాతావరణంలో వున్నాడు? తూనీగల్లా ఎగిరాడు. భూప్రపంచమంతా వాడిదేనన్నట్టు తిరిగాడు. స్వేచ్ఛగా ప్రతిదాన్నీ ప్రశ్నించాడు: శోధించాడు; మారాంచేశాడు. ముద్దులు తిన్నాడు. మరిప్పుడు, వాడిలోకానికీ బడికీ ఏం సంబంధం వుంది గనుక? అందులో ఎందుకుండాలి గనుక? (ఉన్నాడంటే మరో గత్యంతరం లేక తప్ప)

## ఆహ్లాదంగా లేకపోవడమంటే?

చదువు ఆహ్లాదంగా లేకపోవడమంటే మొట్టమొదటిది పిల్లవాడి ప్రపంచానికి ఏ మాత్రం సంబంధంలేని వాతావరణం. బడిలో పిట్టలూ, జంతువులూ గోడలకంతా ఎందుకుండగూడదు? నలుగురైదుగురు గుంపుగా కూచుని మాట్లాడుకొనే వీలెందు కుండగూడదు? అసలు ఎందుకు మాటాడగూడదు? ఎందుకు కదలగూడదు? తన వయసుకూ, లోకానికీ ఈ బడితో ఏం సంబంధం?

దీని కోసం మధ్యప్రదేశ్‌లోని 23 జిల్లాల్లో 'శిక్షక్ సమాఖ్య' అనే ప్రాజెక్ట్ నడుస్తోంది. ఔత్సాహికులైన టీచర్లు దాన్ని నిర్వహిస్తున్నారు. చూడ్డానికి బయటి నుండి ఆస్కూళ్ళు మన స్కూళ్ళలానే వుంటాయి. లోపలి కెళితే సర్వం పిల్లల ప్రపంచమే. గోడల నిండా బొమ్మలే. బడిలోపలి గోడ చుట్టూ రెండు మూడడగుల ఎత్తున నల్లరంగు వేసి వుంటుంది. పిల్లలు దానిపైన ఏమైనా రాసుకోవచ్చు. మరి టీచరో! ఆవిడ కూడా దాని మీదే రాయాలి. అంటే వారితో కూచోవాలి. పలకలు ఇంటికి తీసికెళ్ళే పనీ లేదు. తెచ్చే పనీలేదు. ఆడటం, పాడటం అక్కడ పిల్లలహక్కు. అల్లరి వాళ్ళ జన్మహక్కు. ఈ స్కూళ్లకు పిల్లలు పరిగెత్తుకొస్తున్నారు. గంట కొట్టినా కదలడం లేదు మరి! దీన్నే 'రుషీవాలీ' వాళ్ళు పాటిస్తున్నారు.

మన చదువులు ఆహ్లాదంగా లేకపోవడానికి మరో కారణం మన పాఠ్యగ్రంథాలు. వాటికి పిల్లల ప్రపంచంతో సంబంధమే లేదు. అర్థంగాని పదాలు, అర్థంలేని నీతులు, అన్నీ పెద్ద వాళ్ళ బేషజాలు. ఈ ప్రపంచాన్ని పిల్లలవైపు నుంచి రచింపబడ్డ పుస్తకాలేవీ వుండవు. పెద్దలవైపు నుంచి చూసి 'పిల్లలకిలా వుండాలి' అని నిర్ధారించినవే వుంటాయి.

ఓ తెలుగు వాచకంలో ఓ పాఠం వుంది. అందులో ఓ చిత్రం వుంది. దాంట్లో "నాన్న పడక కుర్చీలో కూచుని పేపరు చదువుతుంటాడు. అమ్మ ఆయనకు కాఫీ ఇస్తుంటుంది. పిల్లలిద్దరూ బడికి తయారై నాన్నగారి పాదాలకు నమస్కరిస్తుంటారు." ఇదెక్కడైనా జరిగేదేనా? పిల్లలు అమ్మానాన్నల భుజాలపై వేళ్ళాడుతూ మారం చేస్తూ వున్నట్లు ఎందుకు చూపరు? ఇదే పెద్దల భేషజం. ఇపుడైతే మన పుస్తకాల్లో కాకులూ, పిచుకలూ, కుక్కలూ కూడా కరువైపోయాయి. హంసలూ, నెమళ్లూ వచ్చేశాయి? హంసలూ, నెమళ్ళూ వచ్చేశాయి? ఇక లెక్కలంటే అది జీవితంలో భాగంగాదు. అదో విశ్వామిత్ర సృష్టి. సబ్జెక్టు భాషంటే వ్యాకరణమే! పాఠాలంటే ప్రశ్నోత్తరాలే!

మూడోకారణం-చెప్పే విధానం; విద్యార్థులతో మెలిగే విధానం. మనం ఎందుకు పిల్లల్లో కలసిపోము? ఎందుకు టీచరు ఒళ్ళో ఓ అమ్మాయి కూచోదు? జాన్ హోల్ట్ అన్నట్లు పిల్లల్ని జయించలేక పోవడం నేరంగాక పోవచ్చు. కానీ వాళ్ళతో ఆడుకోలేకపోవడం గుడ్డితనం, చెవిటితనం కన్నా తక్కువ. అవిటితనం మాత్రంగాదు?

ఇలా ఎంతైనా చెప్పొచ్చు.

ఇలా చూస్తే ఆహ్లాదంగా చెప్పడం ఒకానొక ప్రక్రియ గాదు, ఒక ప్రజాస్వామిక బోధనా విధానం. ఒక సహజసుందర అభ్యాసక విధానం. దాన్ని మనం అంగీకరిస్తే మనం చెప్పే పాఠాలు మారతాయి. మనం విద్యార్థుల్లో మెలిగే విధానం మారుతుంది. మనం చెప్పే విధానం మారుతుంది. అపుడు మనమూ విద్యార్థులు కలిసి అభ్యసిస్తాం. ఆటపాటలు మన చదువులో భాగాలవుతాయి. అమ్మ ఒడీ - మన ఒడీ ఒకేలా కన్పిస్తుంది. విద్యార్థి జిజ్ఞాసకు, ఆసక్తికి కావల్సినంత మేత లభిస్తుంది. జీవితంలో నేర్చుకోడానికీ, బడిలో నేర్చుకోడానికి భేదం ఎదీ వుండదు. అసలు నేర్పడం వుండదు. నేర్చుకోవడమే వుంటుంది!

ఈ అవగాహన మనకు లేక, ఈ విధానం మనం పాటించక పిల్లల్ని బడినుంచి మనమే వెళ్లగొడుతున్నాము. మరీ మొదటి తరం చదువుకొనే వాళ్ళు బడిలో ఇమడలేక రెండు నెలలకల్లా మాటిమాటికీ బడి మానెయ్యడం మొదలెడతారు. అమ్మానాన్నలు మెడబట్టి తోసినా వాళ్ళకేమీ కాదు. ఏడాది గడిచేటప్పటికి వాళ్ళందరికంటే వెనకబడి వుంటారు. ఇక బళ్ళో కొనసాగడం గగనమైపోతుంది. "ఈ చదువులు మనవిగావు. మన పిల్లలకి చదువులురావు" అనే నిర్ధారణకు వాళ్ళ తల్లిదండ్రులు వచ్చేస్తారు. బడి మాన్పించేస్తారు.

ఇప్పుడు చెప్పండి - మన చదువుల్లో ఎంత మార్పు రావాల్సి వుంది? అదెక్కడి నుంచి మొదలుగావాల్సి వుంది?

# ఒంగోలు సప్తమ మహాసభలు ఆమోదించిన [illegible]

## సంతాప తీర్మానాలు

యు.టి.యఫ్ 23వ నూతన కౌన్సిల్ సమావేశం 1996 మార్చి 15, 16, 17 తేదీలలో హైదరాబాదులో జరిగింది. నాటి నుండి నేటి వరకు అంతర్జాతీయ, జాతీయ, రాష్ట్ర స్థాయిలో వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు మృతి చెందారు. వారు ...

### 1) అంతర్జాతీయంగా :

1. నవసేన నిర్మాత, సిద్ధాంతవేత్త, చైనా మాజీ అధ్యక్షుడు డెంగ్ జియావో పెంగ్ మృతి చెందారు.
2. ఆఫ్ఘనిస్థాన్ మాజీ అధ్యక్షుడు, ఆధునిక ఆఫ్ఘనిస్థాన్ నిర్మాతల్లో ఒకరైన నజీబుల్లా మతదురహంకార తీవ్రవాదులచే దారుణంగా ఉరితీయబడ్డారు.
3. ఫ్రాన్స్ మాజీ అధ్యక్షుడు, సోషలిస్టు పార్టీ నాయకుడు ఫ్రాంకోయిస్ మిట్టరాండ్ మరణించారు.
4. ఆఫ్ఘనిస్థాన్ కమ్యూనిస్టు నేత, ప్రజానాయకుడు బబ్రక్ కర్మాల్ మాస్కోలో మరణించారు.
5. శ్రీలంక మాజీ అధ్యక్షుడు రిచర్డ్ జయవర్ధనే కాన్సర్ వ్యాధితో కన్నుమూసారు.

### 2) జాతీయంగా :

1. ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, భారత మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి మృతి చెందారు.
2. ప్రముఖ స్వాతంత్ర సమరయోధురాలు, సాంఘిక సంస్కర్త అరుణా అసఫ్ ఆలీ
3. ఆంధ్ర రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి, ఉత్తర ప్రదేశ్ మాజీ గవర్నరు, ప్రముఖ సాహితీవేత్త శ్రీ బెజవాడ గోపాలరెడ్డి
4. ఆంధ్ర ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి, తమిళనాడు గవర్నరు శ్రీ మర్రి చెన్నారెడ్డి.
5. జాతీయ సమగ్రతపై పలు సంకలనాలు వెలువరించిన ప్రముఖ ఉర్దూ కవి నజీర్ బనారసి.
6. ప్రముఖ హిందీ నటుడు రాజకుమార్
7. ప్రముఖ ఆర్థికవేత్త ఎ.ఎన్. పట్వర్ధన్
8. భారతదేశంలో హైకోర్టు తొలి మహిళా న్యాయమూర్తి శ్రీమతి అన్నాచాందీ
9. హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ చల్లా కొండయ్య
10. దుండగుల తుపాకీ గుళ్ళకు బలైన ముంబాయి ట్రేడ్ యూనియన్ నాయకుడు డా॥ దత్తాసామంత్.
11. కమ్యూనిస్టు నాయకుడు కా॥ ఎస్. జి. సర్దేశాయ్
12. వివిధ రాష్ట్రాల మాజీ ముఖ్యమంత్రులు శ్రీయుతులు పి.సి. సేథీ, హితేశ్వర సైకియా, అశోక్ సేన్, జానకీ రామచంద్రన్.
13. ప్రముఖ ఆదివాసీ ఉద్యమ నాయకురాలు, మహిళా ఉద్యమ నిర్మాత గోదావరి పెరులేకర్.
14. నేతాజీ సుభాస్ చంద్రబోస్ సతీమణి ఎమిలీబోస్.
15. నౌకదళ మాజీ అధిపతి అడ్మిరల్ ఎస్.ఎస్., కొహ్లి,
16. ప్రముఖ కమ్యూనిస్టు సిద్ధాంతకర్త కా॥ శివవర్మ

### 3. రాష్ట్రంలో :

1. ప్రసిద్ధ రచయిత, పత్రికా సంపాదకుడు డాక్టర్ పురాణం సుబ్రహ్మణ్య శర్మ.
2. ఎ.పి. యన్.జి.ఓ., మాజీ అధ్యక్షుడు శ్రీ ఐ. బి [illegible]
3. వైణిక బ్రహ్మ, గాన కళానిధి, శ్రీ చల్లపల్లి చిట్టిబాబు
4. ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ సి పి.ఐ. ఉపనాయకుడు కా॥ [illegible]
5. కమ్యూనిస్టు సిద్ధాంతవేత్త, ప్రముఖ రచయిత శ్రీ ఏటుకూరి బలరామమూర్తి
6. ప్రఖ్యాత గాయకుడు, రేడియో మల్లిక్‌గా పరిచితుడు శ్రీ [illegible] మల్లిఖార్జున రావు
7. కాంగ్రెస్ సీనియర్ నాయకుడు, ముమ్మిడివరం [illegible] శ్రీ బత్తిన సుబ్బారావు
8. ప్రముఖ కవయిత్రి కళా ప్రపూర్ణ శ్రీమతి [illegible] కాంతమ్మ.
9. విలక్షణ నటుడు, దర్శక నిర్మాత డా॥ యం. ప్రభాకరరెడ్డి
10. మాజీ మంత్రిణి కాంగ్రెస్ నాయకురాలు శ్రీమతి మాగుంట వరలక్ష్మి
11. ప్రఖ్యాత సినీ గాయకుడు శ్రీ పిఠాపురం నాగేశ్వరరావు
12. పార్వతీపురం ఎం.ఎల్.ఎ. శ్రీ బి. కృష్ణయ్య
13. ప్రముఖ బుర్రకథ కళాకారుడు శ్రీ నాజర్
14. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత శ్రీ చర్ల గణపతి శాస్త్రి
15. ప్రముఖ రంగస్థల నటులు రేబాల రమణ, షణ్ముఖి అంజనేయరాజు.
16. ఎ.పి టి.ఎఫ్. (హెచ్.) అధ్యక్షుడు కా॥ [illegible] సుబ్బారావు
17. గత నవంబరులో ప్రకాశం, ఉభయ గోదావరి జిల్లాలో సంభవించిన ప్రకృతి భీభత్సంలో ప్రాణాలు కోల్పోయిన ప్రజానీకం

వీరితో పాటు యింకా మన దృష్టికి రాని వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు, త్యాగమూర్తులు ఎందరో ఈ కాలంలో మృతి చెందిన వారందరికి యీ మహాసభ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నది.

## జనరల్ తీర్మానములు

### 1. ప్రాథమిక విద్యను ప్రాథమిక హక్కుల్లో చేర్చాలి :

ప్రాథమిక విద్య జాతి పునర్వికాసానికీ, [illegible] పునాది మాత్రమే కాదు. వ్యక్తి ప్రాథమిక [illegible] వెళ్ళాల్సిన వయస్సులో బందచాకిరీ చేయాల్సి రావడం [illegible] భంగకరంగా భావిస్తున్న కాలమిది. దీనికనుగుణంగానే [illegible] నిర్బంధ ప్రాథమిక విద్యను ఉటంకించుకొన్నాం

అయితే యీ 50 యేళ్ళ స్వతంత్ర భారతంలో జరిగింది దీనికి భిన్నం. 52 శాతానికి మించి మనం అక్షరాస్యతను సాధించలేకపోయాం. అభివృద్ధి చెందుచున్న 57 దేశాల్లో ప్రాథమిక విద్యకు సంబంధించినంతవరకు భారత దేశం 50 స్థానంలో వుండటం బాధాకరం. 28 శాతం పిల్లలు, ముఖ్యంగా 40 శాతం ఆడపిల్లలు బడిలో చేరడం లేదు. చేరిన వారిలో 5వ తరగతి దాటకుండానే 45 శాతం మానివేస్తున్నారు. షెడ్యూల్డు కులాల, షెడ్యూల్డు తెగల బాలికల్లో వీరి శాతం 60-70 శాతంగా వుంది.

చైనా, వియాత్నాం వంటి సోషలిస్టు దేశాలే గాదు నికరాగువా, టాంజినియా, శ్రీలంక వంటి దేశాలు కూడా 90 శాతం మంది పిల్లలకు ప్రాథమిక విద్యను అందించగల్గుతున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా 'అందరికి విద్య' సాధించిన దేశాలన్నింటి అనుభవం ఒకటే. ప్రభుత్వం ప్రాథమిక విద్యను ప్రాథమిక అవసరంగా గుర్తించి అన్ని వసతులు కల్పించడం. ఒక నిర్దిష్ట కాలంలో అన్ని శక్తులను సమీకరించి అందరికీ విద్యను అందించడమే యీ అనుభవం.

దురదృష్టవశాత్తు యీ అనుభవాన్ని మనం తీసుకోలేకపోయాం. పైగా ప్రభుత్వం రంగంలో విద్య అనుత్పాదక రంగంగా, భారంగా భావిస్తున్నాం. నానాటికి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు విద్యాకేటాయింపుల్లో కోత విధిస్తున్నాయి. పైగా ప్రభుత్వ విద్యారంగాన్ని నిర్వీర్యం చేసి, అదంతా ప్రైవేటు రంగం బాధ్యతనీ, ప్రజల స్వంత బాధ్యతనీ ప్రవచించడం మరీ బాధాకరం.

మానవవనరుల వికాసం, వినియోగం లేకుండా మనం ఆధునిక భారత దేశాన్ని నిర్మించలేము. అజ్ఞానం, అనారోగ్యము, చాంధస భావజాలం మనల్ని బలమైన పారిశ్రామిక దేశంగా ఎన్నటికీ ఎదగకుండా నిరోధించే అంశాలని మనం గుర్తించాలి. అట్టడుగు వర్గం సమాజ పురోగమన ప్రక్రియలో భాగస్వామి కావాలంటే ప్రాథమిక విద్య తప్పనిసరి.

దీని కోసం ప్రాథమిక విద్యను రాజ్యాంగం ప్రాథమిక హక్కుల్లో చేర్చాలని యీ మహాసభ కోరుతుంది. 2000 సం॥ల నాటికి 14 సం॥లోపు పిల్లలందరికి నిర్బంధ ప్రాథమిక విద్య నందించడం ప్రభుత్వ బాధ్యతగా గుర్తించి అమలు జరపాలని యీ మహాసభ కోరుతోంది.

2. అవినీతి వ్యతిరేక పోరాటాలలో భాగస్వాములవుదాం :

భారతదేశాన్ని యీనాడు కలచివేస్తున్న సమస్య అవినీతి. ఈ 50 యేళ్ళలో ఏ రంగమూ దీనిలాగా విస్తరించలేదు; వ్యవస్థీకృతం కాలేదు. అట్టడుగు నుండి అత్యున్నత స్థానాలదాకా అవినీతిలేని చోటు కంచుకాగడా వేసి వెతికినా కానరాని దుస్థితిలో మనదేశం వుంది. నూతన ఆర్థిక విధానాల ఊడలు మరీ బలపడ్డాయి. గత రెండేళ్ళుగా ఒక్కొక్క కుంభకోణం ఒక్కోరోజు బయటపడుతూవుంది. ఒక్క వామపక్షాలు మినహా కోర్టు బోను ఎక్కని పార్టీ లేదు; బెయిలు కోసం క్యూలో నిలబడని నాయకుడు లేడు. సాక్షాత్తు మాజీ ప్రధానమంత్రి, ఆయన క్యాబినేట్ సభ్యులందరు భారీ స్కాముల్లో పీకలదాకా మునిగిపోయారు.

అన్ని రంగాలకు యీ జాడ్యం విస్తరించింది. ఉన్నతాధికార్ల నికృష్ట నిర్వాకానికి బీహార్ గడ్డి కేసు ఒక ఉదాహరణ. రాను రాను రాజకీయాలు, బ్యురోక్రసీ అవినీతికి తాకట్టుపడి మాఫియాలను తోడు తెచ్చుకొనే దుస్థితి దాపురించింది.

ఫలితంగా ప్రణాళికా సౌకర్యాలు ప్రజల్ని చేరడం లేదు. అప్పులు తెచ్చి కుమ్మరిస్తున్న నిధులు అసలు చోటికి చేరడం లేదు. దశాబ్దాలు గడుస్తున్నా మన ఆర్థిక వ్యవస్థ, సగటు పౌరుని బ్రతుకు ఎక్కడ వేసిన గొంగళి అక్కడిగానే వున్నాయి. ఫలితంగా నిరాశా నిస్పృహలు ఒకవైపు, ఆందోళనలు మరోవైపు ప్రజల్నించి ప్రస్ఫుటమవుతున్నాయి.

దీనికంటె ప్రమాదకరం ఏమంటే మన ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థపైనే ప్రజలకు విశ్వాసం సడలుతోంది. ఎవర్నీ ఎవరూ నమ్మని స్థితి ఏర్పడుతోంది. కొత్త తరానికి భవిష్యత్తు మరీ అంధకార బంధురంగా కన్పిస్తోంది.

ఈ ధోరణి మన ప్రజాతంత్ర వ్యవస్థకే ప్రమాదకరం. మన దేశ ప్రగతికే గాదు. మన మనుగడకే ప్రమాదకరం. ఈ దుస్థితి పట్ల యీ మహాసభ తీవ్ర ఆందోళనను వ్యక్తం చేస్తోంది. ప్రజా శ్రేణుల్ని చైతన్యవంతుల్ని చేసి అవినీతికి వ్యతిరేకంగా కూడగట్టడం ద్వారా మాత్రమే యీ ప్రమాదాన్నించి భారత దేశాన్ని రక్షించగలమని నమ్ముతోంది. అవినీతికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలలో తను భాగస్వామి కావాలని ఆకాంక్షిస్తోంది. ఉపాధ్యాయలోకం తమ ఉద్యోగ జీవితంలో అవినీతికి వ్యతిరేకంగా నిలబడి అవినీతి వ్యతిరేక ప్రవంతిలో భాగస్వామి కావాలని కోరుతోంది.

3. మహిళా లోకపు పోరాట విజయాల్ని వమ్ముచేయొద్దు. మళ్ళీ మద్యం తీసుకొనిరావద్దు !

ఆంధ్ర దేశపు మహిళా లోకం సుదీర్ఘ కాలం సాగించిన పోరాట ఫలితంగా రాష్ట్రంలో మద్య నిషేధం అమల్లోకి వచ్చింది. సారిచేతలే గాక, అణచివేతలు కూడా సాధ్యం కాని పరిస్థితుల్లోనే రాష్ట్ర ప్రభుత్వం మద్య నిషేధం విధించినది.

మద్య నిషేధం విధించినప్పటి నుండి దాని సక్రమ అమలుకు ప్రభుత్వం తీసుకొన్న చర్యల్లో చిత్తశుద్ధిలేదు. యంత్రాంగాన్ని అప్రమత్తం చేయలేదు. ప్రజల్ని భాగస్వాముల్ని చేస్తూ గ్రామ స్థాయి కమిటీలను ఏర్పాటుచేయలేదు. సారా వ్యతిరేకోద్యమంలో పాల్గొన్న నాయకుల్ని ప్రజాసంఘాల్ని యిందులో భాగస్వాముల్ని చేయలేదు.

అయినా యీ పరిస్థితుల్లో కూడా రెండేళ్ళ మద్యనిషేధం ఫలితం ఆశాజనకంగానే వుంది. పలు సంస్థలు నిర్వహించిన సర్వేలు గ్రామీణా పేద కుటుంబాల్లో వచ్చిన మార్పును, యింకా దాన్ని పటిష్టంగా అమలు చేయాలన్న ప్రజల డిమాండును సూచిస్తున్నాయి.

ఈ దశలో రాష్ట్ర ప్రభుత్వ మద్య నిషేధానికి మంగళం పాడాలని చూస్తోంది. ఒక పథకం ప్రకారం ప్రభుత్వమే నిషేధానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తోంది. నిషేధం అసాధ్యమని, రాష్ట్ర ఆర్థిక

...కు దృష్ట్యా వనరుల సమీకరణకు మళ్ళీ మద్యం తేవడమే పరిష్కారమని మంత్రివర్యులే కుతర్కం చేస్తున్నారు. రేపో మాపో మద్యం మళ్ళీ వస్తుందనే అభిప్రాయాన్ని కలుగజేస్తున్నారు.

ఇది రాష్ట్ర ప్రజల పట్ల, ప్రత్యేకించి మహిళలపట్ల తీవ్ర అపచారం వారి పోరాటాన్ని, ఆకాంక్షను వమ్ముచేయబూనుకోవడం దుర్మార్గం. ఎన్నికల్లో ప్రజలకిచ్చిన వాగ్దానానికిది పూర్తి విరుద్ధం.

రాష్ట్ర ప్రభుత్వం యొక్క యీ ధోరణిని యీ మహా సభ తీవ్రంగా వ్యతిరేకిస్తోంది. మద్య నిషేధాన్ని సంపూర్ణంగా, సక్రమంగా చిత్తశుద్ధితో అమలు చేయాలని డిమాండు చేస్తోంది. మద్య నిషేధాన్ని నీరు గార్చే ప్రయత్నాలకు వ్యతిరేకంగా జరిగే ప్రజా పోరాటాలకు తన సంఘీభావం ప్రకటిస్తోంది.

**4 విద్య - ప్రైవేటీకరణ - వ్యాపారీకరణ !**

సరళీకృత ఆర్థిక విధానాలలో భాగంగానే ప్రభుత్వాలు ప్రభుత్వ రంగ పరిశ్రమలతోపాటు విద్యారంగాన్ని ప్రైవేటుపరం చేయాలని ప్రయత్నిస్తున్నాయి. అందుకు సాకుగా విద్యారంగంలోవున్న లోపాలను ఎత్తిచూపుతూ ప్రైవేటీకరణే ఏకైక మార్గంగా ప్రచారం చేస్తున్నాయి. ప్రభుత్వ వనరులతో నడుస్తున్న పాఠశాలలపై పాలకవర్గాల ప్రతినిధులు, మంత్రులు పనిగట్టుకొని దుష్ప్రచారం చేయడం, ప్రైవేటు యాజమాన్యాలచే నడపబడుచున్న పాఠశాలలను ఆకాశానికెత్తడం జరుగుతోంది. ప్రభుత్వ, స్థానిక సంస్థల పాఠశాలలకు ఏ వర్గాలకు చెందిన పిల్లలు వస్తున్నారు? వారి కుటుంబ నేపధ్యం ఏమిటి ? ఆర్థిక పరిస్థితి ఏమిటి? అనే విషయాలను పరిగణనలోనికి తీసుకొనకుండా కేవలం ఫలితాలను బేరీసువేస్తూ వ్యతిరేక ప్రచారం చేయడం వారి విధానాలలో భాగంగా కావాలని చేస్తున్నదే.

ప్రైవేటు విద్యాసంస్థలు పుట్టగొడుగుల్లా పుట్టుకురావడానికి, అవి చేతనయినంత ఆర్థిక దోపిడి చేయడానికి దోహదపడే అనేక ప్రక్రియలను ప్రభుత్వమే ప్రవేశపెడుతున్నది. పోటీ పరీక్షల ఎరచూపుతూ మెరుగైన ఆర్థిక స్థితిగల వారందరూ ప్రైవేటు విద్యా సంస్థల వెంట పరుగెత్తే పరిస్థితిని ప్రభుత్వమే కల్పిస్తున్నది. ఆర్థికంగా వెసులుబాటు లేని 80 శాతం పేద, మధ్య తరగతి విద్యార్థులు ప్రత్యేక శిక్షణ పొందలేక ఉన్నత విద్యకు దూరం గావలసి వస్తోంది.

ఈ ప్రమాదాన్ని ఎదుర్కోవడానికి నిర్వహించే ఉద్యమాలలో ప్రజలను భాగస్వాములను చెయడానికి, వారి సహకారాన్ని పొందటానికి ఉపాధ్యాయులు ముందుగా తమపై నున్న అపప్రదను తొలగించుకొనే కృషి చేయాలి. ఉపాధ్యాయులు ప్రజా విశ్వాసాన్ని పొందటానికి, పాలక వర్గాల ఎత్తుగడలను త్రిప్పి కొట్టడానికి తమ పని విధానాన్ని మెరుగుపరచుకోవాలని. బాధ్యతాయుతంగా కృషి చేయాలని యీ మహాసభ కోరుతోంది. యాజమాన్య పద్ధతుల్లో తగిన మార్పులు చేపడం ద్వారాను. కొఠారి కమీషన్, రామమూర్తి కమీషన్ల వంటి కమిషన్లు చేసిన సిఫారసులను అమలు చేయడం ద్వారాను ప్రభుత్వరంగ విద్యాసంస్థలను మెరుగుపరచడానికి పూనుకోవాలనీ విద్యా ప్రైవేటీకరణ ఆలోచనలను విడనాడాలని యీ మహాసభ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది

**5. కార్మిక ఉద్యోగ వర్గాల పోరాటాలకు మద్దతు :**

1991 నుండి భారత ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకృత ఆర్థిక విధానాలు మన ఆర్థిక, పారిశ్రామిక రంగాలపై బహుళజాతి సంస్థలు పెత్తనం చెలాయించడానికి, మన దేశ సంపదను దోచుకోవడానికి దోహదపడుతున్నాయి. దాని పర్యవసానంగానే ప్రపంచ బ్యాంకు, ఐ.యం.యఫ్. వంటి సంస్థల సూచనలకు, షరతులకు తలొగ్గి మన వ్యవసాయదారులకిచ్చే సబ్సిడీలపైన, సామాన్య ప్రజానీకం వాడుకొనే నిత్యావసర వస్తువులపైనున్న రాయితీలపైన ప్రభుత్వం కోత విధిస్తున్నది. ప్రభుత్వరంగ పరిశ్రమలను, బ్యాంకులను, ఎల్.ఐ.సి., జనరల్ యిన్సూరెన్సు కంపెనీలను బహుళజాతి సంస్థల చేతులలో పెట్టడానికి ప్రయత్నాలను ముమ్మరం చేస్తున్నది.

కేంద్ర ప్రభుత్వం యొక్క యీ ద్రోహ పూరిత పథకాల గుట్టును రట్టు చేస్తూ చైతన్యవంతమగుచున్న భారత కార్మిక వర్గం, ఉద్యోగులు నిర్వహిస్తున్న అందోళనలకు యీ మహాసభ మద్దతును ప్రకటిస్తున్నది. అదే దేశానికి అన్నంపెట్టే వ్యవసాయ కార్మికుల, రైతుల ఆందోళనా కార్యక్రమాలకు యీ మహాసభ తన సంపూర్ణ మద్దతును, సౌహార్దతను ప్రకటిస్తూ వ్యవసాయ కార్మిక చట్టం, పంటల భీమా, పథకం వంటివాటిని అమల్లోనికి తేవాలని యీ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తోంది.

**6. ధరలను అదుపు చేయుట :**

వార్షిక బడ్జెట్‌ల సమయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విధిస్తున్న ప్రత్యక్ష - పరోక్ష పన్నుల కారణంగా వినిమయ వస్తువుల ధరలు నానాటికి పెరిగిపోతున్నాయి. దీనికి తోడు ఎప్పుడు పడితే అపుడు యీ ప్రభుత్వాలు దొడ్డిదారిన విధిస్తున్న యితర పన్నుల వలన ధరలు మరింత పెరిగి సామాన్య మానవుని జీవితాన్ని దుర్భరం చేస్తున్నాయి. తమ తమ ఉద్యమాల ద్వారా వ్యవసాయ కార్మికులు, పారిశ్రామిక కార్మికులు, మధ్య తరగతి ఉద్యోగులు తమ వేతనాదాయాలను కొంత మేరకు పెంచుకోగల్గుతున్నప్పటికి అత్యంత వేగంగా పెరుగుతున్న ధరలు వారి జీవన పరిస్థితులను అస్తవ్యస్తం చేస్తున్నవి.

అందుచే వినిమయ వస్తువుల ధరలను అదుపుచేయడానికి, నిత్య జీవితావసర వస్తువులను చౌక డిపోలద్వారా సరఫరా చేయుటకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగిన చర్యలు చేపట్టాలని యీ మహాసభ డిమాండు చేస్తోంది.

**7. అక్షరాస్యతా కార్యక్రమం :**

నిరక్షరాస్యత మానవుని, ఆర్థిక, సాంఘిక పురోభివృద్ధికి అవరోధం. ప్రపంచంలోని నిరక్షరాస్యులలో సగం మంది మన దేశంలో వుండగా దేశాభివృద్ధి గాలి మేడే అవుతుంది. జ్ఞాన విజ్ఞాన సమితి, ఆధ్వర్యంలో 1991లో ఉవ్వెత్తున ప్రారంభమైన సాక్షరతా కార్యక్రమంలో యితర ప్రజానీకంతోపాటు వేలాది యు.టి.యఫ్. కార్యకర్తలు ఆహోరాత్రులు పనిచేసి, సాక్షరతా ఉద్యమం మొదటి దశ

పూర్తికావడానికి దోహదపడ్డారు. ఈ మొదటి దశలో ఉప్పొంగిన జన జాగృతిని చవిచూసిన పాలక, దోపిడీ వర్గాల వారు యీ ఉద్యమాన్ని నీరుగార్చ పూనుకొన్నారు. ప్రజా ఉద్యమంగా కొనసాగవలసిన యీ కార్యక్రమాన్ని ప్రభుత్వ కార్యక్రమంగా మార్చడం వలన అది కొంత వెనుకపట్టు పట్టింది. ఈ స్థితిలో సామాజిక స్పృహ, పట్టుదలగల యు.టి.యఫ్. కార్యకర్తలు ప్రజానీకాన్ని కలుపుకొని సాక్షరతా ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోవడంలో తమ కృషిని కొనసాగించాలని యీ మహాసభ కోరుతోంది.

8. విద్య - కేటాయింపులు :

విద్యపై పెట్టుబడి జాతీయోత్పత్తికి దోహదకారి. అయినా తక్షణ లాభాపేక్షగల పెట్టుబడిదారీ వర్గం విద్యపై పెట్టే ఖర్చును అనుత్పాదకమైనదిగా దుష్ప్రచారం చేస్తోంది. కేంద్ర ప్రభుత్వం నియమించిన ఖేర్ కమిటి అందుకు భిన్నంగా విద్యావాప్తికై ప్రణాళికలో 10 శాతం నిధులను కేటాయించాలని సిఫారసు చేసింది. మొదటి పంచవర్ష ప్రణాళికలో 6%పైగా కేటాయించబడిన విద్యానిధులు క్రమేపి తగ్గించబడుతూ నేటికి 2% కంటె తక్కువకు కుదించబడినవి. నానాటికి పెరుగుతున్న విద్యార్థుల సంఖ్యకు తగినన్ని పాఠశాలలను స్థాపించుటకు, ఉపాధ్యాయులను నియమించుటకు యీ నిధులు ఏ విధంగాను సరిపోవు. కనుక ప్రణాళికలలో విద్యకు కనీసం 10% నిధులను కేటాయించాలని యీ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండు చేస్తున్నది.

అత్యధిక అక్షరాస్యతను సాధించిన రాష్ట్రాలలో వార్షిక బడ్జెట్‌లో విద్యాకేటాయింపులు 40% శాతం వుండగా మన రాష్ట్ర బడ్జెట్‌లో అది 25% శాతంకు మించుట లేదు. కనుక మన రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో విద్యా కేటాయింపులు కనీసం 35% శాతం పైగా వుండేటట్లు చూడాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని డిమాండు చేస్తోంది. ఈ కేటాయింపులు కూడా ప్రాధాన్యతను బట్టి ప్రాథమిక, సెకండరీ, ఉన్నత విద్యలకు 3:2:1 నిష్పత్తిలో వుండాలని యీ మహాసభ కోరుతోంది.

9. గ్రామ విద్యా కమిటీలు - పాఠశాలల అప్పగింత :

73, 74 రాజ్యాంగ సవరణలకు అనుగుణంగా రాష్ట్ర పంచాయతీరాజ్ చట్టం రూపొందినది. దానిననుసరించి అధికార వికేంద్రీకరణ పేరుతో పాఠశాలలను గ్రామ విద్యా కమిటీలకు అప్పగించనున్నట్లు ప్రభుత్వం ప్రకటిస్తున్నది. అయితే ప్రజాస్వామ్య మూల సూత్రమైన అధికార వికేంద్రీకరణను ఆహ్వానిస్తునే పాఠశాలలపై, ఉపాధ్యాయులపై గ్రామ విద్యా కమిటీల పెత్తనాన్ని యు.టి.యఫ్. వ్యతిరేకిస్తున్నది. మనది పరిణతి చెందిన ప్రజాస్వామ్యం గాక పోవడం వలన, నిబద్ధతగల రాజకీయ నాయకులు తక్కువగావడం వలన ఉపాధ్యాయులు వేధింపులకు గురయ్యే ప్రమాదం వున్నదని యు.టి.యఫ్. ఆందోళన చెందుతోంది.

అదుచే పాఠశాలల భౌతిక వసతులను మెరుగుపరచే బాధ్యతను గ్రామ విద్యాకమిటీలకు యిస్తూ యాజమాన్య అధికారములను కొఠారి కమిషన్ సూచించిన విధంగా చట్టబద్ధ మైన విద్యా బోర్డులకు అప్పగించాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

10. మాతృ భాషలోనే విద్యాబోధన :

మాతృభాష ద్వారానే విద్యాబోధన సులభమనే అంశం సర్వత్రా అంగీకరించిన విషయం. అందునా ప్రాథమిక విద్య మాతృభాష ద్వారా గరపడం శాస్త్రీయమైనది. విద్యార్థి మాతృభాష ద్వారానే విషయాన్ని సులభంగా ఆకళింపు చేసుకోగలడు కనుక మానసిక శ్రమ, ఒత్తిడి తక్కువగా వుంటుంది. అయినా ఇంగ్లీషు మీడియం మోజులో కొందరు కొట్టుకుపోతున్నారు. ప్రభుత్వ చర్యలూ పరోక్షంగా వారిని ప్రోత్సహిస్తున్నాయి. ఈ వైఖరి సరియైనది కాదు. కావున ప్రాథమిక స్థాయి నుండి ఉన్నత విద్య వరకు మాతృ భాషలోనే బోధన జరుగుటకు తగిన చర్యలు చేపట్టాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

11. మధ్యాహ్న భోజన పథకం అమలు పరచాలి !

పేదరికం కారణంగా ప్రాథమిక పాఠశాలలలో చేరిన విద్యార్థులలో 70శాతం పైగా సెకండరీ విద్యా పూర్తి చేయలేకపోతున్నారని గణాంక వివరాలు తెలియజేస్తున్నవి. దేశంలో 40 శాతం పైగా ప్రజలు నేటికి దారిద్ర్య రేఖకు దిగువనే జీవిస్తున్నారు. ఆ కుటుంబాల వారు తమ పిల్లలను పోషించలేక వారిని బాల్యంలోనే ఏదో ఒక వృత్తిలో ప్రవేశపెడ్తున్నారు. మరో వైపు యీ కుటుంబాల నుండి బడికి వచ్చే పిల్లలలో పోషకాహార లోపం, కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నది. ఆకారణంగా చదువులో చురుకుదనం లేక వారు పాఠశాలలను మధ్యలోనే విడచిపెడుతున్నారు.

పోషకాహార లోపాన్ని నివారించుటకు, పిల్లలందరిని పాఠశాలకు ఆకర్షించే దానికి మధ్యాహ్న భోజన పథకం ఉపకరిస్తుందని గత అనుభవాలు తెలియజేస్తున్నాయి. గత పథకం లోని లోపాన్ని సవరిస్తూ మధ్యాహ్న భోజన పథకాన్ని సెకండరీ పాఠశాలల స్థాయి వరకు విస్తరింపజేయాలని యీ మహాసభ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల్ని కోరుతోంది.

12. కంటింజన్సీలను సక్రమంగా చెల్లించాలి :

1993 సం॥ నుండి రాష్ట్రంలోని పాఠశాలలకు కంటింజెంట్ గ్రాంటును మంజూరు చేయలేదు. 1996-97 విద్యా సంవత్సరానికి యిటీవలె మంజూరయిన గ్రాంటు యింకా పాఠశాలలకు చేరలేదు. ఆ యిచ్చిన గ్రాంటు కూడా కేవలం వేతనాలలో 2% మాత్రమే యిస్తున్నారు. పెరుగుతున్న ధరలలో పెరుగుతున్న పాఠశాల అవసరాలకు యీ కేటాయింపులు చాలవు కావున కంటింజెన్సీలను గతంలోవలె కనీసం 6% చొప్పునైనా సక్రమంగా విడుదలను గతంలోవలె కనీసం 6 శాతం చొప్పునైనా సక్రమంగా విడుదల చేయాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

13. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి :

ప్రాథమిక, సెకండరీ స్థాయిలో విద్యా ప్రమాణాల పెరుగుదలకు వ్యక్తిగత శ్రద్ధ చూపవలసిన అవసరముంటుంది. తరగతి

# సకల [illegible] శుభాకాంక్షలు

## రూ. 100 కోట్ల సంస్థ
## రూ.300 కోట్ల వ్యాపారం దిశగా ముందడుగు
## నిలకడైన అభివృద్ధికి ప్రతిరూపమైన రికార్డు
## శక్తి సామర్థ్యాలతో కలగలసిన భవిష్యత్



**Golden Forests**
**(INDIA) LIMITED**
**AN AGRO FORESTRY CONCERN**
**(A Public Limited Company)**

## సంస్థ అన్నిటికన్నా మిన్న

**ప్రధానాంశాలు :**

★ అత్యధిక రాబడులు
★ భద్రమైన పెట్టుబడి.
★ ఉచిత ప్రమాద భీమా.
★ మురిగిపోయే ప్రమాదంలేని ప్రజాధనం
★ మదుపు చేసిన మొత్తంపై ఋణ సదుపాయం.
★ నిర్ణీత కాలవ్యవధికి ముందే పాక్షికమైన చెల్లింపు.
★ సురక్షిత జీవనోపాధి మార్గం.
★ 30-9-95 నాటికి 75 కోట్ల మెచూరిటి చెల్లింపు.

**వివిధ భూములలో రూ. 10,000కు పైగా ఎకరాలలో విస్తరిస్తున్న G F I L కార్యకలాపాలు**

★ వ్యవసాయాధార అటవీ క్షేత్రాల అభివృద్ధి.
★ గోల్డెన్ ఉద్యాన వనాల (సామాజిక అటవీ క్షేత్రాల) అభివృద్ధి.
★ పర్యాటక విడిదుల (గోల్డెన్ కంట్రీ రిసార్ట్స్) అభివృద్ధి.
★ ఆంధ్ర ప్రదేశ్, కర్నాటక, గుజరాత్, ఉత్తర ప్రదేశ్, హర్యానా, పంజాబ్, హిమాచల్ ప్రదేశ్ వంటి పలు రాష్ట్రాలలో పర్యావరణానికి అనుకూలమైన బస్తీల అభివృద్ధి.

## గోల్డెన్ ఫారెస్ట్స్ (ఇండియా) లిమిటెడ్

[illegible] చండీఘర్
సారథి బిల్డింగ్స్, మెయిన్ రోడ్, తణుకు, [illegible] జిల్లా, ఆంధ్ర ప్రదేశ్

గదిలో విద్యార్థుల సంఖ్య అధికంగా నున్నచో వెనుకబడిన విద్యార్థుల యెడ ప్రత్యేక శ్రద్ధ చూపుటకు సాధ్యం కాదు. కనుక సాధారణ పాఠశాలలో ప్రాథమిక స్థాయిలో ఉపాధ్యాయ,విద్యార్థి నిష్పత్తి 1.20 గాను, సెకండరీ స్థాయిలో 1:30గాను, ఏజెన్సీ ప్రాంత పాఠశాలలో యీ నిష్పత్తి 1:15గా వుండటం ఉపయుక్తమని అనుభవం చాటి చెప్తున్నది. రాష్ట్ర ప్రభుత్వాలు ఆమేరకు ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తిని సవరించి తగిన సంఖ్యలో ఉపాధ్యాయులను నియమించాలని యీ మహాసభ కోరుతోంది.

**14. ఉపాధ్యాయులకు రిఫ్రెషర్ కోర్సులు :**

శాస్త్ర, సాంకేతిక విజ్ఞానము అత్యంత వేగంగా అభివృద్ధి చెందుతోంది. ఫలితంగా నూతనాంశలు సిలబస్‌లో ఉపాధ్యాయులుగా నియమించడం పూర్తిగా చోటు చేసుకొంటున్నాయి. ఉపాధ్యాయుడు నిరంతర అధ్యయనం, పరిశోధన ద్వారా తన బోధనా సామర్థ్యమును పెంచుకొనవసలసివున్నది. అందుకనుగుణంగా ఉపాధ్యాయులకు కనీసం కనీసం మూడు సంవత్సరములకొకసారి రిఫ్రెషర్ కోర్సులను నిర్వహించాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**15. పారా టీచర్స్ నియామక ఆలోచనను విరమించుకోవాలి :**

పాఠశాలల అవసరాలకు అనుగుణంగా ఉపాధ్యాయుల నియామకం చేయుటలో రామకృష్ణరావు కమిటి చేసిన పారా టీచర్స్ నియామక సిఫారసుకు వ్యతిరేకంగా 1995 ఆగష్టులో ఉపాధ్యాయ ఉద్యమం పెద్ద ఎత్తున తన నిరసనను తెలియజేసింది. అ కాలంలోనే అధికార మార్పిడి జరిగి ముఖ్యమంత్రి అయిన శ్రీనారా చంద్రబాబు నాయుడు ఉపాధ్యాయ సంఘాలతో చర్చించకుండా రామకృష్ణరావు కమిటీ సిఫారసుల అమలుకు పూనుకోనని హామి యిచ్చారు. కాని అందుకు విరుద్ధంగా ఆయనే స్వయంగా పాఠశాలల అవసరాల మేరకు పారా టీచర్సును నియమించాలనుకుంటున్నట్లు, యిటీవల ప్రకటించారు. కనీసం విద్యార్హతలు, శిక్షణ లేని వారిని ఉపాధ్యాయులుగా నియమించడం పూర్తిగా అశాస్త్రీయం. కనుక పారా టీచర్సు నియామక ఆలోచనను విరమించుకొని, వారి స్థానంలో నిర్ణీత అర్హతలున్న వారినే నియమంచాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని యీ మహాసభ డిమాండు చేస్తోంది.

**16. పాఠశాలల స్పెషల్ ఫీజు రీ-యింబర్స్‌మెంటు :**

ప్రాథమికోన్నత, సెకండరీ పాఠశాలలో చదువుచున్న ఎస్.టి., ఎస్.సి., బి.సి. విద్యార్థుల నుండి స్పెషల్‌ఫీజు వసూలుకు మినహాయింపు వున్నది. ప్రభుత్వం రీయింబర్స్ చేయవలసిన ఆ మొత్తములను సక్రమంగా పాఠశాలలకు చెల్లించకపోవడం వలన పాఠశాల కో-కరిక్యులర్ కార్యక్రమాలు కుంటుపడుచున్నాయి. కనుక ప్రతి సంవత్సరం ఆగష్టు నెల చివరికి అట్టి రీయింబర్స్‌మెంటు పాఠశాలలకు అందేలాగున చర్యలు తీసుకోవలసినదిగా యీ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతోంది.

**17. ఐదవ వేతన సంఘ సిఫారసులను సవరించి అమలు చేయాలి :**

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల వేతన సవరణ కొరకు నియమించబడిన ఐదవ వేతన కమీషన్ సిఫార్సులనేకం ఉద్యోగ వర్గానికి, నిరుద్యోగ యువతకు వ్యతిరేకంగా వున్నాయి. క్రింది స్థాయి ఉద్యోగాల రద్దు, ఖాళీగానున్న 3.5 లక్షల ఖాళీలలను రద్దు చేయడం, మొత్తం ఉద్యోగాలలో కోత, కాంట్రాక్టు పద్ధతి ప్రవేశపెట్టడం, ప్రభుత్వ సర్వీసులను కుదించడం వంటి సిఫారసులు ప్రపంచ బ్యాంకు నిర్దేశిత సూత్రాలకు అనుగుణమైనవే తప్ప దేశ ప్రయోజనాలకు గాని, ఉద్యోగుల ప్రయోజనాలకు గాని, ఉపయోగపడేవి గావు. దీనికి వ్యతిరేకంగా పోరాడుతున్న కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు యీ మహాసభ తన సంఘీభావాన్ని ప్రకటిస్తూ, ఉద్యోగుల డిమాండ్ మేరకు యీ సిఫారసులను సవరించి అమలు చేయాలని యీ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతోంది. 5వ వేతన సంఘ సిఫారసు చేసిన వేతన స్కేళ్ళను రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు వర్తింపజేయాలని రాష్ట్ర ప్రభుత్వాన్ని యీ మహాసభ కోరుతోంఇ.

**18. అన్ని స్థాయిలలోను అన్ని భాషల పండితులను నియమించాలి :**

పాఠశాలలో యిప్పుడున్న భాషా పండితులతోపాటు ప్రాథమిక స్థాయిలో మాతృభాషను బోధించుటకు ఆయా భాషా పండితులను నియమించాలని, ప్రాథమికోన్నత సెకండరీ పాఠశాలలో ఇంగ్లీషును బోధించడానికి ఇంగ్లీషులో ప్రత్యేక అర్హతలున్న పండితులను నియమించాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**19. నాన్ డిటెన్షన్ విధానాన్ని కొనసాగించాలి :**

డిటెన్షన్ విధానాన్ని పునరుద్ధరిస్తామని రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రకటనలు చేస్తున్నారు. శాస్త్రీయ పద్ధతుల్ని విడనాడి కేవలం "రిజల్టు ఓరియంటెడ్"గా చూస్తున్న పరిస్థితులో ఉత్తీర్ణతా శాతం పెంచడానికి డిటెన్షన్ విధానమే పరమౌషధమని వాదనలు వినవస్తున్నాయి.

వాస్తవానికి విద్యా ప్రమాణాలు పరీక్షలపై ఆధారపడిలేవు. ప్రమాణాలకు పరీక్షలనే గీటురాళ్ళుగా తీసుకోవడం అశాస్త్రీయం. పరీక్ష చేయడం ద్వారా, విద్యార్థి స్థాయిని గుర్తించడం లోపాల్ని సరిదిద్దడం, స్థాయిని పెంచడం నిరంతరం జరగవలసిన ప్రక్రియ. ఏదో ఒక విషయంలో వెనుకబడినంత మాత్రాన విద్యార్థిని అదే తరగతిలో నిలుపుదల చేయడం, సరిగాదని అశాస్త్రీయమని 1971లో నాన్-డిటెన్షన్ విధానాన్ని ప్రవేశపెట్టారు.

అయితే పాఠశాలలు దయనీయ పరిస్థితులలో వున్నాయి. ఉపాధ్యాయ, విద్యార్థి నిష్పత్తి ప్రకారము ఉపాధ్యాయులు లేరు. ఉన్న ఉపాధ్యాయులకు నిరంతర శిక్షణ యివ్వడం లేదు. తగినంతగా బోధనోపకరణములు లేవు. బడి వాతావరణం ఆహ్లాదకరంగా వుండటం లేదు. ప్రమాణాలకు ఆటంకంగా నున్న ఈ అంశాలను సరిచేయడానికి, నిర్వహణా లోపాలను సరిద్దిటానికి పూనుకోవాలని, డిటెన్షన్ విధానాన్ని పునరుద్ధరించాలనే ఆలోచనను విరమించుకోవాలని ఈ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**20. ఆదాయం పన్ను చెల్లింపుకు పరిమితిని పెంచాలి :**

ధరలు విపరీతంగా పెరగడంతోపాటు, రూపాయి విలువ నానాటికి బాగా పడిపోతున్నది, అకారణంగా వేతనాలు అంకెల్లో

పెరుగుచున్నప్పటికి నిజ వేతనాలు విపరీతంగా పడిపోతున్నాయి. ఆదాయ పన్ను చెల్లింపుకు ప్రస్తుతమున్న రు. 40 వేల పరిమితి చాలా తక్కువ. కనుక ఆదాయ పన్ను చెల్లింపునకు ఆదాయ పరిమితిని రూ. 75 వేలకు పెంచవలసినదిగా ఈ మహాసభ కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**21 విద్యా విషయక నిర్ణయాలలో ఉపాధ్యాయుల పాత్ర :**

విద్యా రంగం నిత్యం అనేక ప్రయోగాలకు గురిచేయబడుతున్నది. తరచు పాఠ్య గ్రంథాలు మార్చబడుతూ వున్నాయి. మార్పులు చేసేటప్పుడు బోధనా కార్యక్రమంలో వాస్తవంగా పాల్గొనే ఉపాధ్యాయుల యొక్క అభిప్రాయాలను సూచనలను పరిగణనలోకి తీసుకోవాలని, విద్యా విషయక విధాన నిర్ణయాలలో ఉపాధ్యాయ సంఘాలకు ప్రాతినిధ్యము కల్పించాలని యీ మహాసభ రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుతోంది.

**ఉపాధ్యాయుల సమస్యలపై తీర్మానములు :**

అ జనరల్ :

1. 1996 జులై నుండి, 1997 జనవరి నుండి వినిమయ ధరల సూచికకు అనుగుణంగా పెంచవలసిన కరువుభత్యంను పెంచుతూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులివ్వాలి.
2. 1996 మార్చి నుండి ఏజన్సీ అలవెన్సులను కొనసాగిస్తూ ఉత్తర్వులివ్వాలి.
3. మెడికల్ ఇన్‌వాలిడేషన్‌పై రిటైరైన వారి కుటుంబ సభ్యులకు కంపాషనేట్ అపాయింట్‌మెంట్ సౌకర్యమును యథావిధిగా కొనసాగించాలి.
4. నాలుగైదు రెట్లుగా పెంచిన వృత్తిపన్నును వెంటనే తగ్గించాలి.
5. పనిదినాల ప్రాతిపదికగా ఉపాధ్యాయులకు సంవత్సరానికి 20 రోజులు సంపాదిత సెలవు జమచేయాలి.
6. అవినీతికి అలవాలంగానున్న ప్రస్తుత పద్ధతిని సవరించి, ఉపాధ్యాయులు యల్.టి.సి.ని రెగ్యులర్‌గా వినియోగించుకొనే సదుపాయం కల్పించాలి.
7. ఆరోగ్య అవసరాలకు అయిన వైద్య ఖర్చును నూరు శాతం ప్రభుత్వమే చెల్లించాలి.
8. నోషనల్ యింక్రిమెంట్లను ఆటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కీముకు పరిగణన లోనికి తీసుకోవాలి.
9. 1993 నుండి కంటింజెంట్ బకాయీలను చెల్లించాలి. ప్రస్తుత అవసరాలకు తగినట్లు కంటింజెంట్ నిధులను పెంచాలి.
10. సాక్షరతా ఉద్యమంలో వేసవిలో పనిచేసిన ఉపాధ్యాయులకు సంపాదిత సెలవును యివ్వాలి.
11. జి.ఓ. యం.యస్. నెం. 75 మరియు జిఓ. యం.యస్. నెం. 297లను ఉపాధ్యాయులకు కూడా వర్తింపజేయాలి.
12. నగరాలలో పనిచేసే ఉపాధ్యాయులకు బస్‌పాస్ సౌకర్యాన్ని వర్తింపజేయాలి.
13. తిరుపతి వంటి యాత్రాస్థలాలలో పనిచేసే ఉపాధ్యాయులకు ప్రత్యేక యాత్రా స్థల అలవెన్సును మంజూరు చేయాలి.
14. అన్ని రకాల సెలవులు, యింక్రిమెంట్లు మంజూరు చేయు అధికారమును సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు యివ్వాలి.
15. సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులు వేసవిలో పనిచేసినందుకు 94-95 సం॥ నుండి యివ్వవలసిన సంపాదిత సెలవుపై ఉత్తర్వులివ్వాలి.
16. ఏజెన్సీ ఉపాధ్యాయులకు సర్వీసు రూల్సును తయారు చేసి, వారిని ప్రభుత్వ ఉపాధ్యాయులతో సమానంగా పరిగణించాలి.
17. నిమ్స్ వంటి సంస్థలలో పొందిన చికిత్సతోపాటు, గుర్తించబడిన వ్యాధులకు యితర చోట్ల పొందిన చికిత్సకు కూడా 100% మెడికల్ రీయింబర్స్‌మెంట్‌ను యివ్వాలి.
18. పం.రాజ్ పాఠశాలలో పనిచేస్తున్న పార్ట్‌టైం కంటెంజెట్ ఉద్యోగులను చివరి శ్రేణి ఉద్యోగులుగా రెగ్యులరైజ్ చేయాలి.
19. అన్ని యాజమాన్యాలలోని ఉపాధ్యాయ ఖాళీలు వెనువెంటనే భర్తీ అగులాగున చర్యలు చేపట్టాలి.
20. ఎనామలీస్ కమిటి, హైపవర్ కమిటి, పెన్షన్ కమిటి వంటి కమిటీలు యిచ్చిన సిఫారసులను ప్రకటించి అమలు పరచాలి.
21. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు గృహ సంబంధమైన కారణాలపై కమ్యుటేషన్ సెలవును వినియోగించుకొనుటకు అనుమతించాలి.
22. హైదరాబాదు నగరంతో సమానంగా విశాఖ, విజయవాడ, వరంగల్ నగరాలకు సి.సి.ఎ. చెల్లించాలి.
23. 1996 మార్చి 15 యు.టి.యఫ్. రాష్ట్ర కౌన్సిల్‌లో ముఖ్యమంత్రి యిచ్చిన హామీల మేరకు ఉత్తర్వులు యివ్వాలి.
24. ప్రభుత్వం ఉపాధ్యాయ సంఘాలకు గతంలో యిచ్చిన హామీలను అమలు పరచాలి.

ఇ) వివిధ యాజమాన్యాలు, కేడర్ల ప్రత్యేక సమస్యలు :

1) అప్రెంటిస్ టీచర్లు :

1. అప్రెంటిస్ టీచర్లు అని పేరుపెట్టి రెగ్యులర్ పోస్టులలో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు యిరెగ్యులర్‌గా స్టైఫెండ్‌ను చెల్లిస్తున్న పద్ధతిని ఉపసంహరించుకోవాలి వారికి టైం స్కేలును యివ్వాలి.
2. వారి సర్వీసును రెగ్యులర్ సర్వీసుగా పరిగణించి వారికి వార్షిక యింక్రిమెంట్లను మంజూరు చేయాలి.
3. అదనపు యింక్రిమెంట్లు, అలవెన్సులు వంటి సౌకర్యాలన్నిటిని వారికి వర్తింపజేయాలి.
4. జీతాలను చెల్లించుటలో వున్న సాంకేతిక నియమాలను సవరించి వారికి రెగ్యులర్‌గా జీతాలను చెల్లించాలి.

2) స్పెషల్ టీచర్లు :

1. స్పెషల్ టీచర్లగా పనిచేసిన కాలాన్ని ఆటోమేటిక్ అడ్వాన్సుమెంటు స్కీమునకు, పెన్షనరీ బెనిఫిట్స్‌కు సర్వీసుగా పరిగణించాలి.
2. హాఫ్-ఎ-మిలియన్ స్కీములో పనిచేసిన ఉపాధ్యాయులకు కూడా కాలాన్ని సర్వీసుగా పరిగణించాలి.
3. కోర్టు ఉత్తర్వుల ద్వారా పనిచేస్తున్న క్వాలిఫైడ్ టీచర్లకు రూ. 398/-ల స్థానే రెగ్యులర్ టైం స్కేలును యివ్వాలి.

3. ఎయిడెడ్ ఉపాధ్యాయులు :

1. ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలపై బడ్జెటు కంట్రోలును తొలగించి, వారికి రెగ్యులర్‌గా జీతాలందే విధంగా చర్యలు గైకొనాలి.
2. వారికి 1993 పి.ఆర్.సి. బకాయిలను చెల్లించాలి.
3. వారి పి.యఫ్. ఖాతాలపై యితర ఉపాధ్యాయులు, ఉద్యోగులకు వలె 12% వడ్డీని చెల్లించాలి.
4. ప్రభుత్వ, స్థానిక సంస్థల ఉపాధ్యాయులతోపాటు వారికి యల్.టి.సి. సౌకర్యమును వర్తింపజేయాలి.
5. ఇతర ఉద్యోగులతోపాటు వారికి మెడికల్ రీయింబర్స్‌మెంటు సౌకర్యాన్ని కల్పించాలి.
6. ఎయిడెడ్ ప్రాథమిక ఉపాధ్యాయులకు 1933 సెలవు నిబంధనలను వర్తింపజేయాలి.

4. పం. రాజ్ ఉపాధ్యాయులు :

1. జి.ఓ. 40లో వున్న లోపాలను సవరించి ప్రభుత్వ ఉపాధ్యాయులతో సమానంగా అన్ని రకాల ప్రమోషన్లు వారికి యివ్వాలి.
2. జూనియర్ లెక్చరర్స్‌గా ప్రమోషన్‌లు యిచ్చుటలో జరుగుచున్న జాప్యాన్ని నివారించి వారికి వెంటనే ప్రమోషన్లు యివ్వాలి.
3. సుందరేశన్ కమిటి (ఓ.యం.సి.) సిఫారసుల మేరకు సర్వీసు నిబంధనలను రూపొందించిన అర్హులైన వారందరికి ప్రమోషన్లు నివ్వాలి.
4. జి.ఓ. 40 పై పెండింగులోనున్న కోర్టు కేసులు త్వరగా పరిష్కారమయ్యేటట్లు చూడాలి. ఈలోగా అడ్‌హాక్ ప్రాతిపదికగా ఏ మేనేజ్‌మెంట్‌కు ఆ మేనేజిమెంటు ప్రమోషన్లు యిచ్చే అవకాశం కల్పించాలి.

5. మున్సిపల్ టీచర్లు :

1. మున్సిపల్ ఉపాధ్యాయులకు జీతాల చెల్లించు విధానాన్ని సరళీకృతం చేసి, ప్రతినెల మొదటి తేదీన జీతాలు చెల్లించాలి.
2. వారి పి.యఫ్. ఖాతాలను సక్రమంగా నిర్వహిస్తూ వాటిపై 12% వడ్డీని చెల్లించాలి.
3. మున్సిపల్ ఉపాధ్యాయుల సర్వీసును కూడా ప్రావిన్షియలైజ్ చేయాలి.




# సంఘ నివేదిక

**శ్రీ ఎ. వెంకటస్వామి**
యు.టి.యఫ్. ప్రధాన కార్యదర్శి

అధ్యక్షా!

కామ్రేడ్స్ !!

మన ఉద్యమానికి 22 సంవత్సరాలు నిండి 23వ సంవత్సరంలో అడుగుపెట్టింది. అట్టి ఉద్యమాన్ని కంటికి రెప్పలా కాపాడి చెన్నుపాటి ఆశయాలబాటలో ప్రగతి పథంలో నడిపి, సప్తమ విద్యామహాసభలకు తరలి వచ్చిన తమందరకు స్వాగతం.

ప్రథమ మహాసభలు తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో అక్టోబరు 20, 21 తేదీలలో, ద్వితీయ మహాసభలు ఖమ్మంలో 1997 ఆగష్టు 17, 18 తేదీలలో, తృతీయ మహాసభలు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో 1981 ఆగష్టు 16, 17, 18 తేదీలలో, చతుర్థ మహాసభలు 1986 జనవరి 8, 9, 10 తేదీలలో కృష్ణాజిల్లా విజయవాడలో, 5వ మహాసభలు నెల్లూరులో 1989 జూన్ 22-25 తేదీలలో, 6వ మహాసభలు గుంటూరులో 1993 ఆగష్టు 8,9,10 తేదీలలో జరుపుకున్నాము.

ప్రస్తుతం ప్రకాశంజిల్లా ఒంగోలులో సప్తమ మహాసభలు 1997 మార్చి 8,9,10 తేదీలలో జరుపుకుంటున్నాము. ఆర్థికంగాను, విద్య, సాంస్కృతిక, సాహిత్యాలపరంగాను మహాసభలు మరింత ముందడుగు వేయనున్నవి.

ఆహ్వాన సంఘం అనేక కష్టాలతో, అశేష త్యాగాలతో, అకుంఠిత దీక్షతో, అహర్నిశలు కృషి చేసి ఇన్ని ఏర్పాట్లు చేసినందులకు కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాము.

**అంతర్జాతీయరంగం** : బడుగు-ధనిక దేశాల మధ్య అంతరం పెరగడమేకాదు రాజకీయవలసలు స్థానే ఆర్థిక వలసల్ని పెట్టుబడీదారీ దేశాలు స్థాపించుకుంటున్న కాలమిది. వనరులపై, మార్కెట్‌పై, సంస్కృతిపై కళలపై శాస్త్రంపై అగ్రరాజ్యాలు పెత్తనం కోసం ప్రపంచమంతా తమ కనుసన్నల్లో మెలగాలని శాసిస్తున్న కాలమిది. దీనికోసం సిద్ధాంతాల్ని ప్రవచిస్తున్నారు. ఇవేవీ చాలనపుడు మిలటరీని దించుతున్నారు. బెదిరిస్తున్నారు. అంతర్గత సంక్షోభాలు సృష్టిస్తున్నారు. సోషలిష్టు శిబిరం పతనంతో ఈ ధోరణి వేగం పుంజుకోవడమేగాదు. అన్ని విలువల్ని వదలిలేసి నిస్సిగ్గుగా అగ్రరాజ్యాలు బరితెగిస్తున్నాయి.

క్యూబాపై ఆర్థిక అంక్షలు విధించిన అమెరికా క్యూబాతో ఆర్థిక ఒప్పందాలు కుదుర్చుకొనే విదేశీ కంపెనీలపై కూడా అంక్షలు విధించింది. ఇరాక్‌లోని ఓ భాగంలో చిచ్చుపెట్టి అక్కడ 'ప్రజస్వామ్య రక్షణ' కోసం అంటూ దాదాపు దాడి చేసినంత పనిచేసింది. చమురు అమ్ముకోవడానికి వీల్లేకుండా చేసింది. ప్రజలు ఆకలితో రోగాలతో అలమటిస్తున్నా కనికరింపులేదు. మధ్య ఆసియాలో తన ఆయిల్ వ్యాపారం కోసం ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబాన్లను పాకిస్తాన్‌ను పావుగా చేసుకొని ప్రోత్సహించింది. పచ్చి మతఛాందసాన్ని ఆఫ్ఘన్లపై రుద్దింది. బెదిరింపులతో మన 'అగ్ని' క్షిపణి ప్రయోగాన్ని వాయిదా వేయించింది. క్రయోజనిక్ రాకెట్‌ను రష్యా నుంచి రానీకుండా చేసింది. ఒకవైపు 'ప్రజాస్వామ్యం', 'మానవహక్కులు' అని చైనాను ఇరకాటంలో పెట్టడానికి గొంతుచించుకొనే అమెరికా బర్మాలో, థాయ్‌లాండ్‌లో ప్రజాస్వామ్య నేతల్ని ఎంత హింసించినా పెదవి విప్పదు. 'స్టీవ్‌బేకు'ను ఒకనాటి జాతిదురహంకార దక్షిణాఫ్రికా అధికార్లు, రాజకీయవేత్తలు అధికారికంగా చంపించినట్టు ఇటీవల వెల్లడైంది. దీనిపై అమెరికా ఒక్కమాటా మాటాడలేదు. ఇలా ఎన్నైనా చెప్పొచ్చు.

ప్రచ్ఛన్నయుద్ధం అంతమైంది. రష్యా బలహీనపడింది మరి అమెరికా తన యుద్ధోన్మాదాన్ని మానుకొందా? సైనిక కూటముల్ని వదులుకుందా? లేదు. పైగా 'నాటో'ను విస్తరించి పటిష్టం చెయ్యడం తమ మొదటి కర్తవ్యమని క్లింటన్ పేర్కొంటున్నాడు.

'గాట్' ప్రపంచ వాణిజ్య సంస్థగా (WTO) అవతారమెత్తింది అంతర్జాతీయ వ్యాపార వాజ్యాలు అగ్రరాజ్యాల కనుకూలంగా మార్చే యత్నం ముమ్మరం చేసింది. దిగుమతులపై అన్ని అంక్షలూ తొలగించాలని వర్థమానదేశాల్ని శాసిస్తోంది. 'సామాజికాంశాల్ని' కూడా ఒప్పందంలో చేర్చాలని పట్టుబడుతుంది. పేటెంట్ చట్టాల్ని శాసనాలుగా మార్చాలని అన్ని దేశాల్ని ఆదేశిస్తోంది. పన్నుల్ని సంపన్నులకనుకూలంగా సవరించడం, సబ్సిడీలకు మంగళం పాడటం, ఉద్యోగాలు తగ్గించడం, ప్రభుత్వ రంగాన్ని అమ్మడం ఇలా ఒకదాని వెంట మరొక షరతు ప్రపంచ బ్యాంకు విధిస్తోంది.

ఫలితంగా ఆర్థిక స్వావలంబన బడుగుదేశాలకు గగన కుసుమంగా మారుతోంది. దీనికనుగుణమైన సంస్కృతి తృతీయ ప్రపంచ ప్రజలపై రుద్దబడుతోంది. స్టార్ టి.వి. జనం మెదళ్ళపై దాడి చేస్తోంది. అందాల పోటీలు పొట్టకూటికి లేని దేశాలకు ఫ్యాషన్‌గా మారుతున్నాయి. 'పాప్' సంగీతం బడుగుజనాల నరాల్ని వెర్రెత్తిస్తోంది. వినియోగ వస్తువుల పిచ్చి ముదురుతోంది.

"కళలైనా శాస్త్రమైనా ప్రతిదీ వ్యాపారమే. ప్రతిదీ లాభంకోసమే. బతకడానికి గొంతులు కోసుకొనే పోటీ పడాల్సిందే. బలహీనుడు చావాల్సిందే. అసలు మానవుడే సంపదలు సృష్టించే యంత్రం. సరుకులే

సరస్వతి. అతనికే పరమార్థమూ లేదు." ఇదే ప్రపంచ గమన సూత్రం ఇదీ సంక్షిప్తంగా నేటి అగ్రరాజ్యాల సిద్ధాంత ప్రవచనం.

ఈ నేపధ్యంలో ప్రపంచ వ్యాప్తంగా పలుపరిణామాలు జరుగుతున్నాయి. కొందరు రాజీపడుతున్నారు. కొందరు దివాళా తీస్తున్నారు. కొందరు ముందుగా జాగ్రత్త పడతున్నారు. కొందరు చేతులు కాలాక ఆకులు పట్టుకొంటున్నారు. కొందరు ఎదిరించి నిలబడుతున్నారు. ప్రజల్నుంచి ప్రతిఘటన ఎదురవుతుంది. దీన్ని అణచివేసేందుకు యత్నాలు జరుగుతున్నాయి. మొత్తం మీద ఎడాపెడా ఈ ఘర్షణ పెరుగుతుంది. ప్రతిఘటనగా మారుతుంది. ఇదీ నేటి చరిత్ర అసలు గమనసూత్రం, సారాంశమూనని మనం గమనించాలి.

అల్జీరియా, టర్కీ, ఆఫ్ఘనిస్తాన్లలో మతశక్తులు బలం పుంజుకొన్నాయి. ప్రజాస్వామ్య శక్తులకు సవాలుగా ఇవి నిలుస్తున్నాయి. తాలిబాన్లు మరీ ఛాందసులు. ఆడపిల్లల చదువుల్ని. టి.వి.లని చివరికి ఫోటోల్ని కూడా నిషేధించి మధ్య యుగశిక్షలు విధిస్తున్నారు. పాకిస్తాన్‌లో ఎన్నికలు జరిగాయి. బెనజీర్ దిగిపోయింది. "పాకిస్తాన్ ప్రజలు ఇండియాతో ఘర్షణను కోరుకోవడం లేదని ఎన్నికల్లో తీర్పునిచ్చారు" ని ఆమె వ్యాఖ్యానించింది. అమెరికా నుండి ఆయుధాలు మాత్రం అందుతూనేవున్నాయి. కొత్త ప్రభుత్వంవల్ల ఏదో జరుగుతుందని ఆశించలేము. యుద్ధం, అంతర్గత సంక్షోభాలు పెట్టుబడీదారీ ఆర్థిక విధానాల ఫలితంగా పాకిస్తాన్ ప్రజలు సతమతమవుతున్నారు. బంగ్లాలో హసీనా ప్రభుత్వం ప్రజాస్వామికంగా వ్యవహరిస్తోంది. ఫరక్కా ఒప్పందం ఒక కొలిక్కి వచ్చింది. త్రిపురలో చొరబాటుపై హామీ లభించింది. ఇరుదేశాల మధ్య స్నేహం పెరుగుతోంది. శ్రీలంక జాతుల మధ్య కలతలు అలానే వున్నాయ్. LTTE మనదేశ ఉగ్రవాద సంస్థలతోనూ సంబంధాలు కొనసాగిస్తోంది.

సోషలిజం అంతరించాక మాజీ కమ్యూనిస్టు దేశాలు సంక్షోభంతో ఉడికిపోతున్నాయి. ఫలితంగా పోలెండులోనే తిరిగి కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు. రష్యాలో పరిస్థితి మరీ దారుణం. ఉత్పత్తి 45 శాతానికి పడిపోయింది. ఫ్యాక్టరీలే గాదు స్కూళ్ళు సైతం మూతబడ్డాయి. నెలల తరబడి జీతాల్లేక కార్మికులు, ఉపాధ్యాయులు తిరగబడుతున్నారు. మహోన్నత 'రెడ్‌ఆర్మీ' ప్రాభవం పోగొట్టుకొని చెచాన్యాలో పరాభవం పాలైంది. పొట్టకూటికి కరువై సైన్యం విలవిల లాడుతుంది. ఎల్సిన్ టి.వి. ప్రభావంతో గట్టెక్కినా రాష్ట్రాల గవర్నర్లు ప్రతిపక్షంవారే గెలిచారు. పార్లమెంటులో మెజారిటీలేదు. లెబెడ్ ను పైకెక్కించి పబ్బం గడుపుకొని ఇంటికి పంపి ఎల్సిన్ తన కృతఘ్నతను చాటుకొన్నాడు. ప్రజల్నుంచి ప్రతిఘటన తీవ్రంగా పెరుగుతోంది. లెనిన్ స్టాలిన్‌లను కీర్తిస్తూ ప్రదర్శనలు చేస్తున్నారు.

చైనాలో డెంగ్ అస్తమించగానే ఏదో సంక్షోభం జరుగుతుందని పాశ్చాత్యదేశాలు భ్రమపడ్డాయి. ఆశలు పెట్టుకొన్నాయి. అదేమీ జరగలేదు. అజేయంగా అటు రాజకీయంగానూ, ఇటు ఆర్థికంగానూ చైనా సుస్థిరంగా వుంది. 21వ శతాబ్దారంభానికి చైనా అగ్రశక్తిగా మారుతుందని ప్రతి ఒక్కరూ అంగీకరిస్తున్నారు. 1997 జూన్ నాటికి హాంగ్‌కాంగ్ చైనాలో విలీనం కాబోతోంది. ఎన్ని ఆంక్షలు విధించినా క్యూబా మేరునగధీరంగా నిలబడివుంది. అమెరికా ఆంక్షల్ని కాలదన్ని కెనడా సైతం క్యూబాతో ఒప్పందాలు కుదుర్చుకోడం ముదావహం.

ఎంతో 'అభివృద్ధి' చెందిన జపాన్‌లో రోజుకొక కుంభకోణంతో ప్రతి ప్రధానమంత్రి గబ్బు పట్టాడు. మోడల్‌గా మనవారు చూపించే దక్షిణకొరియ అవినీతి నేతల్లో అగ్రస్థానంలో వుంది. ఈ మధ్య నెలరోజులపాటు జరిగిన కార్మికుల సమ్మె ప్రపంచ బ్యాంకు నిర్దేశాల ఫలితాన్ని చూపిస్తోంది. ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా ఫ్రాన్స్ కార్మికవర్గం జనరల్ సమ్మెకు దిగింది. తూర్పుజర్మనీ ప్రజానీకం పెట్టుబడిదారీ భ్రమల్లోంచి నాలుగేళ్ళలోనే తేరుకొంది. పశ్చిమ జర్మనీ పెట్టుబడుల బండారం, నిరుద్యోగం రూపంలో అక్కడ బయటపడింది. మెక్సికో పాశ్చాత్య దేశాల కబంధ హస్తాల్లో నలిగి అందరికీ గుణపాఠం నేర్పింది. 'జపాన్‌లోని రైతాంగ తిరుగుబాటు అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. విద్య, ఆరోగ్యం, ప్రమాణాలు అమెరికా నుండి అర్జంటీనా దాకా ప్రతిచోట పడిపోతున్నై,

**జాతీయరంగం :** సరిగ్గా ఈ వినాశకర విధానాలు పాటించి, ప్రజా ప్రతిఘటననుకొని తెచ్చు కొన్నందువల్లే కాంగ్రెసు పార్టీ కేంద్రంలో ఓడిపోయింది. స్కాములు, కుంభకోణాలు కూడా ఈ విధానాల ముద్దుబిడ్డలే. తర్వాత 13 రోజుల బి.జె.పి. ప్రభుత్వం వచ్చింది. ఎంత ప్రయత్నించినా ఒక పార్టీని కూడా అది కలుపుకోలేకపోయింది. భారత సామాజిక వ్యవస్థలోని లౌకిక భావాల పునాదులే దీనిక్కారణం. తర్వాత 13 పార్టీల యునైటెడ్ ఫ్రంటు ప్రభుత్వం వచ్చింది. గత్యంతరములేక కాంగ్రెసు దాన్ని బలపరుస్తోంది. తన ఆర్థిక విధానాల్ని ఈ ప్రభుత్వం చేత కొనసాగింపజేయాలని రోజా బెదిరిస్తుంది.

యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వంతో భారత రాజకీయ వ్యవస్థలో ఏకపార్టీ అధికారానికి రోజులు చెల్లాయి. రాష్ట్రాల్లో ఏ పార్టీ మూడు నాలుగింటికి మించి రాష్ట్రాల్లో అధికారంలో లేదు. అక్కడ కూడా బహుపార్టీల కలయికలే. ఫలితంగా రాష్ట్రాలకూ కేంద్రానికీ మధ్య ఘర్షణ బాగా తగ్గింది. సామరస్యం పెరిగింది. ఇది మంచి పరిణామం. ఈశాన్య రాష్ట్రాలకు కేంద్రం నిర్ణయించిన సాయం రాష్ట్రాలపట్ల కేంద్రానికి గల బాధ్యతాయుత వైఖరికి మచ్చుతునక. అలాగే రాష్ట్రాల్లో చీటికి మాటికి జోక్యాలు, సంక్షోభాలు సృష్టించడాలూ ఇప్పుడులేవు.

కావేరీ నదీ జలవివాదం, ఆల్మట్టి సమస్య ఫ్రంట్ నేతల నిష్పక్షపాతాన్ని ప్రశ్నిస్తున్నాయి. ఆల్మట్టిపై ముఖ్యమంత్రుల కమిటీ చొరవచూపడం హర్షనీయం. సి.యం.పి. మార్గదర్శకంగా సమిష్టి నిర్ణయాలతో నడిస్తే యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం మంచి పాలనను ఇవ్వగల్గుతుంది.

అయితే ఇది అంత సులభంగాదు. విదేశీ స్వదేశీ ఒత్తిడులు తక్కువగా లేవు. ఫ్రంట్‌లోని చాలా పార్టీలు కాంగ్రెసు కన్నా భిన్నమైనవి గావు. వీరికి కార్పొరేట్ సెక్టార్‌పై వున్న ప్రేమాభిమానాలు ప్రభుత్వరంగంపై లేవు. ఆర్థికమంత్రి పరిశ్రమల మంత్రీ ఈ కోవలోని వారే. పెట్రోలు, గోధుమలు, చక్కెర ధరలు పెంచి ఇప్పటికే ప్రజల్నుంచి వ్యతిరేకత తెచ్చుకున్నారు. భూసంస్కరణలు ఊసేలేదు. వ్యవసాయోత్పత్తులు నూతనార్థిక విధానాల వల్ల తగ్గిపోతున్నాయి. ప్రజాపంపిణీ వ్యవస్థను పటిష్టం చెయ్యడం, ప్రజారోగ్యం, విద్యలపై ఎక్కువ ఖర్చు చెయ్యడం సి.యం.పి.లోని ముఖ్యాంశాలు ఇవి అమలుకాలేదు.

ఒరిస్సా విద్యుత్‌బోర్డును విడదీసి అమ్మేశారు.. వేలాదిమంది ఉద్యోగులు బజారునబడ్డారు. దీన్ని కేంద్రం ప్రోత్సహిస్తోంది. సింగపూర్‌లో WTO షరతుల్ని కేంద్రం ఆమోదించింది. పేటెంటు చట్టాల్ని మార్చి శాసనం తేవాలనే ప్రయత్నం జరుగుతుంది. LIC ప్రైవేటీకరణకు దారి సుగమం చేస్తూ ముందుగా విదేశీ LIC కంపెనీలకు ద్వారాలు తెరుస్తున్నారు.

1997 ఆర్థిక సర్వే ఈ మధ్య విడుదలైంది. అంకెల గారడీ తప్ప అందులో ఆశావహంగా ఏమీలేదు. ఇందులోంచి బయటపడటానికి ప్రభుత్వరంగ సంస్థల్ని అమ్మాలని కేంద్రం చూస్తోంది. పెట్టుబడుల ఉపసంహరణల ద్వారా 5000 కోట్లు పొందాలని తీర్మానించింది. కానీ 96-97లో నరసింహారావు ఇలానే రు. 7000 కోట్లు సంపాదించాలని చూచి రు. 1000 కోట్లు రాక చతికిలబడ్డాడు. లాభాలు తెచ్చే సంస్థల్నే ఎవరైనా కొంటారు. అందుకే ప్రభుత్వం SAIL, VSNL, GAIL, ONGC, MTNL, AIR INDIA, SCI, NTPC, ITC వంటి సంస్థల్ని అమ్మజూపుతుంది. నిజానికి 245 ప్రభుత్వరంగ సంస్థల్లో నష్టాలు వస్తున్నవి 109 మాత్రమే. అందులోనూ 47 గతంలో ప్రైవేటు రంగంలో వుండి దివాళా తీస్తే కేంద్రం తీసుకొన్నవి. ఈ 109 సంస్థల నుంచి వచ్చిన నష్టం 5000 కోట్లు. కానీ మొత్తం మీద వచ్చిన లాభాలు 12,000 కోట్లు ఇదిగాక ప్రభుత్వ ఖజానాకు రు. 25,000 కోట్లు లభించింది. కేంద్రం 1,72,438 కోట్ల పెట్టుబడి పెడితే ఈ రోజు ప్రభుత్వరంగ సంస్థలు 3,00,000 కోట్ల ఆస్తులు గల్గి వున్నాయి. ఇటీవల కొత్తగా ప్రభుత్వరంగం మరో 54,000 కోట్ల పెట్టుబడుల్ని సమకూర్చుకుంది. అందులో 46,000 కోట్ల తాము స్వంతంగా సమీకరించుకొనింది.

'పెట్టుబడుల ఉపసంహరణ కమీషన్' అధ్యక్షులు జి.వి.రామకృష్ణన్ ఎంతో బాధగా "ప్రభుత్వరంగ సంస్థల విజయాల్ని చెప్పుకొనేందుకు ప్రభుత్వం ఒక్కసారి కూడా ప్రయత్నించలేదు. వీటిని బలోపేతం చెయ్యడానికి ఒక సూచన కూడా ఈ 7 నెలల్లో నాకివ్వలేదు" అని పేర్కొన్నాడు. ఈ సంస్థలకు మరింత స్వయంప్రతిపత్తి, సమర్థవంతమైన యాజమాన్యం కల్పించాలని CMP చెపుతున్నా ఈ దారిలో ఒక్క అడుగూ ముందుకు పోక బాగా వీటి అమ్మకంవైపు UF ప్రభుత్వం మొగ్గడం దుర్మార్గం. ఒకవేళ కొన్నింటిని వదిలించుకోవల్సి వచ్చినా ఆ డబ్బు ప్రభుత్వ సంస్థల అభివృద్ధికే వాడాలనీ, ప్రజారోగ్యం - విద్యలకే ఖర్చు చేయాలనీ CMP చెపుతోంది. దీన్ని UF ప్రభుత్వం పట్టించుకోడంలేదు. అప్పులూ, అమ్మకాలూ తప్ప స్వాలంబనా, స్వంత వనరుల సేకరణాగానీ, సంక్షేమాల కోతా, ధరల పెంపుదలా తప్ప ప్రత్యామ్నాయ ఆర్థిక విధానాలుగానీ కేంద్ర ప్రభుత్వం ఆలోచించడంలేదు.

అయిదవ వేతన సంఘం సిఫార్సుల్ని చూస్తే ప్రపంచ బ్యాంకు డిక్టేషన్లు ఎలా ఈ దేశంలో చొరపడుతున్నాయో మనం గమనించవచ్చు. ఉన్నఫళంగా 3 లక్షల ఉద్యోగాలు రద్దు చేయమన్నారు. 30 శాతం ఉద్యోగాల్ని క్రమేణా తగ్గించమన్నారు. 4వ తరగతి ఉద్యోగ వర్గమే అనవసరమన్నారు. స్వయంచాలిత యంత్రాలు తెచ్చి కంప్యూటర్లు పెట్టి "సామర్థ్యాన్ని పెంచడం కోసం, ప్రజలకి మంచి సేవలందించడం

కోసం" స్వచ్ఛంద పదవీ విరమణ పథకాన్ని (VRS) ను తెమ్మన్నారు. మరి IAS అధికార్లకేమో రు. 600 నుంచి 900లు వినోదపు అలవెన్సు ఇచ్చారు! టెలిఫోన్‌కు 1500/- కేటాయించారు. విమానాల్లో LTC పొందే అవకాశం కొత్తగా కల్పించారు !

**ప్రముఖ ఆర్థిక వేత్తల ప్రకటన** : 14 మంది ప్రముఖ ఆర్థిక వేత్తలీ మధ్య చేసిన ప్రకటన మన జాతీయార్థిక దుస్థితికి అద్దంపడుతుంది. పరిష్కారాల్ని సైతం స్పష్టం చేస్తోంది. వారి ప్రకటన సంక్షిప్తంగా ఇలా వుంది.

"దేశార్థికస్థితి ప్రమాదస్థాయికి చేరుకొంటుంది. వ్యవసాయోత్పత్తులు నానాటికి తగ్గుతున్నాయి. పునాది పరిశ్రమలు కుప్పగూలుతున్నాయి. ఉత్పత్తి రంగంలో మాంద్యం ప్రవేశించింది. ఎంత 'సరళీకరణం' చేసినా పెరగకపోగా ఎగుమతులు తగ్గిపోతున్నాయి. వడ్డీరేటు అసా... గా పెరిగి చిన్న ఉత్పత్తి దార్లు కుంగిపోతున్నారు. విదేశీ సంస్థలు మన స్టాక్ మార్కెట్ దుస్థితిచూచి పాపం 'విశ్వాసం' కోల్పోతున్నాయి.

నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నై. గోధుమ, చక్కెర, పెట్రోలు ధరల్ని ప్రభుత్వమే పెంచింది. గ్రామీణాభివృద్ధి అంతంత మాత్రంగా వుంది. సామాజికరంగాలకు నిధులు తగ్గించడంతో విద్య, ప్రజారోగ్యం రంగాలు కుప్పకూలిపోతున్నాయి.

లెక్కల్ని తారుమారు చేసి 'స్థూల జాతీయ ఉత్పత్తిని' చూపినంత మాత్రాన సరిపోదు. ఈ కష్టాలనుంచి తప్పించుకొనడానికి మరిన్ని అప్పులు, మరింత సరళీకరణ, మరిన్ని బహుళజాతి సంస్థలకు స్వాగతతోరణాలు, పరిష్కారం గావు. వాటి షరతులూ, అంక్షలూ, జోక్యాలు విధి నిషేధాలూ మనపై మరింత భారాన్ని మోపుతాయి. దేశం పరాధీనమవుతుంది.

మన పన్నుల విధానం పూర్తిగా మారాలి. అంతాగలిపి GDP లో మన కేంద్ర పన్నులు 11.5 శాతం మించిలేవు. రాష్ట్రాల పన్నులతో గలిపినా ఇది 16.4 శాతానికి మించదు. బ్రిటన్‌లో ఇది 34%, ఫ్రాన్సులో 38%, జర్మనీలు 28.8% మనం ఆదర్శంగా చెప్పుకొనే వర్ధమానదేశాలైన దక్షిణ కొరియాలో 34.1%, ఇండోనేషియాలో 20% కేంద్ర పన్నులున్నై. పెద్ద పెద్ద భూకమతాలమీదా, కార్పొరేషన్ల అధీనంలోని వ్యవసాయ భూముల మీద పన్ను విధించాలి. అలవెన్సులు తగ్గించి, పన్నులు విధించడంతోపాటు కనీస ప్రత్యామ్నాయ పన్నులు కార్పొరేషన్లపై విధించాలి. ప్రకటనల ఏజెన్సీలపై టర్నోవర్ టాక్సు, ఆస్తుల వినిమయాలపై పన్నులు; విలువైన ప్రదేశాల్లోని విలాసగృహాలపై పన్ను; స్వంత కార్ల కొనుగోలు ధరపై పన్ను; కార్పోరేట్ రంగంలోని విద్యాసంస్థలమీదా, ఆసుపత్రుల మీదా టర్నోవర్ పన్ను విధించవచ్చు ఇంత దేనికి? కార్పోరేట్ రంగం బ్యాంకులకున్న 40,000 కోట్ల బకాయిలు వసూలు చేస్తే చాలు." మరిదీన్ని ప్రభుత్వం అంగీకరిస్తుందా?

UF ప్రభుత్వం ప్రజాప్రయోజనకర విటిషన్లకు ప్రజాప్రతినిధుల్ని అతీతుల్ని చెయ్యాలనీ, ప్రజాప్రతినిధులు ప్రజాసేవకులు కారనే నిర్వచనం తేవాలనీ, బ్యాంకుల్లోని ఉన్నతాధికార్లను అరెస్టు చెయ్యాలంటే ఆర్థికశాఖ అనుమతి కోరాలనీ "కొత్త ఆలోచనలు" చేసింది. స్వాముల స్వాముల్ని కాపాడబోయి తాను బురద పూసుకొంది. దీన్ని జనం గర్హించారు.

వామపక్షాలు సందర్భోచితంగా వ్యతిరేకించడం, ఒత్తిడి తేవడం వల్లనే ఫ్రంట్ ప్రభుత్వం అంతో ఇంతో సరైన దారిలో వుందనేది అందరూ అంగీకరిస్తున్న అంశం. కాంగ్రెసుకూ బి.జె.పి.కీ దేశంలోని పెట్టుబడీదారి శక్తులకూ ఇది ఎంతో కంటగింపుగా వుంది.

మూడురాష్ట్రాలు అధికారంలో వున్న వామపక్షశక్తులు తమ పరిధిలో ప్రత్యామ్నాయాన్ని జూపుతున్నాయి. ప్రజాభిమానాన్ని చూరగొంటున్నాయి. కేరళలో జరుగుతున్న "9వ ప్రణాళిక - ప్రజల ప్రణాళిక" తీరు దేశంలో కొత్త ఒరవడి సృష్టిస్తోంది. ఇప్పటికి 30 లక్షల మంది అట్టడుగుస్థాయి నుంచి ప్రణాళిక రచనలో భాగస్వాములయ్యారు. ప్రజాపంపిణీ వ్యవస్థను కూడా కేరళ ఆదర్శంగా నిర్వహిస్తోంది. త్రిపురలో ఎన్ని అడ్డంకులున్నా, ఎన్ని విభిన్న ఉద్యమాలు ఎదురవుతున్నా వామపక్ష ప్రభుత్వం ప్రజల్ని సమీకరిస్తోంది. గిరిజన గిరిజనేతరుల మధ్య సామరస్యాన్ని నిలబెడుతోంది. రాష్ట్రాభివృద్ధికి బలమైన పునాదులేర్పడుతున్నాయి. బెంగాల్ ప్రభుత్వం అజేయంగా రెండు దశాబ్దాల పైగా అధికారంలో వుంది. పంచాయతీల పరిపుష్టి, వ్యవసాయ సంస్కరణలు, ప్రజాభాగస్వామ్యం, బెంగాల్ ప్రభుత్వానికి వెన్నెముకలు, పారిశ్రామిక పునాదుల్ని నిర్మించేదశలో ప్రయత్నం జరుగుతోంది.

'జాతీయత, స్వదేశీ' అంటూ నిత్యం పాటపాడే మతశక్తులు మైఖేల్ జాన్సన్‌ను ఆకాశానికెత్తడం, ఎన్‌రాన్‌కు సాగిలపడ్డం ఖాయ చూచాం. వీరి అవినీతి, అరాచకాలపై అన్నాహజారే ఉద్యమాలు నడపాల్సిన స్థితిని తెచ్చుకోవడం చూస్తున్నాం. సర్వభ్రష్టత్వంపట్ల 1947 నుంచీ పాలించిన కాంగ్రెసువారు బెయిల్ అన్వేషణల్లో మునిగి తేలడం గమనిస్తున్నాం. ఈ స్థితిలో వామపక్ష లౌకికశక్తులే ఈ రుగ్మతలకతీతంగా దేశాన్ని నడిపించగలవని నానాటికి రుజువుగావడం మనం గుర్తించాల్సివుంది.

**రాష్ట్ర ప్రభుత్వం** : తెలుగుదేశం ప్రభుత్వం చంద్రబాబు నాయుడిగారి నాయత్వంలో నిలదొక్కుకొనింది. ఈ ఏడాది జరిగిన అన్ని ఎన్నికల్లో గెలిచింది. తమది పనిచేసే ప్రభుత్వంగా, తాను పనిచేసే ముఖ్యమంత్రిగా గుర్తింపుకు రావాలని ముఖ్యమంత్రి తపనపడుతున్నారు. కాంగ్రెసు దయనీయస్థితిలో వుంది.

కేంద్రంతో మంచి సంబంధాలు, ఫ్రంట్ కన్వీనరు పదవీ గూడా వుండటం తెలుగుదేశం ప్రభుత్వానికి మరింత మంచి అవకాశం. అయితే వరదలు, కరువులూ రాష్ట్రాన్ని అల్లకల్లోలం చేశాయి. కోనసీమ ప్రజానీకం కోలుకోలేని దెబ్బ తినింది. ఈ స్థితిలో ఆల్మట్టి వ్యవహారం రాష్ట్ర ప్రజలకీ, ప్రభుత్వానికీ కంటిలో నలుసుగా మారింది. అయినా అవేశాలకు పోకుండా ముఖ్యమంత్రుల కమీటి పరిష్కారం నమ్ముకోడం మంచి పరిణామం. ఇదిలా వుండగా 'ప్రత్యేక తెలంగాణా' అంటూ కొందరీ మధ్య పాతపల్లవి పాడుతున్నారు. 'నక్సలైట్ల సాయంతో దీనిని సాధిస్తాం' అనడం మరీ దుర్మార్గం.

ప్రజాభిమానం కోసం ముఖ్యమంత్రి చాలా తంటాలు పడుతున్నారు. ప్రజల వద్దకు పాలన, జన్మభూమి వంటివి ప్రయోగాలు చేస్తున్నారు. ప్రజల్ని భాగస్వాముల్ని చెయ్యడం మంచిదే. 'అన్నీ ప్రజలే

చేసుకోవాలి' అంటేనే సమస్య వస్తుంది.రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక దుస్థితిని వివరిస్తూ విడుదలైన శ్వేతపత్రం అంతా ఏకపక్షం. 'అయ్యోపాపం ప్రభుత్వం' అనిపించడానికీ, ప్రజల్లోని ఒక వర్గంపై మరొకర్ని పురికొల్పాలనీ ప్రభుత్వం అనుకొన్నది ప్రజలు చెపుతున్నట్టు అన్పించడానికీ తప్ప ఈ శ్వేతపత్రం మరెందుకూ పనికి రాలేదని తేలిపోయింది. దీని తర్వాత రు. 2000 కోట్ల పన్నులు విధించారు. అయినా ఖజానా కరువు తీరలేదంటున్నారు.

ఇప్పుడు ప్రపంచబ్యాంకు రుణం కోసం ఎదురు చూస్తున్నారు. విద్యుత్‌రంగాన్ని విభజిస్తామనీ, మద్యనిషేధం ఎత్తేస్తామనీ, సబ్సిడీలు తగ్గిస్తామనీ, పరిశ్రమల్ని అమ్ముతామనీ హామీలిస్తున్నారు. ఉన్నఫళాన 10,000 కోట్లు అప్పు కావాలంటున్నారు. ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వం 17,732 కోట్ల అప్పు వుంది. దీనికి వడ్డీలే రు. 1891 కోట్లు చెల్లిస్తున్నారు. ఏడాదికి మరో రు. 2750 కోట్ల అప్పు పెరుగుతుంది. ఇది చాలక 10 వేలకోట్లు అప్పు ప్రపంచ బ్యాంకునుంచి తెస్తారట (అది ఇస్తే !)

దీనికి తగ్గట్టుగానే విధానాలూ కన్పిస్తున్నాయి. మద్యనిషేధం వీలున్నంత నీరుగార్చి, నాన్చి ఎత్తివేయాలని చూస్తున్నారు. కోరి కొరివితో తలగోక్కుంటున్నారు. ఉద్యోగవర్గంతో ఘర్షణ పడుతున్నారు. విద్యుత్, నీటి తీరువా రేట్లు రైతాంగం నుంచి ప్రతిఘటన తెచ్చుకొంటున్నారు. ఫలితమే పార్వతీపురం లాంటి స్థానంలో తెలుగుదేశానికి చావుదప్పి కన్ను లొట్టపోవడం

స్వంత వనరుల్ని సమీకరించుకొని, సంపన్నులపై పన్నులు వేసి, గ్రామీణ వ్యవసాయక వ్యవస్థలో మార్పులు తెచ్చి ప్రజాస్వామికంగా పరిపాలించితే తప్ప ఈ సంక్షోభం నుంచి ప్రభుత్వం గట్టెక్కలేదు. దీన్ని ఎంత తర్వగా గుర్తిస్తే అంతగా రాష్ట్రప్రభుత్వానికి మంచిది.

ముఖ్యంగా ఉద్యోగ వర్గం పట్ల రాష్ట్ర ప్రభుత్వ వైఖరి గర్హనీయం, ఆర్థినెన్సు 25 దుర్మార్గమైంది. ఏళ్ళ తరబడి పనిచేస్తూ వునరావానం కల్పించబడ్డ ఆల్విన్ ఉద్యోగుల్ని ఇంటికి పంపబూనుకోవడం, ఒక ప్రభుత్వ సంస్థ రద్దయితే ఆ ఉద్యోగుల్ని మిమ్మూ సంస్థలోకి తీసుకోవడానికి రద్దు చేసి దీనికి 'ఉద్యోగ సంఘాలు' అంగీకరించడం లేదని సాకు చెప్పడం మరీ ఘోరం. దీని ఫలితమే ఉద్యోగ కార్మిక ఉపాధ్యాయ వర్గాల పోరాటాల వెల్లువలు, సరైన సమయంలో తీసుకొన్న ముందడుగు JAC పునర్నిర్మాణం, పోరాట కార్యక్రమమూ. చేతులు కాలకముందే రాష్ట్ర ప్రభుత్వం ఈ ఉద్యోగ వ్యతిరేక విధానాన్ని వదులుకొంటుందని ఆశిద్దాం.

## పూర్వరంగం

అవకాశవాద విధానాలు పెచ్చు పెరిగి, ప్రాంతీయ విద్వేషాలు రచ్చకెక్కి, ప్రజల మధ్య వైషమ్యాలు హెచ్చిన సమయంలో చారిత్రక అవసరంగా ఏర్పడిన సంస్థ యు.టి.యఫ్.

అన్ని ప్రాంతాల, అన్ని కేడర్ల, అన్ని యాజమాన్యాలలోని ఉపాధ్యాయులందరి సమైక్య సంస్థగా ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ 1974 ఆగష్టు 10న ఆవిర్భవించింది. దానికి అవసరమైన నిబంధనావళి, అనువైన పాలసీ స్టేటుమెంటు, 74 అక్టోబరులో జరిగిన మహాసభలో రూపొందించుకున్నది.

1975 జనవరి 11, 12 తేదీలలో ఖాజీపేటలో ఉద్యమం తెలంగాణకు విస్తరిస్తూ చారిత్రాత్మకమైన నిర్ణయం గైకొన్నది. 19.1.75లో తెలంగాణా జిల్లాలలో ఆర్గనైజింగ్ కమిటీలు ఏర్పాటు చేయబడ్డాయి.

1974 రాజమండ్రి, 1977 ఖమ్మం, 1981 భీమవరం, 1986 విజయవాడ, 1989 నెల్లూరు, 1993 గుంటూరులోను ఆరు మహాసభలు జరుపుకున్నాం. అంచెలంచెలుగా ఎదిగి అగ్రేసర సంఘంగా రూపుదాల్చాం. వాసిలో, రాశిలో ఎవరూ ఊహించని స్థాయికి చేరుకున్నాం.

ఇవన్నీ మాటలతో సాధ్యపడలేదు. కార్యకర్తల అకుంఠిత దీక్ష, ఉపాధ్యాయుల అపార ఆదరణ, అమరజీవుల అంతులేని త్యాగాల కారణంగా మనం ఇన్ని విజయాలు సాధించగలిగాం. ఇంత ఎత్తుకు ఎదగగలిగాం. సి.డి. ఆర్డినెన్సుకు వ్యతిరేకంగా పోరాడాం. పనిగంటల బడిదినాల పెంపుకు వ్యతిరేకంగా అత్యవసర పరిస్థితిలో కూడా ఎదురు తిరిగాం. చలో హైద్రాబాద్, చలో అసెంబ్లీ మహా విజ్ఞాపన పత్రాలు, కార్డు క్యాంపెయన్లు, కోర్కెల పత్రాలు, నిరాహారదీక్షలు, ధర్నాలు మొదలగు అనేక పోరాటాలు సాగించి, ఉపాధ్యాయుల సర్వీసు కండిషన్స్ మెరుగుపరచుకున్నాం.

1958, 1961, 1969, 1974, 1978, 1986, 1992 ఏడు పే కమిటీల్లో ఒక రీగ్రూపింగ్ కమిటీ ద్వారా ఉపాధ్యాయుల వేతనాలలో కూడా అగ్రస్థానానికి చేరుకున్నాం.

ఎయిడెడ్ ఉపాధ్యాయులకై డైరెక్టు పేమెంటు, మున్సిపల్ ఉపాధ్యాయులకు పూర్తి గ్రాంటు పంచాయతిరాజ్ ఉపాధ్యాయులకు ప్రావిన్సలైజేషన్ సాధించుకున్నాం.

విజయవాడలో 9.12.1978న స్వంత భవనం ఏర్పాటు చేసుకున్నాం. 13.10.1984లో హైద్రాబాదులో కూడా స్వంత భవనం ఏర్పాటు చేసుకొని, జిల్లా భవనాలకు అనుమతి యివ్వడం జరిగింది. ఇప్పటికి 11 జిల్లాలలో కూడా భవనాలు ఏర్పడినాయి. ఉద్యమ అవసరాలకు అనువుగా ఆఫీసులు పనిచేస్తున్నాయి. మొదటి నుండి యు.టి.యఫ్. సూత్రబద్ధ వైఖరితోనే పనిచేస్తుంది. వేర్పాటువాద ఉద్యమాలలో భాగస్వాములం కాలేదని వెలివేసినవారు అన్ని ప్రాంతాలు కలిపితే అపవిత్రమైనామని తలచినవారు, అన్ని మానేజిమెంట్లను ఒకటిచేస్తే అదిరిపడ్డవారు, 20 పాయింట్లకు దాసోహమనలేదని చెడవ్రాసినవారు, విద్య ఉమ్మడి జాబితా అంటే ఉలిక్కిపడ్డవారు. ఆచరణలో వారి లోపాలు ఆలస్యంగా గ్రహించి మన మార్గంలో పయనించవలసి వచ్చింది.

ఐక్యఉపాధ్యాయ పత్రిక నిర్వహణ తీరు, జీవితచందాలకు పెట్టిన ఒరవడి, అధ్యాపక దర్శినిల ప్రచురణ, ఉపాధ్యాయులకు కరదీపిక లాంటి డైరీ, అకడమిక్ సెల్ నిర్వహణ అందరిని ఆకట్టుకున్నాయి. ఉపాధ్యాయులు మన ఉద్యమం పట్ల ఆకర్షితులైనారు. అపారమైన ఆదరాభిమానాలు చూపించారు.

యు.టి.యఫ్. స్వంత పోరాటాలను వదులుకోలేదు. ఐక్యపోరాటాలకు అత్యంత ప్రాధాన్యతనిచ్చింది. ఫేప్టొ, జాక్టొ, జె.ఎ.సి.ల పరంగా వచ్చిన పోరాటాలలో శక్తివంతంగా పాల్గొన్నది. ప్రతి పరీక్షా సమయంలోను ఉద్యోగుల, ఉపాధ్యాయుల పక్షాన నిలిచి పనిచేసింది.

యు.టి.యఫ్. 13.1.1988 ప్రభుత్వ గుర్తింపు పొందింది. జాయింట్ స్టాఫ్ కౌన్సిల్‌లో 26.12.92న సభ్యత్వం వచ్చింది. పర్మనెంటు సభ్యత్వం గురించి ప్రభుత్వం అంగీకరించినా ఇంకా ఉత్తర్వు రాలేదు.

1974లో 7000లతో ప్రారంభించిన సభ్యత్వం, 1980కి 35,000లకు 1985కు 45,000కు 1993కు 56,000లకు 1996కు 60,000లకు చేరి నేటికి 70,000లకు చేరుకొంది. ఇది నిజంగా చారిత్రాత్మకమైన దినం. మన సభ్యత్వం ఈ స్థాయికి చేరుకోవడం నిజంగా మనకు గర్వకారణం మన ఉద్యమానికి పర్వదినం.

రజతోత్సవాల నాటికి మన సభ్యత్వం సంవత్సరానికి 10 వేల చొ॥న పెరుగుతూ లక్షకు చేరుకోవాలనే లక్ష్యంగా మనం పెట్టుకొన్నాం. అందుకు అపారమైన అవకాశాలూ వున్నాయి. అనుకూలమైన పరిస్థితులు వున్నాయి. కావలసిందల్లా కార్యదీక్షతో కదలడం కర్తవ్యాన్ని నెరవేర్చుకొనడం.

## ప్రస్తుతరంగం

1993 ఆగష్టు 8,9,10 తేదీలలో 6వ విద్యావైజ్ఞానిక మహాసభలు జరుపుకున్నాం. సరిగా 43 మాసాల తర్వాత 1997 మార్చి 8,9,10 తేదీలలో ఒంగోలులో సప్తమ విద్యావైజ్ఞానిక మహాసభలు జరుపుకొంటున్నాం.

మహాసభలకు రు. 12,26,902/-లు వసూలు చేసి, రు. 5,35,782/-లు ఖర్చుచేసి, జిల్లాశాఖలకు రూ. 4,82,054/- ఇచ్చి హైద్రాబాదు భవనానికి రు. 2,09,066/- నిల్వతో పని మొదలుపెట్టాము. జిల్లాలకు యిచ్చినదానిలో రు. 3,50,000/-లు గుంటూరు జిల్లాకే యిచ్చాము.

మహాసభలు జయప్రదంగా జరిగాయి. గౌ॥ గవర్నరుగారి సభ అన్నిటికంటె హైలైట్.

దేశవ్యాపిత పోరాటాలలో కూడా మనం సముచిత పాత్ర నిర్వహించాము. 25.11.92న పార్లమెంటు ముందు ప్రదర్శనలోను, 9.9.93న భారతదేశ వ్యాప్తంగా జరిగిన సమ్మెలోను, 5.4.93 ప్రదర్శనలోను. మనం పాల్గొన్నాము.

## రామకృష్ణారావు కమిటీ రిపోర్టు - విద్యాబిల్లు

కేంద్రప్రభుత్వం 73, 74 రాజ్యాంగ సవరణల ద్వారా విద్య, వైద్యాన్ని కూడా పంచాయితీల పరం చేయాలనే నిర్ణయాన్ని ముఖ్యమంత్రి కొనేరు రామకృష్ణారావు కమిటీని వేసి, విద్యాబిల్లు అసెంబ్లీలో కూడా ప్రవేశపెడితే దానికి వ్యతిరేకంగా రాష్ట్రవ్యాపితంగా మన సంఘం శక్తివంతంగా పోరాడింది.

1995 ఆగష్టు 7 నుండి 11 వరకు మండల పట్టణ కార్యాలయాల ముందు ధర్నాలు, ఆగష్టు 21న జిల్లా కేంద్రాలలో ధర్నాలు జరిపి 50 వేలమందిని వీధులలోకి తెస్తే నూతనంగా వచ్చిన ముఖ్యమంత్రి బిల్లును తాత్కాలికంగా అబయన్స్‌లోపెట్టారు.

వీరోచితంగా జనాన్ని వీధులలోనికి తెచ్చి, విద్యాబిల్లును నిలుపు చేయించిన ఘనత మనకే దక్కింది. అందుకు శక్తివంతంగా కదిలిన ఉపాధ్యాయులకు ఉద్యమాంజలి సమర్పించుకుంటున్నాము.

## సి.సి.ఆర్.టి.యుతో ప్రభుత్వ చర్చలు

జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో ఉపాధ్యాయుల సమస్యలపై ఎక్కువగా ప్రస్తావన వస్తున్న కారణంగా ప్రభుత్వ గుర్తింపు పొందిన నాల్గు సంఘాలు (యు.టి.యఫ్., యస్.టి.యు., పి.ఆర్.టి.యు.,

ఎ.పి.పి.టి.ఎ.)లతో చర్చించి సమస్యలు పరిష్కరించాలని ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఆదేశించగా అప్పటి నుండి ప్రభుత్వ అధికారులు ముందుగా మన సంఘాలతో చర్చలు జరుపసాగారు. ఇప్పటికి అట్టి చర్చలు 11.9.95, 13.9.95, 16.10.95, 12.12.95, 19.12.95, 9.2.96, 25.2.96, 19.3.96, 14.5.96, 10.6.96, 15.7.96, 11 సార్లు జరిగాయి. ప్రావిన్సలైజేషన్ ప్రమోషన్ల అవకాశాలుగాని, ఇతర సమస్యలుగాని ఇప్పటికి పరిష్కరింపబడలేదు. ఉపాధ్యాయులు సమస్యలతో సతమతమవుచున్నారు. ప్రభుత్వము ఏ సమస్యా పరిష్కరించే దశలో లేదు.

## యు.టి.యఫ్. 23వ వార్షిక కౌన్సిల్

1996 మార్చి 15, 16, 17 తేదీలలో జరిగిన జనరల్ కౌన్సిలు అత్యంత జయప్రదంగా జరిగింది. ముఖ్యమంత్రి, విద్యాశాఖ కార్యదర్శి, కమిషనరు మరియు పాఠశాల విద్యా డైరెక్టర్, ప్రజా ప్రతినిధులు, హాజరయ్యారు. యు.టి.యఫ్. హైద్రాబాదు భవన శంకుస్థాపన కూడా జరిగింది.

ముఖ్యమంత్రి యు.టి.యఫ్.కు సివిల్ సర్వీసు జాయింట్ స్టాఫ్ కౌన్సిలులో పర్మనెంటు సభ్యత్వం యిస్తామని, ఎయిడెడ్ ఉపాధ్యాయులకు బడ్జెట్ కంట్రోలు తొలగిస్తామని, అప్రెంటిస్ టీచర్ల టైం స్కేలు గురించి, ముఖ్య ప్రకటనలు చేసిరి. 16.3.96 తేదీన విద్యాశాఖ మంత్రి, కమీషనరు గార్లతో చర్చలు ముఖ్యమంత్రి ఆదేశంపై జరిగాయి. అక్కడ కూడా అనేక ముఖ్య నిర్ణయాలు తీసుకోబడ్డాయి. అయినా అవన్నీ ఇప్పటికి అపరిష్కృతంగానే వున్నాయి.

## సి.సి.ఆర్.టి.యు. పోరాట కార్యక్రమం

ఏ సమస్య పరిష్కారంకాక, అధికారుల స్థాయి చర్చలలోనే కాలహరణం జరుగుతున్న కారణంగా సి.సి.ఆర్.టి.యు. పక్షాన పోరాటానికి పిలుపు యివ్వడం జరిగింది.

మొదటిదశ - ప్రధానమైన డిమాండ్స్‌తో లక్ష కార్డులు మన మూడు సంఘాల పక్షాన పోస్టు చేయబడ్డాయి. డిశంబరు 20 నుండి 30 వరకు ఈ కార్యక్రమం జరిగింది. రెండవదశ కార్యక్రమం 29.1.96న పి.ఆర్.టి.యు. కార్యక్రమానికి కలిసి రాకపోతే మన రెండు సంఘాలు జిల్లా ధర్నాలు జయప్రదంగా జరిపాయి. మూడవదశ కార్యక్రమం - మూడవదశ కార్యక్రమం 18.3.96న అత్యంత జయప్రదంగా జరిగింది. అప్పటికి ప్రభుత్వంపై భ్రమలు తొలగిన పి.ఆర్.టి.యు. కూడా కలిసి వచ్చింది. మనసంఘ పక్షాన 2500 మంది ప్రదర్శనలో పాల్గొన్నారు.

ప్రతినిధి వర్గం స్పీకరును కలిసి, విజ్ఞాపనపత్రం అందచేయగా ముఖ్యమంత్రికి తగు సూచనలతో అందజేయగలనని తెల్పారు.

10వ తరగతి, 7వ తరగతి స్పాట్‌వేల్యుయేషన్ రేట్లు పెంపుదల గురించి స్పాట్ వేల్యుయేషన్ బహిష్కరణకు పిలుపు యివ్వడం జరిగింది. ప్రభుత్వం దిగి వచ్చి 6.4.96, 12.4.96 తేదీలలో చర్చలు జరిపి, స్పాట్ వేల్యుయేషన్ రేట్లు రెట్టింపు చేయబడ్డాయి.

పెంచిన స్పాట్ వేల్యుయేషన్ రేట్లు ప్రభుత్వం అమలు జరుపని కారణంగా 12.10.96 నుండి స్పాట్‌వేల్యుయేషన్

బహిష్కరించాలని సి.సి.ఆర్.టి.యు. పిలుపు యిచ్చింది. 15వ తేదీన పరీక్షల కమీషనరు కోరినా జి.ఓ. యిస్తే తప్ప సాధ్యం కాదని చెప్పటం జరిగింది.

దసరా శలవుల తర్వాత ప్రభుత్వం మనతో కుదిరిన ఒప్పందం ప్రకారం జి.ఓ. యిచ్చిన తర్వాతనే స్పాట్ వేల్యుయేషన్‌లో పాల్గొనుట జరిగింది. ఉపాధ్యాయులు ఉద్యమ పిలుపుకు యిచ్చిన గౌరవం మరువలేము. అందువలన మన హక్కులు కూడా రక్షించబడ్డాయి.

## యు.టి.యఫ్. పోరాట కార్యక్రమం

ప్రభుత్వం సమావేశాలలో ఇచ్చిన హామీలు చేసిన వాగ్దానాలు అమలు జరుపని కారణంగా దశలవారీ పోరాటానికి పిలుపుయివ్వడం జరిగింది. 15.6.96న ముఖ్యమంత్రికి నోటీసు యిచ్చాము.

**1. మొదటిదశ :** అన్ని మండల పట్టణ కార్యాలయాల ముందు 1996 జూలై 16, 17, 18 తేదీలలో రాష్ట్రవ్యాప్తంగా ధర్నాలు జరిగాయి. 30,000 మంది వాటిలో పాల్గొన్నారు. అన్ని పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. రంగురంగుల ఫొటోలతో జిల్లా ఎడిషన్లు మూడు రోజులు ప్రచురించాయి.

**2. రెండవదశ :** జిల్లా కలెక్టరు కార్యాలయం ముందు 30.7.96న ధర్నాలు జరిగాయి. జిల్లాధర్నాలలో 5000 మందికి పైగా పాల్గొన్నారు.

**3. మూడవదశ కార్యక్రమం :** మన మధ్యంతర కౌన్సిలు 8.9.96న జరిగింది. 9.9.96న తుల్జాభవనం నుండి వూరేగింపుగా బయలుదేరి చిక్కడపల్లి మీదుగా, ఇందిరాపార్కు వద్దకు ప్రతినిధులు చేరుకొని 1,000 మందితో ధర్నా జరిపారు.

## పరిష్కరించవలసిన సమస్యలు

1. అప్రెంటిస్ ఉపాధ్యాయులకు వెంటనే టైంస్కేలు యివ్వాలి.
2. ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలకు బడ్జెట్ కంట్రోలు తొలగించాలి. వారి పి.ఆర్.సి. బకాయిలు చెల్లించాలి.
3. మున్సిపల్ ఉపాధ్యాయులకు జీతాలు సక్రమంగా చెల్లించుటకు చర్యలు గైకొనాలి.
4. స్పెషల్ టీచర్లకు, అర్థ మిలియన్ పథకం క్రింద నియమించిన ఉపాధ్యాయులకు వారి మొత్తం సర్వీసు పెన్షనుకు 8, 16 సంవత్సరాల స్కేళ్ళకు వర్తింపజేయాలి.
5. ఏజన్సీ అలవెన్సులు కంటిన్యూ చేస్తూ వెంటనే ఉత్తర్వులు యివ్వాలి.
6. విద్యాశాఖలోను, ట్రయిబల్ వెల్ఫేర్ డిపార్టుమెంటులోను వెంటనే సర్వీసు రూల్సు రూపొందించాలి.
7. ఇన్ సర్వీసు జె.యల్.కోటా పోస్టులు ప్రమోషను ద్వారా భర్తీ చేయాలి.
8. ఓ.యం.సి. సిఫార్సులపై లెక్చరర్లు, జె.యల్. ప్రమోషనుల నిబంధనలు రూపొందించాలి.
9. 1993 నుండి రావలసిన కంటెన్‌జెన్సీ గ్రాంటు విడుదల చేయాలి.
10. 7, 10 తరగతుల స్పాట్ వాల్యుయేషన్ రేట్లపై కుదిరిన ఒప్పందం అమలుకు వెంటనే ఉత్తర్వులు యివ్వాలి.
11. 6, 7 తరగతులలో బి.ఇడి. నియామకాలకు వెంటనే తగు చర్యలు గైకొనాలి.
12. వృత్తి విద్యా ఉపాధ్యాయుల నిర్ణీతవేతనము రూ. 1,000/-లకు పెంచుతూ వెంటనే ఉత్తర్వులు యివ్వాలి.
13. ఎయిడెడ్ ఉపాధ్యాయుల టి.పి.యఫ్. మొత్తాలపై 12 శాతం వడ్డీ చెల్లించాలి.
14. జి.ఓ. 330 ప్రకారం అప్‌గ్రేడు అయిన భాషా పండితులకు యఫ్.ఆర్. 22బి వర్తింపజేయాలి.
15. వివిధ సందర్భాలలో ప్రభుత్వం ఇచ్చిన హామీలు అమలు జరుపాలి.

## గిరిజన సదస్సు - సమస్యలు

గిరిజన ఉపాధ్యాయుల ద్వితీయ సదస్సు 1996 అక్టోబరు 6, 7 తేదీలలో భద్రాచలంలో జయప్రదంగా జరిగింది. గిరిజన విద్య - యు.టి.యఫ్. వైఖరి అనే ప్రధాన డాక్యుమెంటును ప్రవేశపెట్టి చర్చించాయి.

19 జిల్లాలలో 45 గిరిజన సంక్షేమ పాఠశాలలు, 3377 గిరిజన విద్యావికాస కేంద్రాలు వున్నాయి. వాటిలో 7000 మంది ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. వారికి సర్వీసు రూల్సుగాని, వారి ఇతర సమస్యలు పరిష్కారానికి కాని నోచుకోలేదు.

సదస్సు జయప్రదంగా జరిగింది. వూరేగింపు డోలు వాద్యాలు, కోయ డ్యాన్సులతో అద్భుతంగా వుంది. ముఖ్యమైన తీర్మానాలు ఆమోదించబడ్డాయి.

10.7.96న గిరిజన సంక్షేమ శాఖ సంచాలకులతో చర్చలు జరిగాయి. 17 సమస్యలు చర్చించబడ్డా ఇప్పటికి పరిష్కారం కాలేదు.

తిరిగి 15.2.97న చర్చలు జరిగాయి. 11 నెలలు గడిచినా ఏజన్సీ అలవెన్సులు కంటిన్యూ ఉత్తర్వులు వెలువడలేదు. దీనిపై పోరాట కార్యక్రమం చేపట్టాలని సంఘం నిర్ణయించింది.

అయినా కలిసి వచ్చేవారితో కదలాలని, ఏజన్సీలో వున్న యస్.జి.ఓ.ల నయినా కలుపుకురావాలని మనం ప్రయత్నించాం. కార్యాచరణ కమిటీలు ఏర్పాటు చేసి పోరాటాలు జరుపాలని మనం పిలుపు యిచ్చాము.

**1.కార్డు క్యాంపెయిన్ :** నవంబరు 25 నుండి 30 వరకు రాష్ట్రవ్యాప్తంగా 15000 కార్డులు పోస్టు చేయడ్డాయి.

**2. ధర్నాలు :** జిల్లా ఐ.టి.డి.ఎ. ప్రాజెక్టు ఆఫీసుల ముందు డిశంబరు 9,10,11 తేదీలలో ఎవరికి వీలయిన తేదీలలో వారు ధర్నా చేయాలని పిలుపు యిచ్చాము. జిల్లా ప్రాజెక్టు ఆఫీసుల ముందు అత్యంత జయప్రదంగా ధర్నాలు జరిగాయి. ఉద్యోగులు, ఉపాధ్యాయులలో మంచి కదలిక వచ్చింది. ఏజన్సీ అలవెన్సుకు మరికొన్ని సమస్యలు జోడించి, తక్షణం వాటిని పరిష్కరించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాము.

ఏజన్సీ ప్రాంతాలలో చాల వెనుకబడిన చోట్ల అష్టకష్టాలు పడి చదువు చెప్పేవారికి 11 నెలలుగా ఏజన్సీ అలవెన్సుల కంటిన్యూ ఉత్తర్వులు యివ్వలేదు. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు బడ్జెట్ కంట్రోలు తొలగించలేదు. 1992 పి.ఆర్.సి. బకాయిలు విడుదల చేయలేదు. వారికి జనవరి నుండి జీతాలు కూడా లేవు.

బడ్జెట్ వున్న ఖాళీ పోస్టులలో ఉపాధ్యాయులను అప్రంటిస్‌లుగా నియమిస్తున్నారు. ఎక్కడాలేనిది విద్యారంగంలో ప్రవేశపెట్టి 24 నెలలు వెట్టిచాకిరి చేయించుచున్నారు. ప్రావిన్షియలైజేషన్ జరిగి 15 సం॥లు అయినా పంచాయితిరాజ్ ఉపాధ్యాయులు ఏ విధమైన ప్రమోషన్లకు నోచుకోలేదు.

ఇప్పటికి ముఖ్యమంత్రితో, అధికారులతోను, అసెంబ్లీలోను, సమావేశాలలోను, చర్చలలోను అంగీకరించిన విషయాలకు కూడా అతీగతీ లేకుండా పోయింది. అందుచేత రాష్ట్రవ్యాప్తంగా, ఉపాధ్యాయులు, ఉద్యోగులు, కార్డు క్యాంపెయిన్, ధర్నాలు నిర్వహించారు. అయినా ప్రభుత్వంలో కదలిక లేదు.

అందుచేత హైద్రాబాదులో 12.2.97 ఉదయం 10.00లకు సెక్రటేరియట్ ముందు పికెటింగ్ చేయాలని ఉపాధ్యాయులు,ఉద్యోగులు నిర్ణయించారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి నోటీసు యివ్వడం జరిగింది.

### పరిష్కరించవలసిన సమస్యలు

1. ఏజెన్సీ అలవెన్సులు కొనసాగిస్తూ వెంటనే ఉత్తర్వులు యివ్వాలి.
2. ఎయిడెడ్ ఉపాధ్యాయుల జీతాలు బడ్జెట్ కంట్రోలు నుండి తొలగించాలి. 1992 పి.ఆర్.సి. బకాయిలు చెల్లించాలి.
3. విద్యారంగంలో అప్రంటిస్ విధానాన్ని రద్దు చేసి టైం స్కేలు యివ్వాలి.
4. పంచాయతీరాజ్ ఉపాధ్యాయులకు అన్నిరకాల ప్రమోషన్లు లభించేదానికి తగు ఉత్తర్వులు వెంటనే విడుదల చేయాలి.
5. ప్రభుత్వం హామీ యిచ్చిన అన్ని సమస్యలపై వెంటనే ఉత్తర్వులు యివ్వాలి.

అయిన్నా ప్రభుత్వంలో కదలికరాని కారణంగా హైద్రాబాద్‌లో 12.2.97న వేయిమంది ఉపాధ్యాయులతో అంబేద్కర్ విగ్రహం వద్ద పికెటింగ్ చేయడం జరిగింది. అరెస్టు అయిన వారిని రెండు, మూడు పోలీసు స్టేషనులలో వుంచి, సాయంత్రం 5 గంటల వరకు వుంచి పోలీసులు తమ కోపం తీర్చుకున్నారు. దీనితో యన్.జి.ఓ.లలో కూడా మంచి వూపు వచ్చింది. ఫిబ్రవరి 14, 25 తేదీల చర్చలలో ఇది ప్రధాన అంశమై ప్రభుత్వం బకాయిలతో సహా చెల్లించేలా హామీ యిచ్చింది.

## జె.ఎ.సి. పోరాట కార్యక్రమం

గత రెండు సంవత్సరాలుగా ప్రధాన సమస్యలు ఏవీ పరిష్కారం కావటంలేదు. హామీలు అమలు జరుగుట లేదు. అగ్రిమెంటులకు కాలదోషం పడుతున్నది. ముఖ్యమంత్రి వివిధ సమావేశాలలో ఇచ్చిన వాగ్దానాలు వట్టిపోతున్నాయి. ప్రభుత్వం అక్కడితో ఆగక వున్న సౌకర్యాలనే పూడగొడుతున్నది. ఏజన్సీ అలవెన్సులు పొడిగించక పోవడం, అనారోగ్య కారణాల వలన రిటైర్‌మెంటయిన వారి పిల్లల ఉద్యోగ సౌకర్యాలకు ఎన్నో చిక్కులు కల్పించడం, వృత్తిపన్ను ఇబ్బడి ముబ్బడిగా పెంచడం, ఇప్పటికి రెండు వాయిదాల కరవు భత్యం యివ్వకపోవడం లాంటి సమస్యలు ఉద్యోగులలో ఆందోళన కల్గించాయి.

7.2.97న ముఖ్యమంత్రితోను, 14.2.97న 25.2.97న

కేబినేట్ కమిటీతో జరిగిన చర్చలు ఫలవంతం కాకపోవడం ఉద్యోగులను, ఉపాధ్యాయులను, కార్మికులను మరింత నిరాశకు గురి చేసింది. అనివార్యంగా ఆందోళనకు దిగవలసిన పరిస్థితులు ప్రభుత్వమే కల్పించింది.

15.2.97, 25.2.97న జరిగిన సమావేశాలలో తిరిగి జె.ఏ.సి. రూపొందింది. 25 సంఘాలతో ఏర్పడిన సంఘం 27 డిమాండ్లు రూపొందించి పోరాటానికి పిలుపు యిచ్చింది.

అయితే ప్రభుత్వ కేబినేట్ సబ్ కమిటీ 14వ తేదీన యిచ్చిన నాల్గు సమస్యలుగనుక పరిష్కరిస్తే మిగిలినవి కూడా సామరస్యంగా పరిష్కరించుకోవచ్చునని భావించింది. అందుకే కొండంత ఆశతో చర్చలకు వచ్చింది.

ఏజన్సీ అలవెన్సులు మాత్రం యిస్తానని, డి.ఎ. రెండు వాయిదాలు జూలై 97వరకు పి.యఫ్. ఖాతాలో జమచేస్తానని, వృత్తి పన్ను వసూలు మరికొంతకాలం పొడిగిస్తానని, అనారోగ్య కారణాలవలన రిటైరయిన వారి పిల్లలకు ఉద్యోగాలిచ్చే దానిలో అక్రమాలు జరుగుతున్న కారణంగా దాని గురించి ఆలోచించాలని, ఈ విధంగా ఆకుకు అందని పోకకు పొందని జవాబులతో కాలం గడపాలని కేబినేట్ సబ్‌కమిటీ చూసింది.

కేబినేట్ సబ్‌కమిటీ చర్చలతో విసిగిపోయిన ఉద్యోగులు, ఉపాధ్యాయులు కార్మికులు, సమావేశం నుండి వాకవుట్ చేశారు. ప్రభుత్వ వైఖరికి తమ తీవ్ర నిరసన తెలిపారు. తెలంగాణా యన్.జి.ఓ.లు మాత్రం చర్చలు కొనసాగించారు. ఇంత మహాప్రవాహం ఒకవైపున వుంటే వారు అట్టి వైఖరి చేపట్టడం అందరిని నిరాశపరిచింది. ఉద్యోగుల ఐక్యతకు గండి కొట్టింది. కష్టజీవుల కళ్ళల్లో నిరాశ మిగిల్చింది.

కాని చాలకాలం తర్వాత జె.ఎ.సి ఏర్పాటు కావడం అందరిలో ఆశాభావాలు నింపింది. సాధిస్తామనే కోర్కెలు లేపింది. సరైన సమయంలో చేపట్టిన చర్యగా ఉద్యోగ భాగంలో భావించింది.

## సింగరేణి కాలరీస్ యాజమాన్యంతో చర్చలు

సింగరేణి ఉపాధ్యాయుల సమస్యలపై 16.6.96న కొత్తగూడెం జెనరల్ మేనేజరుతో చర్చలు జరిగాయి. ప్రతి అంశంపై వారంరోజులలోగా నోట్సు యిమ్మని, తర్వాత వివరంగా చర్చలు జరుపవచ్చునని జనరల్ మేనేజనేగారు చెప్పిరి.

అంతకుముందు హైద్రాబాదులో సింగరేణి కాలరీస్ యాజమాన్యంతో చర్చలు జరిపి అన్ని సమస్యలు వారి ముందు వుంచాము. యాజమాన్యం నుండి అన్ని విషయాలు రప్పించుకొని పరిష్కరిస్తామని హామీలు యిచ్చారు.

సింగరేణి ఉపాధ్యాయుల సదస్సు జరుపాలనుకున్నాం అది వాయిదా పడుతూ వస్తున్నది. త్వరలో సదస్సు జరిపి, సదరు సమస్యల పరిష్కారానికి పూనుకోవాలి.

## యు.టి.యఫ్. భవనాలు

మన ఉద్యమ అవసరాలకు స్వంత ఆఫీసులు కల్గి వుండటం అవసరమనే ఉద్దేశ్యంతో భవన నిర్మాణాలు చేపట్టాం.

1. విజయవాడ చెన్నుపాటి భవనం 9.12.1978న ప్రారంభించుకుని, అప్పటి నుండి సంఘ, పత్రికా ప్రధాన కార్యాలయాలు అక్కడ నుండియే నిర్వహించుకుంటున్నాము. క్రింద అంతస్తులో ఆఫీసు, రెండు ఫ్యామిలీ పోర్షన్లు, పైన మీటింగుహాలు వున్నాయి. విడిగా గోడౌన్, వాచ్‌మెన్ రూం వున్నాయి. అన్ని సౌకర్యాలతో ఆఫీసు పనిచేస్తున్నది.

2. **హైద్రాబాదు యు.టి.యఫ్. భవనము :** 13.10.84న హైద్రాబాద్‌లో భవనం ఏర్పాటు చేసుకున్నాము. హైద్రాబాదు రాష్ట్ర కేంద్రంగా చేయాలని ఉద్దేశ్యంతో మన భవనం ప్రక్కనగల ఖాళీ స్థలం అమ్మకానికి రాగా కొన్నాం. అందులో ఒక ఔట్‌హౌస్ మాత్రం ఉంది.
ఎంప్లాయీస్ వెల్‌ఫేరు ఫండు నుండి లోను వస్తుందని ఆశించి మూడంతస్తుల భవన నిర్మాణానికి పూనుకొన్నాం. శాంక్షను అయిన 30 లక్షలు ఒకరు కోర్టులో స్టే తేగా మరొక 8 సంఘాలు కలిసి ఎంప్లాయీస్ వెల్‌ఫేరు ఫండు నుండి అప్పులు యివ్వరాదని తీర్పు కూడా తెచ్చాయి. అయితే అది ప్రస్తుతం ఫుల్‌బెంచి పరిశీలనలో వున్నది.
అంతమాత్రన భవన నిర్మాణం నిలుపుదల చేయాలని మనం భావించలేదు. అలా ఎవరు నిలుపుదల చేయాలని తలంచినా మన కార్యకర్తలు సహించరు, సరికదా ఎన్ని త్యాగాలకయినా సిద్ధపడతారు అసాధ్యమైన దానినైన సుసాధ్యం చేసి తీరుతారు. ముందుగా మన దగ్గర సంఘంలోను ప్రచురణలలోను వున్న 5 లక్షల పెట్టుబడితో ప్రారంభించి, మహాసభలలో మిగలగలదని భావిస్తున్న పదిలక్షలతో దానిని పూర్తి చేయాలని తలపెట్టాము. ప్రస్తుతం మన కార్యకర్తలు నిద్రాహారాలు మాని ఆ పనిచేస్తున్నారు. పట్టుదలే ప్రాణంగా భావించే మనకు అసాధ్యమనేది లేదుకదా!
3. **తూర్పు గోదావరి జిల్లా భవనం :** కాకినాడలో సెంటరు ప్లేసులో అన్నీ ఆఫీసులకు అందుబాటులో శ్రీ వి.సూర్యనారాయనరాజు టీచర్సహోం పేరుతో రెండు అంతస్తులతో అన్ని హంగులతో, ఉద్యమ నిర్వహణకు వీలుగా వున్నది.
4. **పశ్చిమ గోదావరి జిల్లా భవనం :** ఏలూరు శ్రీ పి.వి.సుబ్బరాజుగారి పేరుతో రెండు అంతస్తుల భవనం, ఉద్యమ అవసరాలకు అనుగుణంగా సెంటరు ప్లేసులో వున్నది.
5. **కృష్ణాజిల్లా భవనం :** మచిలీపట్నం, బస్‌స్టాండ్ ప్రక్క భవన నిర్మాణానికి శ్లాబు వేశారు. సంఘ అవసరాలకు అనుగుణంగా దానిని తీర్చిదిద్దుతున్నారు.
6. **గుంటూరుజిల్లా భవనం :** అనువైన స్థలంలో అమరజీవి మైనేని పేరుతో రెండంతస్తుల భవనం. ఉద్యమం అవుసరాలకు అనువుగా వున్నది.
7. **ప్రకాశం జిల్లా భవనం :** సెంటరు ప్లేసులో ఒంగోలులో, ఏరియా చిన్నదైనా మూడంతస్తుల భవనం, ఉద్యమ అవసరాలకు అనువుగా వున్నది.
8. **నెల్లూరు జిల్లా భవనం :** రైల్వే స్టేషనుకు దగ్గరగా, రెండంతస్తుల భవనం నిర్మించబడింది. రెండవ అంతస్తు పూర్తిఅయింది. స్థలం చిన్నది అయినా సంఘ కార్యక్రమాలకు ఇబ్బందిలేదు.
9. **చిత్తూరు జిల్లా భవనం :** జిల్లా ప్రధాన కేంద్రమయిన తిరుపతిలో భవనం నిర్మించబడి, ఉద్యమ అవుసరాలకే గాక ఇతర జిల్లాల నుండి వెళ్లే మన కార్యకర్తల అవసరాలకు అనుగుణంగా కూడా వున్నది.
10. **కర్నూలు జిల్లా భవనం :** కర్నూలు సెంటరు ప్లేసులో ఒక భవనంతో సహా కొన్నారు. దాని ప్రక్క స్థలం కూడా అమ్మకానికి వచ్చింది. దాని గురించి కూడా ఆలోచిస్తున్నారు.
11. **ఖమ్మంజిల్లా భవనం :** ఖమ్మం సెంటరులో అన్ని జిల్లాల కంటె పెద్ద భవనం రెండు అంతస్తులతో నిర్మించి, ఉద్యమానికి

అనువుగా ఉంది.

12. నల్గొండ జిల్లా భవనం : నల్గొండ సెంటరులో ప్రస్తుత అవసరాలకు అనుగుణంగా భవనం వున్నది. మీటింగు హాలు నిర్మించుకోవలసి వున్నది.

13. మహబూబ్‌నగర్ జిల్లా భవనం : బస్‌స్టాండ్ ప్రక్క సెంటరు ప్లేసులో ముందు చిన్న షెడ్ నిర్మించారు. మీటింగు హాలుకు శ్లాబు వేశారు.

కరీంనగర్, వరంగల్ జిల్లాలో స్థలాలు, కొంత డబ్బు వున్నది. భవనాలకు ఏర్పాట్లు చూస్తున్నారు. మరికొన్ని జిల్లాలు ఆలోచనలో వున్నాయి. అమలాపురం, భద్రాచలం, మధిర, పర్చూరు, ఆత్మకూరు (నెల్లూరుజిల్లా) కలువాయి, కల్వకుర్తి) మండలాలలో భవనాలు వున్నాయి.

మన భవనాలు విద్యా విజ్ఞాన కేంద్రాలుగా, ప్రగతిశీల ఉద్యమాలకు పట్టుకొమ్మగా, పోరాటాలకు ఆయువు పట్టుగా ఉపయోగించుకొనేదానికి నిత్యం కృషి చేస్తున్నాం. ఏ ఆశయాలతో భవన నిర్మాణాలు చేశామో వాటికి న్యాయం చేకూర్చుదాం.

## యు.టి.యఫ్. - ఆలిండియా సంఘం

అమరజీవి సత్యప్రియరాయ్ స్థాపించిన, ఆలిండియా సెకండరీ టీచర్స్ ఫెడరేషన్‌లో (AISTF) లో మనం సభ్యులుగా చేరాం. మహనీయుని పేరు చెప్పుకుంటున్నా, ఆ ఛాయలు అందులో కనిపించుటలేదు.

ఈ సంవత్సరం ఢిల్లీలో 1996 డిశంబరు 28,29,30 తేదీలలో మహాసభలు జరిగాయి. ఊరూ పేరూ లేని ఒక సంఘానికి పశ్చిమ బెంగాలులో సభ్యత్వం యిచ్చిన కారణంగా ఎ.బి.టి.ఎ. వాకవుట్ చేసింది. గందరగోళాల మధ్య గత సంవత్సరం కమిటీనే ఈ సంవత్సరం కూడా ఎన్నుకున్నారు. ఉపాధ్యాక్షులుగా శ్రీ డి.రామిరెడ్డి, కార్యవర్గ సభ్యునిగా శ్రీ ఎ.వెంకటస్వామిగారిని యధాప్రకారం ఆ పోస్టులలో వున్నారు.

బెంగుళూరులో ఆలిండియా సంఘం శిక్షణా తరగతులు నిర్వహించింది శ్రీ సిహెచ్. సభాష్ చంద్ర బోసు, శ్రీ కె.వెంకటరావు, శ్రీమతి అరుణ, శ్రీమతి చిట్టెమ్మ, శ్రీరామ్‌గారులు హాజరయిన క్లాసులు 96 జూలై 22 నుండి 26 వరకు జరిగాయి. ఏదో ఒక పోరాట కార్యక్రమంలో లేక ఏ విధమైన ఉద్యమాలు నడుపక క్రమక్రమంగా దాని పోరాటశక్తి కొడిగట్టి పోతున్నది. మనందానికి ప్రత్యామ్నాయం గురించి ఆలోచించాలి.

జనవరిలోనే దానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయిన రాణా ప్రతాప్ మరణించారు. ఇంతలోనే ఈ సంఘటన జరగడం బాధాకరం.

## యు.టి.యఫ్. అకడమిక్ సెల్

యు.టి.యఫ్. ఒక వృత్తి సంఘం. అంతేకాక అకడమిక్ విషయాలకు అంకితమైన సంఘం ఆశయాల నిబద్ధతతో, సామాజిక స్పృహ కలిగిన సంస్థ. అందుకే మనం అకడమిక్ విషయాలలో అంకితభావంతో మని చేస్తాం.

టీచింగ్ ఎయిడ్స్, వర్కు షాపులు, పిరియడ్ ప్లానులపై పుస్తకాలు కూడా తీసుకువచ్చాం. 4వ తరగతి మనం ముద్రించాం. 3, 5 తరగతులు ఇతరులకు యిచ్చాం. అవి ఇంకా ముద్రణ కాలేదు.

10వ తరగతి టెస్టు పేపర్లు 15,000 ముద్రించాం. ఈ సంవత్సరం జిల్లాలోవారీగా శ్రీకాకుళం 102, విజయనగరం 13, విశాఖపట్నం 421, తూర్పుగోదావరి 907, పశ్చిమగోదావరి 829, కృష్ణా 2838, గుంటూరు 750, ప్రకాశం 1409, నెల్లూరు 944, చిత్తూరు 748, కర్నూలు 43, అనంతపురం 1043, ఖమ్మం 1114, వరంగల్ 58, కరీంనగర్ 614, అదిలాబాద్ 383, నల్గొండ 1106, మహబూబ్‌నగర్ 523, నిజాంబాద్ 235, మెదక్, రంగారెడ్డి 200, హైద్రాబాదు 302, ఇతరములు 418, మొత్తం 15,000.

## ఐక్యఉపాధ్యాయ ప్రచురణలు

ప్రచురణల పరంగా అధ్యాపకదర్శిని పేరుతో 14 భాగాలు వేశాము. వ్యాయామదర్శిని, ఇండెక్సు పుస్తకం, పి.ఆర్.సి. పుస్తకాలు, జి.ఓ. 1, 40 పుస్తకాలు ఆయా కాలాలకు అవుసరమైన రీతిలో తీసుకవచ్చాము.

14వ భాగం మహాసభలలో ప్రారంభించాలని భావిస్తున్నాము. జి.ఓ.ల ముద్రణ అనేది నిత్యం చేయవలసిన కృషి అది కొనసాగించాలని భావిస్తున్నాము.

ప్రచురణలపరంగానే బాగ్సు పర్సులు తదితరాలు కూడా తెస్తున్నాము. వాటికి కూడా అపారమైన ఆదరణ వచ్చింది.

## సంఘనిర్మాణ విషయాలు

చెన్నుపాటి ఆశయాలబాటలో నడుస్తున్న మన సంఘం. సామాజిక స్పృహతో ముందుకు వెళ్ళాలి. సమరశీల పోరాటాలకు మార్గదర్శి కావాలి. అందుకు అంకితభావంతో పనిచేసే కార్యకర్తల అవసరం ఎంతయినా వుంది. అట్టి కార్యకర్తలకు శిక్షణ యిచ్చేదానికి కృషి చేస్తున్నాం.

ఉద్యమశిక్షణ తరగతులు ఈ సంవత్సరం కూడా నిర్వహించాం. వివిధ సదస్సులు కూడా నిర్వహించాం. గుంటూరు జిల్లాలో 1996 జులై 28, 29 తేదీలలో 125 మందితో శిక్షణా తరగతులు జరిగాయి. నెల్లూరు జిల్లా నాయుడుపేటలో 1996 ఏప్రిలు 23, 24, 25 తేదీలలో 60 మందికి మహిళా తరగతులు జరిగాయి.

చిత్తూరు జిల్లా తిరుపతిలో 1996 మే 3,4,5 తేదీలలో 100 మందితో క్లాసులు జరిగాయి.

ఖమ్మంజిల్లాలో 1996 జూన్ 4,5,6 తేదీలలో ఉద్యమ క్లాసులు జరిగాయి.

మహబూబ్‌నగర్, మహబూబాబాద్, అనంతపురం, ఇందుకూరుపేటలోను విద్యాగోష్ఠులు, తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో ఎయిడెడ్ సదస్సులు జరిగాయి.

ఏమయినా ఇంకా మనలో సరిచేసుకోవలసిన లోపాలు లేకపోలేదు. పాఠశాలలో అంకిత భావంతో పని చేయడంలో వెనుకబడుతున్నాం. కాన్వెంటు మోజులోపడ్డ జనాన్ని మరల్చలేకపోతున్నాం. అవినీతికి వ్యతిరేకంగా మన ఉపాధ్యాయులను పూర్తిగా నిలబెట్టలేకపోతున్నాము.

ఈ లోపాలు సరిచేసుకొని ముందుకు వెళ్ళాలి. మెజారిటీ ఉపాధ్యాయులని మన సంఘంలోనికి ఆకర్షించాలి.

## మన కార్యాలయాల నిర్వహణ

విజయవాడ కార్యాలయంలో ప్రధాన కార్యదర్శి పూర్తి కాలం పనిచేస్తున్నారు. పాఠశాల నిర్వహణ ఆఫీసు పనులకు సహకరించే సహాధ్యక్షులు వున్నారు. పాఠశాల చూసుకుంటూ పనిచేసే పత్రిక ప్రధాన సంపాదకులు.

హైదరాబాద్ ఆఫీసులో అధ్యక్షులు పూర్తి కాలం పనిచేస్తున్నారు. ఒక కార్యదర్శి తన డ్యూటీ చూసుకుంటూ సహకరిస్తు వున్నారు.

విజయవాడ, హైదరాబాద్ కార్యాలయాలలో ఉద్యమ అవసరాలకు సరిపడా సిబ్బంది పర్నిచరు, టైపు మిషన్లు, డూప్లికేటు మిషన్లు అన్నీ వున్నాయి. రెండు చోట్ల మంచి లైబ్రరీలు వున్నాయి.

పత్రిక ఫిక్సడ్ డిపాజిట్‌లో ప్రస్తుతం రూ. 10,00,000 వున్నాయి. హైదరాబాద్ స్థలం కొన్నప్పుడు యిచ్చిన అప్పు రూ. 5,00,000లు ఇంకా రావాలి.

## భవిష్యత్తు కార్యక్రమం

విద్యను ప్రయివేటు పరం చేసేదానికి ప్రభుత్వం చేసే ప్రయత్నాలను ఎదిరించాలి. విద్యా బిల్లులో సరైన మార్పులు తీసుకురావాలి. కాన్వెంటులవైపు మొగ్గే ప్రజలలో విస్తృత ప్రచారం చేసి మన పాఠశాలలవైపు ఆకర్షించాలి.

ఎయిడెడ్ టీచర్లకు బడ్జెట్ కంట్రోలు తొలగింపు, అప్రంటీస్ విధానం తొలగింపు, ఏజన్సీ ఉపాధ్యాయుల సమస్యలు, సింగరేణి కాలరీస్ ఉపాధ్యాయుల హక్కుల రక్షణకు కృషి చేయాలి. పంచాయితిరాజ్ ఉపాధ్యాయుల ప్రొవిన్షలేషన్ ప్రమోషను అవకాశాలు ఈనాటికి అమలు జరుగుట లేదు. వాటిని వెంటనే అమలు జరిపించుకోవాలి. మున్సిపల్ ఉపాధ్యాయుల గ్రాంటు సక్రమంగా చెల్లించేలా చూసుకోవాలి.

హైద్రాబాద్ భవనంపై 2 అంతస్తులకు శ్లాబు వేసి, మూడవ అంతస్తుకు శ్లాబుకై సిద్ధం చేస్తున్నాము.

శాస్త్రీయ విద్యా విధాన అమలుకు, కృషి చేయాలి.

మహాశయులారా,

గత 12 మాసాల కృషినివేదిక మీ ముందుంచాను. పరిశీలించి పదును పెట్టండి. చర్చించి నిగ్గు తేల్చండి. భవిష్యత్ ఉద్యమానికి బాటలు వేయండి.



# పత్రికా నివేదిక

శ్రీ కె. కేశవరెడ్డి
ప్రధాన సంపాదకులు

అధ్యక్షా !

స్టేట్ కౌన్సిల్ సభ్యులారా !

అధ్యయనం అధ్యాపనం సామాజిక స్పృహలను సూత్రాలుగా స్వీకరించి, ఉపాధ్యాయుల సామాజిక బాధ్యతను గుర్తింపజేస్తూ, సమాజంలోని ముఖ్యంగా విద్యారంగంలోని అవినీతి అన్యాయం అక్రమాలను ఎదిరించి పోరాడుతూ ఉద్యమాన్ని మునుముందుకు నడిపిస్తున్న మీకు "ఐక్యఉపాధ్యాయ" సంపాదకవర్గం పక్షాన ఇవే ఉద్యమాభివందనాలు.

ఆరవ విద్యా వైజ్ఞానిక మహాసభల సందర్భంగా 1993 ఆగష్టులో గుంటూరులో అప్పటి వరకు పత్రిక సాధించిన ప్రగతిని సమీక్షించుకొన్నాం. సాహిత్య సాంస్కృతిక కళారంగాలకు కాణాచియైన ప్రకాశం జిల్లా ఒంగోలులో ఏడవ విద్యా వైజ్ఞానిక మహాసభల సందర్భంగా మన పత్రిక సాధించిన పురోగతిని సమీక్షించుకొంటున్నాం.

గత నాలుగు సంవత్సరాల కాలంలో ఉద్యమ వాణిగా ఐక్య ఉపాధ్యాయ సాధించిన ప్రగతినీ, ఉద్యమ ప్రచార సాధనంగా దాని కృషిని, విద్యా వైజ్ఞానిక మాస పత్రికలలో దాని ప్రత్యేకతనూ, పత్రిక నిర్వహణలో ఎదురైన ఆటుపోట్లనూ, వాటి నధిగమించడానికి తీసుకొన్న చర్యల్ని సంపాదకవర్గం పక్షాన సంగ్రహంగా మీ ముందుంచుతున్నాం.

**సంపాదకీయాలు - కార్టూన్లు**

రాతలో ఒకటి రెండు పేజీలలో వున్న విషయం చదివిన తరువాత పాఠకునిలో కలిగించగల స్పందనను కార్టూన్ కంటబడగానే కలిగిస్తుంది. ఈ ప్రక్రియను బాగా ఉపయోగించుకొనగలుగుతున్నాం. ఉదాహరణకు "వీధులలో చిత్తుకాగితాల నేరుకుంటున్న బిడ్డల బొమ్మ క్రింద "మీదే మీదే సమస్త విశ్వం - మీరే లోకపు భాగ్య విధాతలు" వ్యాఖ్య : డంకెల్ కొండచిలువ నోట్లోకి రైతులను, వ్యాపార వర్గాలను తదితరులను నెడుతూ "పదండి మనకే లాభం, నేను అన్నీ చర్చించాను పదండి" అంటూన్న ప్రభుత్వ ప్రధాన బాధ్యుడు. అమెరికా ఉక్కు బూటుతో ప్రజా ఉద్యమాలను అణిచివేసే కార్టూను క్రింద "ఉక్కుపాదాలు హక్కుల్ని హరించలేవు రాక్షస నిర్బంధాలు రాజ్యాన్ని పాలించలేవు" వ్యాఖ్య పోరాటీచర్లకు సన్మానం చేస్తున్న ప్రభుత్వ బాధ్యుల కార్టున్ - "కోనేరు కమిటీ ఛాయలో కొడిగడుతుంది విద్యారంగం" - వ్యాఖ్య.

సంపాదకీయాలు ఆయా సమయాలకు చెందిన సామాజిక సమస్యలను విద్యారంగ వైఫల్యాలను ఎత్తి చూపేవి. సంపాదకీయాలు, పాఠకులకు సమస్యలను వివరిస్తూ కర్తవ్య బోధ చేస్తూ ఉద్యమ పథంలో మును ముందుకు నడిపించేవిగా వుంటున్నాయని పలువురి ప్రశంసల నందుకుంటున్నాయి. మన కవర్ పేజీలలో వివిధ జిల్లాలలో జరిగిన పోరాట కార్యక్రమాలకు ఉద్యమ తరగతలకు సంబంధించిన ఫోటోలను ప్రచురిస్తున్నాం.

**ఇతర శీర్షికలు :** వృత్తిపరమైన సామాజిక పరమైన సమాచారాన్ని అందజేయడమే గాక ఉపాధ్యాయులకు సమస్యల యెడల అవగాహన పెంచి వారిని పోరాటాలకు సన్నద్ధం చేసే వివిధ శీర్షికలు నిర్వహిస్తున్నాం.

**ఉద్యమ సంబంధమైనవి :** సంపాదకీయం, వార్తా ప్రపంచం, గుసగుసలు, సభలు-సమావేశాలు,రాయబారాలు, పోరాటాలు-ఫలితాలు, ప్రాతినిధ్యాలు పరిష్కారాలు, పాఠకుల అభిప్రాయాలు పాఠకుల లేఖలు.

**వృత్తి పరమైనవి :** ప్రశ్నోత్తరాలు నియమ నిబంధనలు, సమస్యాతోరణం బదిలీలు కావాలా, ప్రభుత్వ ఉత్తర్వులు, డి.ఎ. టేబుల్స్.

**విద్యా సంబంధమైనవి :** విద్యా విధానం- తీరు తెన్నులు, విదేశీ విద్యా విధానం, పాఠ్య గ్రంధాల తీరుతెన్నులు.

**విజ్ఞాన సంబంధమైనవి :** విజ్ఞాన వీధి, మనం-మన ఆరోగ్యం, క్రీడారంగం, మీకు తెలుసా? ఆలోచించండి, పజిల్.

**సాహిత్య సంబంధమైనవి :** కథలు - గేయాలు, మీరు చదివారా? గ్రంధ స్వీకారం.

**కథలు - గేయాలు :**

శీర్షికకు తగినట్లుగా ప్రచురించలేక పోతున్నాం. కాలానికి మించని కథను ప్రచురిస్తున్నాం. మంచి శిల్పంతో వ్రాయబడిన మినీ కథ సూటిగా హృదయాన్ని తాకుతుంది. రచయిత ఆశించిన స్పందన పాఠకునిలో కలిగిస్తుంది. మన పత్రికలలో ప్రచురించిన "కంకర రాయి", "సమానహక్కులు", "మందలింపు"లు ఉత్తమ మినీ కథానికలు. అలాగే స్వామిగారి "డంకెల్", "గొడ్డలి-కర్ర", నాగటి గారి "ఆఫ్ ది రికార్డ్స్" ఎన్నదగిన కథానికలు.

ఈ కాలంలో మనం ప్రచురించిన గేయాలు మంచిని మానవతను గుబాళింపజేసేవి. సమాజంలోని అస్తవ్యస్త పరిస్థితుల్ని ఎత్తిచూపేవి. స్తబ్ధతగా నున్న వారి వీపు చరిచి కరవ్య బోధ చేసేవి. ఒకటి రెండు ఉదాహరణలు.

బిడ్డల్ని ఇంజనీర్లు డాక్టర్లు, ఐ.ఎ.ఎస్., ఆఫీసర్లు చేయాలనుకొనే తల్లిదండ్రులు ఆకాంక్షలనూ - ఫలితంగా కొడిగడుతున్న బిడ్డల బాల్యాన్ని శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు గారు "వాళ్ళ వాకిళ్ళను వాళ్ళే తెరవనివ్వండి" అనే కవితలో దయనీయంగావర్ణించారు.

సాయంత్రం దాకా వాళ్ళు
కప్పేసిన బుట్టల్లో కోడి పిల్లలై
అక్షరాలను ముక్కులతో పొడుస్తూనే వుంటారు.
ముని మాపుకు ముందర
లెక్కలై సైన్సులై ప్రతి పదార్థ తాత్పర్యాలై
ఆఫ్రికా ఎడారుల్లో ఆవిరులై
హోం వర్కులుగా మారి ఇల్లు చేరుతారు"
చాలా ఆవేదనతో తల్లి దండ్రులను
"ఒక్క కిటికీనే తెరచి మీరు
పెక్కుదారులు మూసేయకండి
శుభ్ర పవనాల్లో వాళ్ళ మనసులు
స్నానించడానికి అన్ని వాకిళ్లు
తెరిపించండి.
ఒతుకు వాళ్ళది భవిష్యత్ వాళ్ళది
ప్రకృతి వారిది పరవశత్యం వాళ్ళది
మీ కిరాయి ఆలోచనల బోనులో
వాళ్ళ టాలెంట్‌ను పాతిపెట్టకండి
ప్లీజ్ వాళ్ళ దారికి అడ్డు నిలవకండి
తొలగండి!" అని అర్థిస్తాడు, ఆక్రోశిస్తాడు, హెచ్చరిస్తాడు.

"మానవత లేని నాడు మత మెందుకు దండగ
మనిషిగా నిలవాలి శ్రమ జీవులు కండగ"
- ఎలమర్తి రమణయ్య

ఆలాగే అడిగోపుల వెంకటరత్నం గారి "విముక్తి కోసం" సంపటం దుర్గా ప్రసాదరావు గారి "పుడమితల్లికన్నీరు" శ్రీమతి లలితా భీమయ్య గారి "వస్త్రం-వజ్రం" వేణుశ్రీ గారి "ముట్టడి" జి. శ్రీరామమూర్తి గారి "చెరగని చరిత్ర" యం. వీరేశ్వరరావు గారి "పంజరంలో బాల్యం" ', వి. విజయ కుమార్ గారి "దస్తూర్, కె యస్వీ. ప్రసాద్ గారి "ఆపరేషన్ అనివార్యం", "స్కానింగూ చెప్పకే", "చైతన్య కమలం", కొసూరి రవికుమార్ గారి "అమ్మతనం" వడ్లమాను వెంకటేశ్వర్లు గారి "మేడే" ' మరలా మరలా చదవదగిన గేయాలు.

మనం ప్రచురించిన గేయాలన్నీ ఉన్నత సాహిత్య ప్రమాణాలకు నిలిచేవి; సామాజిక అవగాహన కలిగించేవి.

**విజ్ఞానదాయకమైన వ్యాసాలు :**

భారత దేశం ఆర్థిక పరిస్థితులపై డాక్టర్ వై. రాధా కృష్ణమూర్తి గారి వ్యాసాలు సమాచారాన్ని అందజేయడమే గాక చక్కని విశ్లేషణతో కూడు కొన్నవి. ఆర్థిక రంగంపై యస్. ఆనందనాయుడి గారి వ్యాసాలు విస్తృత అధ్యయనంతో చేసినవి. విద్యారంగం-తీరు తెన్నులపై శ్రీ వి. బాలసుబ్రమణ్యం వ్యాసాలు శాస్త్రీయ వైఖరిపై శ్రీ పి. భీమన్న గారి వ్యాసాలు, ప్రొఫెసర్ యశ్‌పాల్ కమిటీ సిఫార్సులపై శ్రీ యం.ఎ.కె. దత్ గారి వ్యాసం, మునిసిపల్ విద్యా కమిటీలపై శ్రీ కె. జోజయ్య గారి వ్యాసం విజ్ఞానదాయకమైనవి. అలాగే "ప్రజాభిప్రాయం - పత్రికలు, "చదువెందుకు?" "మతపరమైన భావనలు-ఒక పరిశీలన", "శాస్త్రీయ విజ్ఞానం-అవగాహన" ఎన్నదగిన వ్యాసాలు.

వివిధ రంగాలకు చెందిన విషయాలను విస్తృతంగా అధ్యయనం చేస్తూ చాలా సమాచారాన్ని సేకరిస్తూ వ్రాస్తున్న శ్రీ జి.సి. మధు సూదనరావుగారి వ్యాసాలు విజ్ఞానదాయకంగా వుంటున్నాయి. పాఠకుల ఆదరాభిమానాలు చూరగొంటున్నాయి. శాస్త్రవేత్తల పరిచయం చేస్తూ శ్రీ జి. వెంకటరాములు వ్యాసాలు కూడ పాఠకుల అభిమానాన్ని పొందాయి.

**ప్రశ్నోత్తరాలు :**

ఉపాధ్యాయులకు వృత్తిపరంగా ఎదురయ్యే సమస్యల చిక్కుముడులను అధ్యక్షులు శ్రీ డి. రామిరెడ్డి, సహాధ్యక్షులు శ్రీ కె. జోజయ్య విడదీసి వివరిస్తున్నారు. వీరు పత్రికా ముఖంగా యిస్తున్న జవాబులు రాష్ట్రవ్యాప్తంగా వివిధ స్థాయిల్లోని కార్యకర్తలు రాయబారాలు జరిపేటప్పుడు, ప్రాతినిధ్యాలు చేసేటప్పుడు, సమన్వయ సమావేశాల్లో పాల్గొన్నప్పుడు విరివిగా తోడ్పడుతున్నాయి.

**నియమ నిబంధనలు :**

ఈ శీర్షికను శ్రీ ఆర్. శ్రీహరిరావు ధారావాహికంగా చక్కగా నిర్వహిస్తున్నారు.

**మీరు చదివారా !**

మార్కెటులోకి ఇతర వస్తువులలాగానే పుస్తకాలు కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్నాయి. ఇటీవల వచ్చే పుస్తకాలలో సమాచారాన్ని అందించే పుస్తకాలు ఎక్కువ. సామాజిక పరిస్థితులను విశ్లేషించేవి తక్కువ. యువతీ యువకులలోని సహజోద్రేకాలను రెచ్చగొట్టి పెడమార్గాలు పట్టించేవి, కుల మత సంకుచిత ధోరణులను పెంచేవి గణనీయంగా వస్తున్నాయి. ప్రతి పుస్తకం కొనడం, చదవడం సాధ్యం కాదు. మంచి పుస్తకాలను ఎంపిక చేసుకొనడం అడ్డదిడ్డంగా పెరిగిన గంజాయి మొక్కల్లో అక్కడొకటి యిక్కడొకటిగా వున్న తులసి మొక్కలను వెతుక్కొనడం లాంటింది. పఠనీయ గ్రంథాలనుఎంపిక చేసి వాటిని పాఠకులకు పరిచయం చేసే కృషిని శ్రీ నాగటి నారాయణ, శ్రీమతి పి. ఇందిరాదేవి సాగిస్తున్నారు.

**మనం - మన ఆరోగ్యం :**

కొంత పూర్వ పరిజ్ఞానం లేకుండా అర్థం చేసుకొనడం సాధ్యపడని వైద్యశాస్త్ర విషయాలను తనదైన బాణీలో పాఠకుల్ని ఆకట్టుకొనేలా చెప్పగలగడం డాక్టరు బ్రహ్మారెడ్డి గారి ప్రత్యేకత.

**పాఠ్య గ్రంథాల తీరుతెన్నులు :** ఈ శీర్షికను శ్రీమతి నన్నపనేని రమాదేవి నిర్వహిస్తున్నారు. విషయంతో రాజీపడకుండానే కొంత సరళంగా చెపితే బాగుంటుందని పాఠకులు అభిప్రాయపడుతున్నారు.

**పత్రిక క్యాంపెయిన్లు :**

ఒకప్పుడు పత్రిక సర్క్యులేషన్ 20వేలకు పెంచాలన్నది మన లక్ష్యం. ఆ లక్ష్యాన్ని చేరుకొన్నాం. ఒకప్పుడు పాఠశాలకొక పత్రిక, కార్యకర్తకొక పత్రిక అన్నది మన నినాదం. దానిని సాధించడం వలననే గతంలో నిర్ణయించుకొన్న లక్ష్యాన్ని చేరుకొనగలిగాం.

పత్రిక మన ఉద్యమవాణి. ఎంత గొప్ప కార్యకర్తయైనా ప్రతి ఉపాధ్యాయుని కలిసి ఉద్యమపరమైన విషయాలకు వివరించలేడు. ఉద్యమవాణిని ఎంత విస్తృతంగా వినిపించగలిగితే అంతగా ఉద్యమం ఉపాధ్యాయులలో చొచ్చుకుపోతుంది. కాబట్టి ఇక నుండి ప్రతి సభ్యునికి ఒక పత్రిక ప్రతి ఉపాధ్యాయునికి ఒక పత్రిక నినాదంతో పత్రిక సర్క్యులేషన్ పెంచాలి.

**ముఖ్య సూచనలు !**

1. చందాలు పంపేటప్పుడు చిరునామాలు స్పష్టంగా వ్రాయాలి. పిన్‌కోడ్ తప్పక వేయాలి. 2. అడ్రసు తెలిపేటప్పుడు చందా నెంబరు విధిగా ఉదహరించాలి. అది సంవత్సర చందాయో జీవిత చందాయో స్పష్టంగా వ్రాయాలి. 3. పత్రిక తరచుగా అందకపోతే పోస్టల్ కంప్లయింట్ పెట్టి సహకరించాలి. 4. అడ్రసు మార్పులు సకాలంలో తెలపాలి. 5. రిపోర్టులు వీలయినంత సంగ్రహంగా ప్రధాన విషయాన్ని శీర్షికగా పెట్టి కాగితానికి ఒకవైపే వ్రాసిపంపాలి. 6. చందాలు లిస్టుగా పంపేటప్పుడు డూప్లికేట్ తీసి ఒక కాపీ పంపితే చాలు. రశీదు అందగానే తమ వద్ద నున్న లిస్టులో వరుస నంబర్లు వేసుకోవచ్చు.

గత నాలుగు సంవత్సరాల పత్రికనివేదిక సంక్షిప్తంగా మీ ముందుంచాం. మీ సూచనలతో మెరుగులు దిద్దండి. విమర్శలతో సరిదిద్దండి

FINANCIAL REPORT

## ఐక్య ఉపాధ్యాయ పత్రిక నివేదిక

1-3-96 నుండి 28-2-97 వరకు

| జమలు : | | | ఖర్చులు | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రారంభ నిల్వ | | | | |
| | ఆఫీసు | 493-30 | 1. | ప్రయాణము | 14,625-25 |
| | బ్యాంకు | 61,470-02 | 2. | ప్రింటింగ్ | 1,48,878-60 |
| 2. | సంగిర చందాలు | 3,89,532-50 | 3. | టైటిల్ పేపరు | 69,598-00 |
| 3. | జీవిత చందాలు | 33,099-00 | 4. | స్టేషనరి | 10,014-80 |
| 4. | ఏజన్సీలు | 42,534-00 | 5. | పోస్టేజి | 36,600-00 |
| 5. | ప్రకటనలు | 74,575 | 6. | ఆఫీసు నిర్వహణ | 4,873-25 |
| 6. | ఇతరములు | 4,164-00 | 7. | లైబ్రరి | 4,185-45 |
| 7. | వడ్డీలు66,012-00 | | 8. | జీతములు | 34,260-00 |
| | | | 9. | బహుమతులు | 3,565-50 |
| | | | 10. | న్యూస్ ప్రింట్ | 2,05,111-00 |
| | | | 11. | అప్పులు | 86,363-00 |
| | | | 12. | ఇతరములు | 7,041-00 |
| | | | 13. | బ్యాంకు నిల్వ | 46,187-02 |
| | | | 14. | చేతి నిల్వ | 576-95 |
| | మొత్తం | 6,71,879-82 | | మొత్తం | 6,71,879-82 |

### 1-8-93 నుండి 28-2-97 వరకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రారంభ నిల్వ | | | | |
| | ఆఫీసు | 61-65 | 1. | ప్రయాణము | 29,186-80 |
| | బ్యాంకు | 64,768-02 | 2. | ప్రింటింగ్ | 4,76,277-60 |
| 2. | సంగిర చందాలు | 11,10,220-50 | 3. | న్యూస్ ప్రింట్ | 10,78,372-00 |
| 3. | జీవిత చందాలు | 2,95,796-00 | 4. | స్టేషనరి | 36,282-15 |
| 4. | ఏజన్సీలు | 84,877-50 | 5. | పోస్టేజి | 1,36,746-00 |
| 5. | ప్రకటనలు | 1,21,650-00 | 6. | ఆఫీసు నిర్వహణ | 35,351-15 |
| 6. | అప్పులు | 1,14,762-30 | 7. | లైబ్రరి | 14,778-90 |
| 7. | వడ్డీలు | 3,48,435-00 | 8. | జీతములు | 1,20,985-00 |
| 8.. | ఇతరములు | 17,385-85 | 9. | బహుమతులు | 23,935-50 |
| | | | 10. | ఫిక్స్‌డ్ డిపాజిట్లు | 1,50,000-00 |
| | | | 11. | ఇతరములు | 9,277-00 |
| | | | 12. | బ్యాంకు నిల్వ | 46,187-00 |
| | | | 13. | ఆఫీసు నిల్వ | 576-95 |
| | మొత్తం | 21,57,956-77 | | మొత్తం | 21,57,956-77 |

ఆడిట్ కమిటీ
యం.ఎ.కె. దత్, టి. కొండచారి, కె. నారాయణరావు

ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి

## ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆర్థిక నివేదిక

1-3-96 నుండి 28-2-97 వరకు

| | | | ఖర్చులు | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రారంభ నిల్వ | | | | |
| | ఆఫీసు | 184-55 | 1. | ప్రయాణము | 49,155-34 |
| | బ్యాంకు | 65,957-10 | 2. | ప్రింటింగ్ | 30,699-70 |
| 2. | సభ్యత్వం | 2,95,660-00 | 3. | స్టేషనరి | 9,258-50 |
| 3. | అద్దెలు | 6,290-00 | 4. | పోస్టేజి | 8,882-50 |
| 4. | డెలిగేటు ఫీజు | 11,705.00 | 5. | ఆఫీసు నిర్వహణ | 23,235-15 |
| 5. | ఇతరములు | 70.00 | 6. | పేపరు కొనుగోలు | 15,549-00 |
| | | | 7. | సమావేశములు | 36,060-91 |
| | | | 8. | టెలిఫోన్ | 48,886-44 |
| | | | 9. | జీతములు | 40,331-00 |
| | | | 10. | ఎ.ఐ.యస్.టి.యఫ్. సభ్యత్వం | 4,200-00 |
| | | | 11. | ఇతరములు | 829-00 |
| | | | 12. | అప్పులు | 91,032-70 |
| | | | 13. | బ్యాంకు నిల్వ | 24,523-10 |
| | | | 14. | చేతి నిల్వ | 783-31 |
| | మొత్తం | 3,83,426-65 | | మొత్తం | 3,83,426-65 |

### 1-8-93 నుండి 28-2-97 వరకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | ప్రారంభ నిల్వ | | | | |
| | ఆఫీసు | 384-97 | 1. | ప్రయాణము | 1,69,571-35 |
| | బ్యాంకు | 62,062-80 | 2. | ప్రింటింగ్ | 1,07,992-10 |
| 2. | సభ్యత్వం | 9,02,792-50 | 3. | పోస్టేజి | 31,135-90 |
| 3. | అద్దెలు | 18,708-00 | 4. | స్టేషనరి | 31,445-80 |
| 4. | డెలిగేటు ఫీజు | 17,305-00 | 5. | టెలిఫోన్ | 67,723-19 |
| 5. | వడ్డీలు | 23,638-00 | 6. | ఆఫీసు నిర్వహణ | 71,327-77 |
| 6. | అప్పులు | 61,970-30 | 7. | లైబ్రరీ | 1,031-20 |
| 7. | జనరల్‌ఫండ్ | 9,055.00 | 8. | జీతములు, అలవెన్సులు | 1,50,413-00 |
| 8. | ఇతరములు | 2,434-75 | 9. | సమావేశములు | 61,891-30 |
| | | | 10. | పేపరు కొనుగోలు | 24,857-00 |
| | | | 11. | ఎ.ఐ యస్.టి.యఫ్ సభ్యత్వం | 10,255-00 |
| | | | 12. | ఇతరములు | 1,977-00 |
| | | | 13. | అప్పులు | 43,432-30 |
| | | | 14. | హైదరాబాద్ భవన నిర్మాణం | 3,00,000-00 |
| | | | 15. | బ్యాంకు నిల్వ | 24,523-10 |
| | | | 16. | చేతినిల్వ | 783-31 |
| | మొత్తం | 10,98,359-32 | | మొత్తం | 10,98,359-32 |

ఆడిట్ కమిటీ
యం.ఎ.కె. దత్, టి. కొండచారి, కె. నారాయణరావు

ఎ. వెంకటస్వామి
ప్రధాన కార్యదర్శి

FINANCIAL REPORT

ఇంటర్ పరీక్షలకు హాజరవుతున్న విద్యార్థులకు శ్రీ ఈశ్వరనామ సంవత్సర శుభాకాంక్షలు :

శ్రీ సాధన ఎడ్యుకేషనల్ అకాడమి వారు 1997-98 విద్యా సంవత్సరము నుండి

**EAMCET ORIENTED INTEGRATED TEACHING**

(EAMCET దృక్పథంతో కూడిన సమగ్ర ఇంటర్మీడియట్ బోధన) లక్ష్యంతో స్థాపించుచున్న మరో నూతన సంస్థ.

# సాధన జూనియర్ కళాశాల

(కో-ఎడ్యుకేషనల్ & రెసిడెన్షియల్)

## ఇల్లందు క్రాస్ రోడ్స్, ఖమ్మం.

## గ్రూపులు : M.P.C. & Bi.P.C. (EM & TM)

★ పది వేలకు పైగా మల్టిపుల్ ఛాయిస్ బిట్స్ మరియు అనలిటికల్ మోడ్ ప్రశ్నలు explain చేసే లక్ష్యంతో ఏప్రిల్ 22 నుండి **EMACET-97, CRASH COACHING** ప్రారంభం.

★ ఇంటర్ ప్రథమ సంవత్సరము పరీక్షలకు హాజరైన విద్యార్థుల సౌకర్యార్థం ఏప్రిల్ 25 నుండి **EAMCET-97** కోచింగ్ ప్రారంభం.

★ పదవ తరగతిలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ఇంటర్ ప్రథమ సంవత్సరములో అడ్మిషన్‌లు **JUNE - 97** నుండి ప్రారంభం.

**విద్యార్థినీ విద్యార్థులకు విడివిడిగా హాస్టలు సౌకర్యము కలదు.**

**EAMCET- బోధన విశిష్టతలు :**

★ 20 నుండి 30 సంవత్సరముల బోధనానుభవము కలిగి ఎందరో విద్యార్థులకు మెడికల్, ఇంజినీరింగ్ కోర్సులలో సీట్లు లభించే విధంగా విజయవంతముగా ఎమ్‌సెట్ శిక్షణ నిచ్చిన అత్యంత ప్రతిభావంతులైన అధ్యాపకులచే, నూతన ఎమ్‌సెట్ విధానము (మల్టిపుల్ చాయిస్ & అనలిటికల్ మోడల్)నకు అనుగుణంగా, బోధన మరియు శిక్షణ కల్పించుట.

★ **EAMCET-97 CRASH** ప్రోగ్రాములో చేరిన విద్యార్థులకు ప్రతి రోజు 8 గం|| బోధనా తరగతులు నిర్వహించుట.

★ **EAMCET-97 Crash** ప్రోగ్రాము విద్యార్థులకు ప్రతి రోజు 2 గం|| టెస్టులు నిర్వహించి, టెస్ట్ పేపర్లు డిస్కస్ చేయుట.

★ సిలబస్‌ను యూనిట్స్‌గా విభజించి, నిర్దిష్ట కాలమాన ప్రకారం పూర్తి చేస్తూ ఏ రోజు కారోజు బోధించవలసిన సంబంధిత అంశములపై **Point-Wise Study - Materials** ను విద్యార్థులకు పంపిణీ చేయుట.

★ **Pre-EAMCET Coaching** ప్రోగ్రామ్స్‌లో చేరిన విద్యార్థులకు ప్రతి ఆదివారం **EAMCET MODEL** టెస్టు నిర్వహించుట.

★ **CRASH** మరియు **PRE-EAMCET** విద్యార్థులకు సిలబస్ పూర్తి అయిన తరువాత కనీసం **5 GRAND-TEST** లు నిర్వహించుట

**ఇంటర్మీడియట్ బోధన విశిష్టతలు :**

★ **EAMCET** బోధన చేసే అధ్యాపకుల చేత ఇంటర్మీడియట్ విద్యార్థులకు బోధన కల్పించుట.

★ ప్రతి విద్యార్థి విషయంలో వ్యక్తిగత శ్రద్ధ తీసుకొనుట, విద్యార్థి వ్యక్తిగత అకడమిక్ రికార్డును **maintain** చేయుట.

★ కళాశాల ప్రాంగణంలోనే అధ్యాపకుల మరియు ట్యూటర్ల పర్యవేక్షణలో **Study-Hour** నిర్వహించుట.

★ ప్రతి ఆదివారం విద్యార్థులకు వారాంతపు పరీక్షలు నిర్వహించుట.

★ విద్యార్థుల ప్రోగ్రెస్ ప్రతి నెల తల్లిదండ్రులకు తెలియజేయుట ★ నెలలో రెండవ శనివారం **Parent-Teacher Meeting** ఏర్పాటు చేయుట.

★ ఇంటర్మీడియట్ సిలబస్‌ను అక్టోబరు నెల వరకు పూర్తి చేసి నవంబర్, డిసెంబర్ నెలలలో **EAMCET** కోచింగ్ ఇచ్చి, మళ్ళీ జనవరి నుండి మార్చి వరకు ఇంటర్మీడియట్ రివిజన్ కోచింగ్ కల్పించుట.

అకడమిక్ సలహాదారులు

**శ్రీ వి.ఆర్. వైద్య** M.Sc.,
ప్రిన్సిపల్, సాధన డిగ్రీ కళాశాల, ఖమ్మం.

**శ్రీ యం. నరసింహారావు** M.Sc.,
ప్రిన్సిపల్, (Rtd.) ప్రభుత్వ డిగ్రీ కళాశాల, సత్తుపల్లి.

*Principal :* **Dr. Mandanapu Seetharamulu**
M.Sc., M.Phil, Ph.D., R.R. (U.G.C.)

*Honorary Correspondent*
**S. Ravindra,** M.Sc. B.Ed.,



# ఉపాధ్యాయ ఉద్యమ ఆణిముత్యం 'చెన్నుపాటి'

వివిధ సంఘాలుగా చీలి వున్న ఉపాధ్యాయ సంఘాల్ని సమైక్యపరచి రాష్ట్రవ్యాపిత సంఘంగా తీర్చిదిద్దిన ఘనత 'శ్రీ చెన్నుపాటి లక్ష్మయ్య'గారికే చెందుతుంది. ఉత్తమ సమాజ నిర్మాణానికి రూపురేఖలు దిద్దవలసిన ఉపాధ్యాయులు గర్భదారిద్ర్యంలో తమ జీవితాల్నిభారంగా ఈడుస్తున్న సమయంలో చెన్నుపాటి వారికి అండగా నిలిచారు. ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి ఆయన చేసిన కృషి ప్రతి ఉపాధ్యాయుని మదిలోఎప్పుడూ మెదలాడుతూనే వుంటుంది. 1968 డిసెంబర్ 9న ఆయన తుదిశ్వాస విడిచినా నేటికీ ఆయన చేసిన సేవల్ని మననం చేసుకోవడం దాన్నే నిరూపిస్తుంది. శ్రీ చెన్నుపాటి గుంటూరు జిల్లా వేలూరు గ్రామంలో 1907లో జన్మించారు. జిల్లా బోర్డు ప్రాధమికోపాధ్యాయునిగా తన జీవితం ప్రారంభించారు. బ్రిటీష్ పరిపాలనలో అతి నికృష్టమైన జీవితాన్ని గడుపుతున్న బడిపంతుళ్ళ ఆక్రందనలు ఆయన్ని ఉద్యమం వైపు నడిపాయి. అధికారుల జేబు సంస్థలుగా ఉండే సంఘాలు ఉపాధ్యాయులకు ఎటువంటి మేలు చేయలేవని గుర్తించారు. ఉపాధ్యాయ సమస్యల పరిష్కారానికి వారిని సమైక్యపరిచి విస్తృతమైన పోరాటం చేయడమే ఏకైక మార్గంగా భావించారు. 1947లో ఉపాధ్యాయుల రాష్ట్ర మహాసభ ఏర్పాటు చేశారు. ఆ మహాసభకు రాష్ట్రం నలుమూలల నుండి ఉపాధ్యాయుల్ని సమీకరించారు. అనాటి మహాసభలో "ఆంధ్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్" ఏర్పాటు చేశారు. శ్రీకాకుళం నుండి చిత్తూరు వరకు రాష్ట్రమంతటా విస్తృతంగా పర్యటించి, ఉపాధ్యాయుల్ని కార్యోన్ముఖుల్ని చేశారు. సంఘటిత పోరాటాలే సమస్యల పరిష్కారానికి మార్గాలుగా ఉద్బోధించారు. చెన్నుపాటి బోధనలతో ఉత్తేజితులయిన ఉపాధ్యాయులు పోరాటానికి నడుం బిగించారు. వారి ఉద్యమానికి గండి కొట్టడానికి ఆనాటి ప్రభుత్వం అనేక నిరంకుశ చర్యలను చేపట్టింది. సంఘం ఏర్పాటు చేసుకొనే స్వాతంత్ర్యం కూడా ఉపాధ్యాయులకు లేదని నిషేధపు ఉత్తర్వులు జారీ చేసింది. నిరంకుశ ఉత్తర్వుకు వ్యతిరేకంగా హైకోర్టుదాకా వెళ్ళి పోరాడారు. శ్రీ లక్ష్మయ్యగారు 1962లో శాసనమండలి ఎన్నికల్లో ఉపాధ్యాయ ప్రతినిధిగా గుంటూరు జిల్లా ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి ఎన్నికయి, ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి ఎనలేని కృషిసల్పారు. ఉపాధ్యాయ ఉద్యమ వ్యాప్తికి తన సర్వస్వాన్ని అర్పించిన నాయకుడు శ్రీ చెన్నుపాటి ఉద్యమవ్యాప్తికి ప్రతిబంధకంగా వుందన్న కారణంగా తన ఉద్యోగానికి రాజీనామా చేసి ఉద్యమానికే అంకితమైన ధన్యజీవి 'శ్రీ చెన్నుపాటి' పిత్రార్జితంగా వచ్చిన ఆస్తుల్ని ఉద్యమానికి అర్పించిన ఆదర్శవంతుడు శ్రీ చెన్నుపాటి. ఆర్థిక ఇబ్బందులు కారణంగా మందులిప్పించలేక తన భార్య చనిపోయినా చలించక రాష్ట్ర కౌన్సిల్‌లో యధాప్రకారం పాల్గొన్నారంటే, ఆయన మనోధైర్యం ఎటువంటిదో మనకర్థమవుతుంది. జటిల సమస్యలకు సైతం పరిష్కారమార్గాలు చూపించి అందరి ఆమోదం పొందేటట్లు చూసే మేధావి శ్రీ చెన్నుపాటి. కార్యకర్తల్ని ఉత్సాహపరుస్తూ, వారి కుటుంబ ఆర్థిక పరిస్థితుల గురించి తెలుసుకొన్న వారికి అండగా నిలబడిన నిరంతర శ్రమజీవి ఆయన. 1968లో ఆయనకు జలోధర వ్యాధి సోకింది. ఆయన ఆరోగ్యం క్షీణించింది. రెండు మాసాలు ఆయన మృత్యువుతో పోరాడారు. చివరకు 1968 డిసెంబర్ 9న సంఘ ప్రధాన కార్యాలయంలో సహచరుల మధ్య కన్నుమూశారు. ఆంధ్ర రాష్ట్రంలో ఉపాధ్యాయ ఉద్యమవ్యాప్తికి ఎనలేని కృషి చేసిన శ్రీ చెన్నుపాటి నేటి కార్యకర్తలందరికీ ఆదర్శప్రాయులు.



# ఉద్యమాల వినీలాకాశంలో "వేగుచుక్క" మైనేని

"చదువెందుకు చదువెందుకు చదువెందుకురా చరిత్రగతిని త్వరితగతిని మార్చేందుకురా"

అంటూ చదువుల సారాన్ని చాటిచెప్పడంలో నిర్విరామంగా నర్తించిన మైనేని వెంకటరత్నంగారి కలం 1990 జనవరి 12న ఆగిపోయింది. భౌతికంగా వారు కనుమరుగై ఏడు సంవత్సరాలు గడిచాయి. అయినా అజ్ఞానపు తిమిరంపై విజ్ఞానపు శరాలు సంధించాల్సి వచ్చినప్పుడల్లా ప్రగతి భావాల అమ్ముల పొదిలో ఆయన వదలివెళ్ళిన తుణీరవాలు దర్శనమిస్తూనే వుంటాయి. అందుకనే ఆయన మృతి సందర్భంగా "అరుణ కిరణమా, అధ్యాపక అభరణమా" "చెన్నుపాటి వారసుడు - చైతన్యపు ప్రేరకుడు" అంటూ ఉపాధ్యాయలోకం నివాళులర్పించింది. "ఉద్యమ రథచక్రాలలో ఒక చక్రం ఊడిపోయింది' ' అని శోకించింది. అయినా ఆయనిచ్చిన స్ఫూర్తితో ఐక్య ఉపాధ్యాయ ఉద్యమాన్ని మున్ముందుకు తీసుకెళ్తామంటూ ఊరూరా సభలు జరిపి ప్రతినబూనారు.

మైనేని 1929 అక్టోబరు 29న గుంటూరు జిల్లా అమృతలూరులో జన్మించారు. 1952 నుండి గ్రేడ్ 1 తెలుగు పండితునిగా పనిచేస్తూ వచ్చారు. అప్పటికే ఆయన సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. చెన్నుపాటి లక్ష్మయ్యగారి సాహచర్యంలో గుంటూరు జిల్లా టీచర్సు గిల్డు అధ్యక్షునిగా పనిచేశారు. ఉపాధ్యాయ ఉద్యమంలో ఎడాపెడా ధోరణులను ప్రతిఘటించి 1974లో విశాలవేదికగా యు.టి.యఫ్. ఏర్పాటైనప్పుడు అందులో ప్రధాన భూమిక నిర్వహించారు. యు.ఎటి.ఎఫ్. ఉద్యమ నిర్మాతలలో ఒకరుగా నిలిచారు. రాజమంద్రి మహాసభల సందర్భంగా మిగిలిన కొద్ది డబ్బుతో పత్రిక ప్రచురణ ప్రారంభించగా వారానికి ఒకసారి వచ్చి ఐక్యఉపాధ్యాయ పత్రిక ఎడిటింగ్ వ్యవహారాలు చూస్తూ వచ్చారు. అనేక సందర్భాలలో జీతం నష్టంపోయి సెలవులు కూడా పెట్టి పత్రిక కోసం శ్రమించారు. 1983లో ఉద్యోగ విమరణానంతరం పూర్తికాలం పత్రిక బాధ్యత నిర్వహిస్తూ వచ్చారు. అలా ప్రారంభమైన పత్రిక ఆయన తుది శ్వాస విడిచేనాటికి ఆరువేల జీవిత చందాదారులతో 18వేల సర్క్యులేషన్‌తో విరాజిల్లే స్థాయికి ఎదిగింది.

వారు స్వయంగా కవి - రచయిత. వారి కలం నుండి అనేక నాటికలు, నవలలు, కథలు, గేయాలు జాలువారాయి. ఉద్యమ కార్యకర్తలకు ఉపాధ్యాయునిగా కూడా ఆయన బోధించేవారు. కళల పట్ల కూడా అమితాసక్తిని ప్రదర్శించేవారు. ప్రజానాట్యమండలి కళారూపాలతో సన్నిహిత సంబంధం కలిగి వుండేవారు. నెల్లూరు మహాసభల సందర్భంగా విడుదల చేసిన యు.టి.యఫ్. పాటల కేసెట్‌కు వారే శిల్పి. రాజమంద్రి మహాసభల సందర్భంగా [illegible].టి.యఫ్. పతాక గేయాన్ని మైనేని గారు రచించారు. అదే సమయంలో కదలి గంగిశెట్టిగారు కూడా ఒక గేయం రచించారు. ఈ రెంటిలో ఏది అధికార గేయంగా [illegible] కదలి గంగిశెట్టి గారి గేయంలో వున్న ఔన్న[illegible]న్ని [illegible] అదే అధికార గేయంగా వుండాలని మైనేని గారు వప్పించారు. ప్రతిభను గుర్తించే వ్యక్తిగా, ప్రోత్సహించే వ్యక్తిగా సహచరుల్లో గుర్తింపు పొందారు.

ఎప్పుడూ చిరునవ్వుతో శాంత స్వభావిగా కనిపించే మైనేని కోపిష్టి అని ఎవ్వరూ భావించరు. ఎదిగొచ్చే కార్యకర్తలు, రచయితలు, కళాకారులను వెన్నుతట్టి ప్రోత్సహించడంలో ఎంత ఓపికగా వ్యవహరించే వారో లిటిగెంట్లు, విచ్ఛిన్నవాదులపట్ల అంత కరకుగా వ్యవహరించేవారు. ఆయన ఉపాధ్యాయ ఉద్యమనాయకునిగా వుంటూనే యువజనులకు మిత్రునిగా, మహిళలకు సలహాదారుగా, "ప్రజాశక్తి"కి రచయితగా, జనవిజ్ఞాన వేదిక కార్యకర్తగా పనిచేశారు. ఆయన అవిశ్రాంతంగా యు.టి.ఎఫ్. కర్తవ్యాల నిర్వహణలో వుండి ఆ క్రమంలోనే జన విజ్ఞాన వేదిక సమావేశానికి నెల్లూరు వెళ్ళారు. తిరుగు ప్రయాణంలో గుండెపోటుకు గురై మరణించారు.

మైనేని ప్రతిక్షణం సమాజమార్పు కోసం పరితపించిన కార్యకర్త. సమాజపు చీకటి కోణాల్ని చీల్చి చెండాడడానికే తన కలాన్నీ, గళాన్నీ సంధించారు. స్నేహశీలిగా, ఉద్యమనేతగా వుంటూ ఎందరో కలాలకు పదును పెట్టారు కార్యకర్తలను నాయకులుగా తీర్చిదిద్దారు.

ఉగాది శుభాకాంక్షలతో ....

పొదుపు భద్రత అభివృద్ధి

# జనబంధు చిట్‌ఫండ్ ప్రై. లిమిటెడ్

## స్టేషన్ రోడ్ - ఖమ్మం.





జనబంధులో ప్రవేశము -
మీ ముంగిట ఆనందాల హరివిల్లు.
మీ ఆర్థిక అవసరాలకు జనబంధు కురిపిస్తుంది సిరులజల్లు.
సభ్యుల, శ్రేయోభిలాషుల కోరికపై తక్షణ అవసరములకు
అత్యంత లాభదాయకమైన ఎక్కువ మొత్తంలో డివిడెంట్లు
ఇవ్వగల Open action Chit ఈ నెలలోనే
ప్రారంభించబడుచున్నది.

**[illegible] నెలలు - రు. 99, 000**

**రు. 25,000 ల నుండి రు. 1,00,000 వరకు చిట్స్ గలవు.**

పుచ్చకాయల పద్మ
మేనేజింగ్ డైరెక్టర్

రాయల లక్ష్మి
డైరెక్టర్

## 7వ రాష్ట్ర మహాసభలు ఆమోదించిన నిబంధనావళి సవరణలు

**1. V సంఘ సభ్యత్వము - నియమములు :**

6వ అంశము - సభ్యత్వ రుసుము రు. 20.00. సెంటరు హైస్కూలు కాలేజీలకు రు. 1.00; మండల, పట్టణశాఖలకు రు. 7.00లు చొ॥న, జిల్లాశాఖకు రు. 7.00; రాష్ట్రసంఘానికి రు. 5.00లు చెల్లించవలెను.

**2. VII (ఇ) రాష్ట్ర సంఘనిర్మాణం :**

(1)లో-ఫెడరేషన్‌కు అధ్యక్షుడు, సహఅధ్యక్షుడు, ప్రధాన కార్యదర్శి, తర్వాత పైముగ్గిరితో కలిసి మొత్తం 16 మంది కార్యదర్శి వర్గముగా వుండురు. వీరిలో ఒక మహిళా కార్యదర్శి అయినా తప్పనిసరిగా వుండవలెను.

**3. IX జిల్లాశాఖల నిర్మాణం :**

అంశం 7లో-కార్యదర్శి వర్గ సభ్యుల సంఖ్య 15కు మించకుండా కనీసం ఒక మహిళ అయినా వుండేలా ఎన్నుకొనవలెను. రిజర్వు సీట్ల సంఖ్యను ఆయాజిల్లా అవసరాన్ని బట్టి కౌన్సిలులో నిర్ణయించుకొనవలెను.

**4. X మండల, పట్టణ శాఖల నిర్మాణం :**

అంశం 4 : 3వ లైను నుండి, కార్యదర్శి వర్గంలో కనీసం ఒకరు అయినా మహిళ వుండేలా, 100 సభ్యత్వమునకు 5 మంది, 200లోపు సభ్యత్వానికి 7 మంది, 20 దాటిన సభ్యత్వమునకు 9 మంది మించకుండా ఎన్నుకొనవలెను. రిజర్వు సీట్ల సంఖ్యను వారి అవసరాలను బట్టి మండల, పట్టణ కౌన్సిలులో నిర్ణయించుకొనవలెను.

## హైదరాబాద్ భవననిధి

హైద్రాబాదు భవననిధికి పిలుపు యివ్వగానే ఒంగోలు మహాసభలలో అనేకమంది ముందుకు వచ్చి వేలకొద్ది విరాళాలు యిచ్చారు. ఇంకొందరు ఇంటికి పంపిస్తామన్నారు. వారిందిరికి ధన్యవాదాలు తెల్పుకొంటున్నాము.

| | |
|---|---|
| లోగడ ప్రకటించినది | రు. 12,05,592.00 |
| శ్రీ యన్. ప్రసాద్, టేకిశెట్టిపాలెం తూ.గో. | 116.00 |
| శ్రీ యం. సత్యనారాయణ పెన్నాడు ప.గో. | 558.00 |
| శ్రీ వి. వెంకటరెడ్డి కుముదవల్లి ప.గో. | 58.00 |
| ఎ పి.మల్లిఖార్జునశర్మ-జ్యోతిర్మయి వివాహం సందర్భమున, నెల్లూరు | 1000.00 |
| శ్రీ శ్రీనివాసు, సుగుణల వివాహసందర్భమున శ్రీ ఆర్. రామరాజు సఖినేటిపల్లి తూ.గో. | 1000.00 |
| శ్రీ యస్.యస్.బోసు కుమార్తె అరుంధతి దేవి వివాహ సందర్భమున కొల్లూరు గుంటూరు | 1000.00 |
| శ్రీ స్టాలిన్‌బాబు, సంజరాణి వివాహ సందర్భమున శ్రీ యన్. నారాయణ ద్వారా ఖమ్మం | 316.00 |
| శ్రీ డి. నరసింహాచార్యులు, తుళ్ళూరు, ప్రకాశం | 116.00 |
| శ్రీ శివశంకరరెడ్డి జ్ఞాపకార్థం వారి కుమార్తె శ్రీమతి నీరజ, చిత్తూరు | 1800.00 |
| శ్రీ కె. రఘునాదరావు, అనకాపల్లి, విశాఖ | 166.00 |
| శ్రీ ఎ గౌసు భాషా కుమార్తె జన్మదినం,వేటపాలెం, ప్రకాశం | 216.00 |
| శ్రీ టి.యస్. రామానుజాచార్యులు కుమార్తె ఫణికుమారి వివాహం సందర్భంగా వరంగల్ | 216.00 |
| శ్రీ పి. రఘునాథరెడ్డి కుమారుడు రవిచంద్ర జన్మదిన సందర్భమున కోస్గి, యం.నగర్ | 116.00 |
| శ్రీమతి జి.వి.జి. పద్మాబాయి కుమారుని వివాహం సందర్భమున శ్రీ పి. శ్రీనివాస్-ఆరవల్లి, ప.గో. | 125.00 |
| శ్రీ కె. జోజయ్య కుమార్తె సుధ వివాహం సందర్భంగా - పెదవడ్లపూడి, గుంటూరు. | 1,116.00 |
| మొత్తం | 12,13,577.00 |




## అధ్యయనం - అధ్యాపనం

నేను విద్యార్థి దశ చివర్లో వుండగా విన్న ఒక నినాదం నన్నెంతగానో ఆకట్టుకున్నది. "అధ్యయనం - అధ్యాపనం" ఎంత అర్థవంతంగా వుంది ఈ నినాదం. ఎన్నో సత్యాలు చదవవచ్చు. చదివినదంతా చెప్పవచ్చు. ఎంతో మంది ఉత్తమ పౌరుల్ని దేశానికి అందించవచ్చు. ఈ ప్రేరణే నన్ను ఉపాధ్యాయ వృత్తి వైపు ఆకర్షించింది. ఉపాధ్యాయునిగా తరగతి గదిలో అడుగుపెట్టిన రోజున పులకించిపోయాను. నేను అడుగుపెట్టిన మూడు నెలలకే విద్యార్థుల నుండి 'సమ్మె' మాట వినిపించింది. ఆ మాట వినగానే వళ్ళు మండింది. వెధవలు, వెధవ రాజకీయాల్లో చేరి జాతి భవిష్యత్‌ను భ్రష్టు పట్టిస్తున్నారని చిరాకు పడ్డాను. వారి నినాదాలు వింటుంటే వళ్ళు కంపరం పుట్టింది. చివరకు ఓ విద్యార్థిని పిలిచి అడిగాను. - "ఎందుకు బాబు సమ్మె చేస్తున్నారు?" అని. ఆ విద్యార్థి తటాపటాయింపు లేకుండా సమాధానం ఇచ్చాడు. "స్కాలర్‌షిప్ కోసం. ఆరునెలల నుండి స్కాలర్‌షిప్ లేదు. మెస్ మూసేస్తామంటున్నారు. అందుకే సమ్మె చేస్తున్నాం."

"స్కాలర్‌షిప్‌లు రాకుంటే అధికారులకు చెప్పుకోవాలి గానీ ఇలా వీధినపడితే వస్తాయా? రాజకీయ నాయకుల మాటలు విని దారి తప్పొద్దు బాబు" హితబోధ చేశాను. ఆ విద్యార్థి పిచ్చోడిని చూసినట్లు ఒక్క చూపు చూసి వెళ్ళిపోయాడు.

ఐదేళ్ళు గడిచాయి. "అధ్యయనం - అధ్యాపనం" నా ఊహల్లో భావం అమలు జరపలేకపోతున్న అసంతృప్తి వెన్నాడసాగింది. పైగా మూడు మాసాలుగా జీతాల్లేవు. పాలవాడికి అప్పు, బయట కొట్టులో అప్పు, పచారీ షాపులో అప్పు, ఎక్కడ చూసినా అప్పులు కావడంతో జీవితానికే ముప్పు ఏర్పడింది. ఈ స్థితిలో ఉపాధ్యాయులంతా సమావేశం అయ్యారు. సమ్మె చేద్దామన్నారు. సమ్మె మాట వినగానే కడుపులో దేవినట్లనిపించింది. గౌరవప్రదమైన వృత్తిలో వుంటూ అల్లరి మూకలా వీధినెక్కడమా అనిపించింది. కాని కాలే కడుపు 'జీతం' కావాలంటోంది. అందరితో పాటు తలూపాను.

జీతాల కోసం ఆందోళన మొదలైంది. ధర్నాల దశ దాటి పికెటింగులు దాకా వెళ్ళింది. ఒకరోజు పికెటింగ్ చేస్తుండగా పోలీసు లాఠీలు మా వీపులపై విలయతాండవం చేశాయి. దొరికిన వారిని దొరికినట్లు పొర్లించి పొర్లించి కొట్టారు. బాగా లాఠీ దెబ్బలకు గురైన నేను రోడ్డుపై పడివున్నాను. ఎవరో వచ్చి నా ముఖంపై సోడా నీళ్ళు చల్లి లేపి నడుపిస్తున్నారు. అలాగే నడిపించుకుంటూ ఇంటికి తీసుకెళ్ళారు. ఆ వ్యక్తిని ఎక్కడో చూసినట్టు అనిపించింది. గుర్తొచ్చింది. ఒకరోజు విద్యార్థిగా వుండి స్కాలర్‌షిప్పుల కోసం సమ్మె చేసిన వ్యక్తి.

"ఏం మాస్టారు! సమ్మెలెందుకో ఇప్పుడర్థమైందా?"

మౌనంగా తలూపాను.

"సమ్మె చేయడం రాజకీయమే మాస్టారు. రాజకీయాలన్నీ క్షుద్రం కావు. ప్రధానమంత్రి మొదలు ఫైళ్ళు చూసే గుమస్తాల వరకు పైసల మీదే పనులు చేసే విధానం; చేసిన దానిన అమలు జరపమనడం క్షుద్ర రాజకీయ కాదు మాస్టారు. మన జీవితం ఎలా వుండాలో ప్రభుత్వం నిర్ణయిస్తున్నది. నిర్ణయించింది మంచిదైనప్పుడు దానిని అమలు జరపమని పోరాడ్డం, అది చెడ్డదైనప్పుడు మార్చమని పోరాడ్డం అవసరమైన రాజకీయం మాస్టారు."

"నా కన్నా చిన్నవాడైనా ఈ సమాజాన్ని ఎంత బాగా అధ్యయనం చేశాడు. చివరకు నాతోనే ఒక కఠోర సత్యాన్ని అధ్యాపనం చేయించాడు. నూరేళ్ళు వర్ధిల్లు నాయనా!" అని మనస్సులోనే దీవించాను. పైకి మాత్రం గుంభనంగా తలూపాను.

చివరకు సమ్మె విజయవంతమైంది. జీతాలొచ్చాయి. అప్పుల బాధ తీరింది. జీవితంలో ప్రశాంతత నెలకొన్నది. కానీ జీవన గమనం ఎక్కడికన్న దానిపై ఏదో అశాంతి పీడిస్తూనే వుంది.

ఒకరోజు తత్వశాస్త్రం బోధిస్తున్నాను. "ఆలోచన - పదార్థం ఏది ముందు? దేని నుండి ఏది జనిస్తుందనేది తత్త్వశాస్త్రం ముందున్న ప్రశ్న. ఆలోచన నుండే పదార్థం జనిస్తుందని తత్త్వశాస్త్రం సమాధానం చెబుతోంది." పాఠం సాగుతూ వుంది.

ఇంతలో ఒక విద్యార్థి లేచాడు. "మాస్టారూ! ఆలోచించే మెదడు పదార్థం కదా? మెదడు ప్రక్కన బెట్టి ఆలోచించగలమా!? మరి మీరు చెప్పింది ఎలా సరైందంటారు?"

ఈ ప్రశ్నకు నివ్వెరపోయాను. ఏం సమాధానం చెప్పాలో తోచలేదు. పుస్తకం చేత పట్టుకొని క్లాసు నుండి వెళ్ళిపోయాను.

ఇంతలో చరిత్ర చెప్పే మాస్టారు ఎదురయ్యారు.

ఏం మాస్టారూ! అలా విచారంగా వున్నారు? ప్రశ్నించాడు.

"ఏం లేదండి ఈ రోజు ఒక విద్యార్థి వేసిన ప్రశ్న నా వృత్తినే ప్రశ్నించింది. చేతగాని నిస్సహాయునిగా నిలిపింది."

"ఎవడా పోకిరి వెధవ ?"

"అడిగిన విద్యార్థి పోకిరి కాదు మాస్టారు. సరైన ఆలోచన గల విద్యార్థి" అని జరిగినందంతా వివరించాను.

ఓస్ దీనికే కంగారుపడితే ఎలా మాస్టారూ? నిన్న నాకూ ఇలాంటి ప్రశ్నే ఎదురైంది" అన్నారు.

"ఏం ప్రశ్న మాస్టారూ?" కుతుహలంగా అడిగాను.

"చరిత్ర అంటే ఏమిటి? ఎవరైనా చెప్పగలరా?" అడిగానన్నారు.

ఒక విద్యార్థి లేచాడు. "మానవ సమాజం పుట్టుక; ఆహార సంపాదనా విధానం; సంపాదించిన ఆహారం ఎవరికి దక్కాలి? ఆ ఆహారాన్ని పండించే భూమిపై ఆధిపత్యం ఎవరిది? పండింది అనుభవించేదెవరు? ఇందువల్ల సంపన్నులైన దెవరు? నిష్టదరిద్రులుగా మిగిలి పోయిందెవరు? వారి మధ్య సంబంధాలేమిటి? అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పేదే చరిత్ర" అని సమాధానం ఇచ్చాడు.

"కాదు గడిచిపోయింది చరిత్ర. ఎవరి పాలన ఎలా సాగింది? ఏ రాజు ఎలా పాలించాడు" అన్నదే చరిత్ర అని చెప్పాను.

ఆ విద్యార్థి తాను చెప్పింది ఏమౌతుందో చెప్పమంటూ నిలదీశాడు. "ఆస్తిపరులను రక్షించేందుకు ఏర్పడిన రాజ్యాంగ రూపమే రాజరికమని, ఒక్క రాజకీయమే చరిత్ర అయితే కోట్లాది ప్రజలకు సంబంధించిన ఆర్థిక, ఆస్తి సంబంధాలు ఏమౌతాయి?" అని

ప్రశ్నించాడు. నాకు బాగా కోపం వచ్చి నోరు మూసుకుని కూర్చోమన్నాను. "ఇలాంటి వెధవల్ని చూసి మనం భయపడితే ఎలాగండి? వెధవ రాజకీయాలు ప్రవేశించాక అదనపు ప్రసంగాలు పెరిగిపోయాయి." అన్నాడు.

"కాదు మాస్టారు. వాళ్ళు చెప్పేదే నిజం. మనం ప్రభుత్వం ప్రచురించిన పుస్తకాలు చదివి అందులోని అజ్ఞానమే విజ్ఞానం అని బోధిస్తున్నాము. వాళ్లు రాజకీయమంటే ఏమిటో పరిశీలించారు. సమాజాన్ని పరిశోధిస్తున్నారు. శాస్త్రీయతను ఆమోదిస్తున్నారు. అదే అధ్యయనం అంటున్నారు. అలాంటి అధ్యయనంతో మన అధ్యాపనాన్ని ప్రశ్నిస్తున్నారు. ఒకప్పుడు సమ్మె చేయడం తప్పనుకున్నాను. తత్వశాస్త్రాన్ని పుస్తకంలో వున్నది మక్కికి మక్కి వల్లించాను. అలాగే మీరూ తర్కించకుండా చరిత్రను ఆమోదించారు. మన వృత్తి గౌరవప్రదంగా మనగలగాలంటే శాస్త్రీయ విద్య కావాలి. దాన్ని అధ్యయనం చేసి, బోధిస్తే వారు సమాజ శోధకులుగా తీర్చిదిద్దబడతారు. అప్పుడే మనల్ని అధ్యాపకులుగా అంగీకరిస్తారు. మన వృత్తి గౌరవాన్ని మనం కాపాడుకోవాలంటే జీతాల కోసమే కాదు. శాస్త్రీయ విద్య కోసం పోరాడాలి. అధ్యయనం - అధ్యాపనం సవ్యంగా సాగాలంటే శాస్త్రీయ విద్య కోసమూ పోరాడాలి. ఇదే ఉపాధ్యాయులందరి నినాదం కావాలి.' ' అంతవరకూ నాలోనే మిగిలిపోయిన అంతర్మథనం భావ రూపం దాల్చింది. భాష రూపంలో వ్యక్తమైంది.

## విజయకేతనం

- వడ్లమాను వెంకటేశ్వర్లు

సారస్వత సాహిత్య సౌరభాలు గుబాళించ
విద్యావైజ్ఞానిక సుగంధాలు మేళవించ
మేధావుల విజ్ఞాన వీచికలు జ్యోతులై భాసించ
సమత మమతానురాగాలు అరుణకుసుమాలై వికసించె
నిర్బంధ ప్రాథమిక విద్యావసరాలు గమనించి
మానవ వనరుల అభివృద్ధిని నిష్కర్షగా చర్చించి
రాజ్యాంగ సూత్రాల ప్రాముఖ్యత ప్రస్తావించి
తెల్లదొరల విద్యావిధాన సూత్రాల్ని గర్హించె.
సమాజానికే సవాలైన గ్లోబలైజేషన్
భవితకే గుదిబండయైన లిబరలైజేషన్
విద్యారంగ వెన్నుపోటైన ప్రైవేటైజేషన్
సమాజసంస్కర్త, ఒజ్జయే చేయాలి ఆపరేషన్
మహిళా సదస్సు మానవజాతికే మేలుకొలుపు
స్త్రీ పురుష సమానహక్కుల సాధనకి మరోమలుపు
చైతన్య సదస్సు దేశభవిత నిర్నేతల కొసమెరుపు
సర్వమానవ కళ్యాణాభిలాషుల తొలిగెలుపు
అనుభవాల అంతస్థుల్లో విహరిస్తూ
త్యాగాల దొంతర్లలో తేలియాడుతూ
పాతకొత్తతరాల మేళవింపు మేళాలతో
ఆనందాబ్ధిలో ఓలలాడె ఎడల ఎర్రదనం
సప్తమ మహాసభలు చైతన్యస్ఫోరకాలు
ఐక్యఉద్యమాలకు వేసిన వెలుగుబాట
ఉపాధ్యాయ ఉద్యమ పథంలో ముందడుగు
యు.టి.యఫ్. ఎగరేసిన విజయకేతనం

## వసంత కోకిల

- నేలపూడి విశ్వేశ్వరుడు

ఓ వసంత కోకిలా......... నువ్వయినా నవ్వవే కిలకిలా.........!
బొంగురుబోయిన కంఠంతో
బావురుమంటున్నావో
బాగున్నావా అంటున్నావో తెలియదు
తుఫాను రక్కసి మమ్మల్ని
తుడుచుకుపోయిందని తెలియదా!
తెలుగు ఉగాది తేజమంతా
వెలుగు తప్పిందని తెలియదా?
ఎండిన మామిడి కొమ్మలపై వెతుకుతున్నావా చిగుళ్లు?
మండుతున్న మా గుండెలోతుల్లో తొంగిచూడవమ్మా పగుళ్లు!
నేలనంటింది నవరసాల బెరుకు
నింగినంటాయి సరుకుల ధరలు
మచ్చుకైనా లేవు మామిడి పిందెలు
పచ్చడెలా చేయగలం ఉగాదినాడు?
పంచాంగ శ్రవణాల ముచ్చట్లు
పల్లెపడతుల జానపద చప్పట్లు
వసంతాలు వెదజల్లే పచ్చనిచెట్లు
కానరావు నేడు పులిహోర బొబ్బట్లు
బాధలు తీరని రోజులు రాలేదు
గాదెలు నిండని ఉగాది మాకెందుకు?
ఆశల దివిటీలు యింకా ఆరనందున
నిరాశల నణగద్రొక్కి నడుస్తున్నాం ముందుకు
ధాతనామ సంవత్సరకాలగర్భంలో
పాతరవేస్తాం కడగండ్ల గతం
ఈశ్వరనామ సంవత్సరానికి నువ్వయినా
చెప్పవే నీ కమ్మని గొంతుతో స్వాగతం

## ఆహ్వానం

- ప్రణవ

నవరసాల పచ్చడితో
నవ్యత నిచ్చే కాంతితో
ఉగాది కాంతకు ఆహ్వానం
ఇదిగోనమ్మా ప్రసాదం!
ఇలా ఉందేమని ప్రశ్నార్థకమా?
కల్తీ సరుకులు కల్తీ మనసులు
కల్తీగాలి కల్తీ నీరు
కల్తీలేనిది యిలలో లేదు
సర్వం కల్తీ సర్దుకుపొమ్మా!

(కరువు భత్యం పెంపుదల ఉత్తర్వులు)

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**ABSTRACT**

Allowances - Dearness Allowance - Dearness Allowance to the State Government Employees from 1-7-1996 - Sanctioned - Orders - Issued

FINANCE & PLANNING (FW. PC-I) DEPARTMENT

**G.O.(P) No. 46** **Dated : 15.3.1997**

Read the Following :

1. G.O. (P) No. 162, Finance & Planning (FW.PC.I) Department, Dated : 20.5.1993.
2. G.O. (P) No. 163, Finance & Planning (FW.PC.I) Department, Dated : 20.5.1996

**ORDER :**

Governement hereby order the revision of Dearness Allowance sanctioned in the G.O. 2nd read above to the State Government Employees in the Revised Pay Scales, 1993 from 1st July, 1996 at the following rates :

| Pay Range | Rate of D.A. per mensum |
|---|---|
| Basic Pay upto Rs. 6,330/- p.m. | 41.80% of pay subject to a maximum of Rs. 2,660/- |
| Basic Pay above Rs. 6,380/- p.m. and upto Rs. 9,820/- p.m. | 35.34% of pay subject to a minimum of Rs. 2,660/- and subject to a maximum of Rs. 3,420/- |
| Basic Pay above Rs. 9,820/- p.m. | 31.85% of pay subject to a minimum of Rs. 3420/- |

2. The Dearness Allowance sanctioned in para 1 above shall be payable to :

a) All Government employees, Teaching and Non-Teaching Staff of Zilla Praja Parishads, Madal Praja Parishads, Gram Panchayats, Municipalities, Municipal Corporations, Employees of Zilla Grandhalaya Samsthas, Agricultural Market Committees and also work charged Establishment who get monthly pay in regular pay scale in the Revised Pay Scales, 1993, full Time Contingent employees who have completed 5 years of Service but could not be coverted into regular last grade service.

b) Teaching and Non-Teaching Staff of Aided Institutions viz., Degree Colleges, Junior Colleges, Polytechinics and Schools who are drawing pay in the Revised Pay Scales, 1993.

c) Teaching and Non-Teaching staff of Universities including Regional Engineering College, Warangal drawing pay in the Revised Pay Scales, 1993.

3.1 Government also order revision of rates of Dearness Allowance Sanctioned in the Government Order 2nd read above, in respect of employees drawing pay in 1986 pay scales from 1st July, 1996 as indicated below :

| Pay Range | Cumulative Rate of D.A. |
|---|---|
| Pay upto Rs. 3,500 p.m. | 159% of pay |
| Pay above Rs. 3,500/- and upto Rs. 6000/- p.m. | 119% of pay subject to a minimum of Rs. 5565/- p.m. |
| Pay above Rs. 6000/- p.m. | 103% of pay subject to a minimum of Rs 7,140/- p.m. |

3.2 The above revised rates of Dearness Allowance are also applicable to the Teaching and other Staff of Government and Aided Degree Colleges, Universities including in A.P. Andhra University, Jawaharlal Nehru Technological University and Regional Engineering College, Warangal who are drawing pay in the A.P. Revised U.G.C. pay scales, 1986.

4. THE DEARNESS ALLOWANCE SHALL BE PAID IN CASH FROM 1st JANUARY, 1997.

5.1 The arrears on account of payment of Dearness Allowance for the period from 1st July, 1996 to 31st December, 1996 shall be credited to the General Provident Fund Accounts of the respective employees.

5.2 The Dearness Allowance payable for January, 1997 and February, 1997 will be paid alongwith the salary of March, 1997 payable in April, 1997.

5.3 However, in the case of employees who retire before 1st July, 1997, the arrears of Dearness Allowance shall be drawn and paid in cash.

5.4 In respect of those who do not have General Provident Fund Accounts, the arrears of Dearness Allowance for the period from July, 1996 to December, 1996 shall be credited to the Major Head "8005 - State Provident Funds - M.H.101. General Provident Fund - S.H.(03) Compulsory Savings Scheme under public Account," to be transferred to the General Provident Fund Accounts whenver opened. However, in case of employees who cease to be in service prior to the opening of G.P.F. Accounts, the arrears so impounded shall be drawn and paid alongwith interest on the date on which such employees cease to be in service.

5.5 The arrears of Dearness Allowance to be credited to the above Head of Account shall carry a simple interest of 12% p.a. to be calculated from 1st April, 1997, till the transfer of amounts to the General Provident Fund Accounts.

5.6 In the event of death of any employee before the issue of these orders, the legal heirs shall be entitled to get arrears of Dearness Allowance in cash.

6. THE TERM 'PAY' FOR THIS PURPOSE SHALL BE AS DEFINED IN F.R. 9(21)(a)(i)

7.1 The Drawing Officer shall prefer one bill on pay & Accounts Officer, Hyderabad and Pay and Accounts Officer/Asst. Pay and Account officer of A.P. Works Accounts Service of Treasury Officer, as the case may be, for the arrears amount for the period from 1-7-1996 to 31-12-1996 to be adjusted to the General Provident Fund Accounts in the case of employees who are having General Provident Fund Accounts.

7.2 Bills for the adjustment of arrears of Dearness Allowance to the Compulsory Savings Account as per para 5.4 shall be presented at the same time as bills for crediting the arrears of Dearness Allowance to the General Provident Fund Account as per para 5.1.

8. The Drawing Officers shall ensure that the bills are supported by proper schedules in duplicate indicating the details of the employees, the General Provident Fund account Number and the amount to be credited to the General Provident Fund Accounts to the Pay & Accounts Officer / Treasury Officers/ and Asst. Pay & Accounts Officers or pay and Accounts Officer of Projects as the case may be. The pay and Accounts Officer/Asst. Pay and Accounts Officer / Pay and Accounts Officer of Projects / District Treasury Officer / Sub-Treasury Officer shall follow the usual procedure of furnishing one copy of the schedules alongwith bills to the Accountant General based on which the Accountant General shall credit the amounts to the General Provident Fund Accounts of the individuals concerned. The 2nd copy of the schedules shall be furnished to the Drawing Officers with voucher Numbers.

9. All the Drawing Officers are requested to ensure that the bills as per the above orders are drawn and the amounts are credited to General Provident Fund Accounts at the latest by 30-4-1997. The Audit Officers (Pay & Accounts Officers District Treasury Officers and Pay and Accounts Officer of Projects etc.) are requested not to admit the pay bills of the office for the month of May, 1997 unless a certificate is enclosed to the bills to the effect that the arrears of difference in Dearness Allowance for the period from 1-7-1996 to 31-12-1996 are drawn and credited to the General Provident Fund Accounts.

10. In respect of employees working in Government Offices in Twin Cities, the Pay & Accounts Officer shall consolidate and furnish information in the Proforma annexed to this order to the Finance Department to reach on or before 31.7.1997.

11. All the Audit Officers (Sub-Treasury Officers) are requested to furnish the figures of the amounts credited to General Provident Fund Accounts and the amounts credited to Compulsory Saving Account in the prescribed Proforma enclosed, to the District Treasury by 31.5.1997.

12. The District Treasury Officers in turn shall consolidate the information and furnish the same in the same Proforma to the Director of Treasuries and Accounts by 30.6.1997 who in turn shall furnish the information to Government by 31.7.1997.

13. In respect of employees of Local Bodies the Drawing Officers shall furnish the above information in the prescribed Proforma to the Audit Officer of the District concerned before 30.4.1997 who will in turn furnish the consolidated information to the Director of Local Fund Audit by 31.5.1997. The Director of Local Fund Audit in turn shall furnish the consolidated information to the Secretary to Government, Finance & Planning (FW) Department by 31.7.1997.

14. In regard to the project Staff, the Director of Accounts of each project shall furnish the information to the Deputy Financial Adviser Finance & Planning (Project wing) Department by 31.5.1997 who in trun shall furnish the information to the Finance & Planning (FW.PC.I.) Department by 31.7.1997.

15. The above procedure shall be followed in the case of employees of Panchayat Raj Institutions, Municipalities, Universities and the Aided Institutions.

16. All the Drawing and Disbursing Officers and Audit Officers are requested to adhere to the above instructions and any deviation or non-compliance of these instructions will be viewed seriously.

17. All the heads of the Departments of Secretariat are requested to issue suitable instructions to the Drawing and Disbursing Officers under their control and see that these instructions are scrupulously followed. The Director of Treasuries and Accounts/Director of Local Fund Audit/Pay & Accounts Officer/Deputy Financial Advisor, Finance (Projects) are requested to issue suitable instructions to their subordinate Audit Officers so that these instructions are carefully followed by them.

18. In case of Teaching and Non-Teaching Staff of Universitites, the Finance Officer of the University shall ensure that the arrears are credited to the General Provident Fund Accounts of the respective employees and no cash payment is made for the period from 1-7-1996 to 31-12-1996. He shall furnish the inforamtion in the proforma to government by 31.7.1997.

19. The expenditure on the Dearness Allowance to the employees of Municipalities and Minicipal Corporations shall be met from their own funds.

20. In the case of employees who are governed by Contributory Provident Fund Rules, Employees Provident Fund Rules, the arrears of difference in Dearness Allowance shall be credited to the Contributor's Provident Fund Accounts. No Matching contribution however, need be paid by the Managements.

21. Government also sanction an adhoc increase of Rs. 5/- per month in cash to the village adminstrative officers and also the village servants from 01-07-1996.

22. All the Departments of Secretariat and Heads of Departments are requested to take prompt steps to provide additional funds under the relevant Heads of Accounts.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF ANDHRA PRADESH)

K. SUJATHA RAO,
Secretary to Government

(నాన్-గజిటెడ్ ఉద్యోగులకు పాతరేట్ల ప్రకారమే వృత్తిపన్ను)

**GOVERNMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

PROFESSION TAX - Keeping the recovery of profession Tax at the enhanced rates from the salaries of the Non-Gazetted Employees of the State Government in abeyance till further Orders - Orders - Issued.

FINANCE AND PLANNING (FINANCE WING - EBS. REV) DEPARTMENT

**G.O.Ms. No. 48 Dated : 15th March, 1997**

Read the Following :

1. G.O.Ms.No. : 202, Fin. & Plg (FW.PF.I) Dept., Dt. 21-3-87.
2. G.O.Ms.No. : 227, Fin. & Plg (FW.EBS.REV) Dept., Dt. 21-9-96
3. G.O.Ms.No. : 135, Fin. & Plg (FW.EBS.REVP) Dept., Dt. 29-10-96.
4. G.O.Ms.No. : 315, Fin. & Plg (FW.EBS. REV) Dept., Dt. 13-11-96
5. G.O.Ms.No. : 327, Fin. & Plg (FW.EBS. REV) Dept., Dt. 23-11-96
6. G.O.Ms.No. : 33, Fin. & Plg (FW.EBS.REV) Dept., Dt. 21-2-97
7. Representation from the Chairman, Joint Action Commitee of Employees, Teachers and Workers, A.P. Dt. 1-3-1997.

8. Representation from the TNGO's Association.
9. Representation from the A.P. Secretariat Association.

**ORDER :**

In the Government order 2nd read above, orders were issued enhancing the rates of profession Tax with effct from 1.3.96. After carefully considering the representations received from the Employee's Associations, Government had issued orders in the Government order 6th read above for the postponement of recovery of profession Tax at the enhanced rates from the salaries of the Non-Gazetted Employees of the State Government till the end of February, 1997.

2. After careful consideration of the matter further, Government hereby order that the recovery of profession Tax at the enhanced rates from the Non-Gazetted employees of the State Government, be kept in abeyance till further orders. However, profession Tax shall continue to be recovered from the salaries of the Non-Gazetted Employees of the State Government at the pre-enhanced rates.

3. These orders are applicable only to the Non-Gazetted Employees of the State Government and profession Tax shall continue to be recovered at the enhanced rates from all other Categories.

(BY ORDER AND IN THE NAME OF
THE GOVERNOR OF A.P.)

B. SUBBA RAO
Secretary to Government

ఏజన్సీ ప్రాంత ఉద్యోగులకు 1.3.96 నుండి ప్రత్యేక
అలవెన్సులు చెల్లింపు ఉత్తర్వులు

## GOVERNMENT OF ANDHRA PRADESH
## ABSTRACT

Allowances - Sanction of Special Compensatory Allowance and Additional House Rent Allowance in lieu of Rent Free Quarters in Scheduled Areas from 1.3.1996 - Orders - Issued.

FINANCE & PLANNING (FW.TA) DEPARTMENT

**G.O.Ms. No. : 49** **Dated : 15.3.1997**

Read the Following :

1. G.O.Ms.No. : 297, Fin. & Plg (FW.TA) Dept., Dt. 28-12-91.
2. G.O.Ms.No. : 298, Fin. & Plg (FW.TA) Dept., Dt. 28-12-91
3. G.O.Ms.No. : 9. Fin. & Plg (FW.TA) Dept., Dt. 17-01-92.
4. G.O.Ms.No. : 137, Fin. & Plg (FW.TA) Dept., Dt. 15-04-93
5. G.O.Ms.No. : 228, Fin. & Plg (FW.TA) Dept., Dt. 29-05-93
6. G.O.Rt.No. : 973, Fin. & Plg (FW.TA) Dept., Dt. 16-6-95.
7. Representation from the Chairman, Joint Action Committee of Employees, Teachers and Workers, A.P. Dt. 1-3-1997.
8. Representation from the TNGO's Association.

**ORDER :**

Government have issued orders vide reference 2nd & 3rd read above for payment of Special Compensatory Allowance and Additional H.R.A. in lieu of Rent Free Quarters to the employeees working in Scheduled Areas in Scheduled Areas more specifically shown in the Annexure to G.O. 1st read above & 3rd read above upto 28.2.1993, and the said orders were extended from time to time and lastly extended upto 29.2.1996 vide reference 6th read above.

2. After careful examination, Government hereby sanction the Special Compensatory Allowance and additional H.R.A. in lieu of Rent Free Quarters to the employees working in Scheduled areas mentioned in the Annexure to G.O. 1st & 3rd read above at the rates mentioned in the G.O. 5th read above, from 1.3.1996 until further orders.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)

K. SUJATHA RAO
Secretary to Government (IF)

ప్రాజెక్ట్ ఏరియా ఉద్యోగులకు 1-3-96 నుండి ప్రత్యేక అలవెన్సులు చెల్లింపు

## GOVERNMENT OF ANDHRA PRADESH
## ABSTRACT

Allowances - Sanction of Construction Allowance and Rent Free Quarters or Additional H.R.A. in lieu there of to the employees engaged in construction activities in project Areas from 1.3.196 - Orders - Issued.

FINANCE & PLANNING (EW. TA) DEPARTMENT

**G.O. Ms. No.:50** **Dated : 15.3.1997**

Read the following :

1. G.O.Ms.No. : 301, Fin. & Plg (FW.TA) Dept., Dt. 28-12-91.
2. G.O.Ms.No. : 303, Fin. & Plg (FW.TA) Dept., Dt. 28-12-91
3. G.O.Ms.No. : 229, Fin. & Plg (FW.TA) Dept., Dt. 29-5-93.
4. G.O.Rt.No. : 974, Fin. & Plg (FW.TA) Dept., Dt. 16-6-95
5. G.O.Rt.No. : 975, Fin. & Plg (FW.TA) Dept., Dt. 16-6-95
6. Representation from the Chairman, Joint Action Committee of Employees, Teachers and Workers, A.P. Dt., 1-3-1997.
7. Representation from the TNGO's Association.

**ORDER :**

Government have issued orders vide references 1st and 2nd read above for payment of Construction Allowance and Rent Free Quarters or Additional House Rent Allowance in lieu thereof to the employees working in the projects mentioned in the Annexure to G.O. 1st read above and the project mentioned in the G.O. 2nd read above upto 28-2-1993 and the said orders were extended from time to time and last extended upto 29.12.1996 vide references 4th and 5th read above.

2. After careful examination Government hereby sanction the Construction Allowance and Rent Free Quarters or Additional House Rent Allowance in lieu thereof to the Employees working in the projects mentioned in the Annexure to G.O. 1st read above and the project mentioned in the G.O. 2nd read above, at the rates mentioned in the G.O. 3rd read above from 1.3.1996 until furher orders.

(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)

K. SUJATHA RAO
Secretary to Government (IF)

వైద్య కారణాలపై రిటైరయిన వారి కుటుంబ సభ్యులకు
కారుణ్యపు నియామకము గురించి

GOVERNMENT OF ANDHRA PRADESH
GENERAL ADMINISTRATION (SER.A) DEPARTMENT

**Memo. No. 347/Ser.A/96-9.** **Dated : 15-3-1997**

**Sub :** Public Services - Subordinate Services - Compassionate appointment of son/daughter/spouse of the Government employees who retire on medical invalidation - Prior approval of Government - Further instructions - issued.

